# నవ్యసాహితీ లహరి

## నవల, కథానిక, వ్యాసం, నాటిక

డా॥ అక్కిరాజు రమాపతిరావు (మంజుశ్రీ)
డా॥ పోరంకి దక్షిణామూర్తి
ఆచార్య వేటూరి ఆనందమూర్తి
డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి

ఉపన్యాస మంజరి

ప్రచురణ :




రిజిష్టర్డు సంఖ్య 1/6

యువభారతి

తిలక్ రోడ్ - హైదరాబాదు - 500 001

**NAVYA SAHITHEE LAHARI**

**A Collection of Lecture - Essays on Telugu Novel, Telugu Short Story, Telugu Essay and Telugu one-act play by**


**Dr. Akki Raju Ramapathi Rao (Manjushree)**
**Dr. Poranki Dakshina Moorthy,**
**Prof. Vetoori Ananda Moorthy and**
**Dr. Iriventi Krishna Moorthy.**


---




ప్రచురణ సంఖ్య : 121

ప్రథమ ముద్రణ : అక్టోబర్ 1987

ప్రతులు : 3,200

ముఖ చిత్ర రచన : శ్రీ శీలా వీరాజు

ముద్రణ : ఎ. ఎస్. ఆర్ట్ ప్రింటర్స్
తిలక్ నగర్, న్యూనల్లకుంట,
హైదరాబాద్ - 500 044.

ముఖ చిత్ర ముద్రణ : బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్
చిక్కడపల్లి, హైదరాబాదు.

ప్రతులకు :

**యువభారతి కార్యాలయం**
*ఆంధ్ర సారస్వత పరిషత్ భవనము*
*తిలక్ రోడ్, హైదరాబాదు-500 001*

వెల : రూ॥ **16-00**

రు. 10-00 ప్రచురణ పూర్వ విరాళం ఇచ్చి సహకరించిన **సాహితీ ప్రియులు** ఈ పుస్తకాన్ని అందుకుంటారు.



# యువభారతి పరిచయం

ఉత్తమ అధ్యయనంవల్ల వ్యక్తిత్వానికి సమగ్రత చేకూరుతుంది. ఉత్తమభావ ప్రసరణానికి పుస్తకాలు చక్కనిసాధనాలు. అందరికీ అందుబాటులోఉండే విధంగా మంచి పుస్తకాలను అందించే ప్రయత్నానికి యువభారతి పూనుకొని కడచిన ఇరువది మూడేండ్లుగా పాత క్రొత్తల మేలుకలయికను ప్రాతి పదికగా పెట్టుకొని 121 పుస్తకాలను ప్రచురించింది. ఉపన్యాస మంజరీ కార్యక్రమాలను సదస్సులను నిర్వహించింది.

సహృదయుల సహకారంతో పుస్తకాల అమ్మకంవల్ల వస్తున్న ద్రవ్యంతో పుస్తకాలను ప్రచురిస్తూ తక్కువ వెలకు ఎక్కువ విలువ ఉన్న సాహిత్యాన్ని అందించడానికి యువభారతి ఉద్యమిస్తున్నది. ఉత్తమ సాహిత్య ప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని ప్రచురణలను వెలువరిస్తున్నదే కాని మా సంస్థ వ్యాపార సంస్థ కాదు.

భారత దేశంలో ఎక్కడున్నా సరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో 10140 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా 1517 మంది, భారతీ భూషణులుగా 138 మంది చేరి చేయూతనిచ్చినారు.

ఉదుతా భక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచినారు ప్రజలు. వారి సౌహార్దం, భాషా ప్రియత్వం - ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి, దేశీయుల్లో అధ్యయన శీలత, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాము.

సహృదయుల సహకారాన్ని ఆకాంక్షిస్తూ....

అధ్యక్షుడు

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి

# మా మాట

ఆంగ్ల భాషా వాఙ్మయాంతో దాదాపు నూటయాభై ఏళ్ల నుండి ఆంధ్రుల కేర్పడిన సంబంధానికి ఫలితంగా అనేక వినూత్న సాహితీ ప్రక్రియలు తెలుగులో ప్రభవిల్లి వికసించినవి. మానవ జీవితానికి సన్నిహితంగా ఉండి ప్రజల విభిన్న ధోరణులను నిత్యజీవితంలో వారెదుర్కొనే సంఘటనలను సమస్యలను, భిన్న మనస్తత్వాలను, భౌతిక, మానసిక స్వరూప స్వభావాలను అనుభవాలను, అనుభూతులను, ఆలోచనలను, ఆవేదనలను, ఆశయాలను సరళమైన శైలిలో అభివ్యక్తం చేయడానికి అధునిక సాహితీ ప్రక్రియలు ఎంతో అనుకూలంగా అవతరించినవి.

ఈ సృజనాత్మక ప్రక్రియలలో జీవం, చైతన్యం తొణికిసలాడాలంటే రచయితకు లేదా కవికి - ఎంతో ఆలోచనాశక్తి, సమాజంపట్ల ఒక నిర్దుష్టమైన అవగాహన, జీవితానుభవం, చారిత్రక పరిణామాలను అభ్యుదయ దృక్పథంతో అవగాహన చేసుకొనే శక్తి ఉండాలి. పాఠకులలో ఆలోచనలు రేకెత్తించి, వారి మానసిక పరిధులను విస్తృతం చేసే రచనలు చేయగలిగిననాడు రచయిత ధ్యేయం, లక్ష్యం నెరవేరినట్లే. ఒక్క వాక్యంలో చెప్పాలంటే—"కవి భావజలజ కవి" కావాలి

ఈ నేపథ్యంలో ఆంగ్లప్రభావంతో ఆధునికాంధ్రసాహిత్య నందనవనంలో విరిసిన నాలుగు ప్రక్రియలు నవల, వ్యాసం, నాటిక, కథానిక ... గురించి పరిచయం చెయ్యాలనే ఉద్దేశ్యంతో యువభారతి 23 వార్షికోత్సవాల సందర్భంగా రూపొందించి సాహితీప్రియులకు అందించే కార్యక్రమం- "నవ్యసాహితీ లహరి" ఈ నాలుగు ప్రక్రియలను గూర్చి ఆంశికంగానో. అతివిపులంగానో పండితులకూ, పరిశోధకులకూ పనికివచ్చేపద్ధతిలో చాలా సారస్వతం తెలుగులో ఇప్పటికే ఉన్నా నవల, వ్యాసం, నాటిక కథానికల గురించి సమగ్రమైన పరిజ్ఞానం ఒక చిన్న పుస్తకంలో నేటి యువతరానికి పరిచయం చేయాలనే ఉద్దేశ్యంతో ఈ కార్యక్రమాన్ని మేము రూపొందించినాము.

నవలను గూర్చి డా॥ మంజుశ్రీ, కథానికను గూర్చి డా॥ పోరంకి దక్షిణా మూర్తి, వ్యాసాన్ని గూర్చి ఆచార్య వేటూరి ఆనందమూర్తి, నాటికను గూర్చి డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి వ్యాసాలందించి, ప్రసంగించి మాతో సహకరించినందుకు వారికి మా కృతజ్ఞతా పూర్వకమైన అభివందనాలను తెలియ జేస్తున్నాము.

సహృదయులు మేము నిర్వహిస్తున్న సాహిత్యోద్యమాన్ని ఎప్పటివలెనే ప్రోత్సహిస్తారని, యువభారతి మనుగడకు సర్వవిధాలా తోడ్పడతారనీ ఆకాంక్షిస్తున్నాము,

తేది. 19-10-1987

డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు
ఉపాధ్యక్షుడు
యువభారతి

# ఎందరో మహానుభావులు

- నవ్యసాహితీలహరి కార్యక్రమాన్ని రూపొందించడంలో మాతో సహకరించిన పెద్దలు శ్రీ దేవులపల్లి రామానుజరావు, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారలు....

- నవ్యసాహితీ లహరి ఉపన్యాస మంజరీ కార్యక్రమాలలో ఉపన్యాసాల నివ్వడమే కాకుండా, వ్యాసాలను కూడా సమర్పించి ఈ గ్రంథానికి రూపు కల్పించిన సాహిత్యవేత్తలు.... డా॥ అక్కిరాజు రమాపతి రావు, డా॥ పోరంకి దక్షిణామూర్తి, ఆచార్య వేటూరి ఆనందమూర్తి డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారలు....

- మా సం॥ 120వ ప్రచురణ డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారి సిద్ధాంత గ్రంథం.... 'కవిసమయములు' గ్రంధావిష్కరణసభకు అధ్యక్షత వహించిన ఆచార్య సి. నారాయణరెడ్డిగారు, గ్రంధాన్ని అవిష్కరించిన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, గ్రంథ ప్రశస్తిని గురించి ప్రసంగించిన ఆచార్య పుల్లెల రామచంద్రుడు గారలు....

- 'నవ్యసాహితీ లహరి' ఉపన్యాస మంజరి సభలకు అధ్యక్షత వహించిన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, ఆచార్య ఎం. కులశేఖరరావుగారలు, 'నవ్య సాహితీ లహరి' గ్రంథాన్ని అవిష్కరించిన శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు గారు,

- మా యువభారతి ప్రచురణలను ముచ్చటైన ముఖచిత్రాలతో తీర్చిదిద్ది అక్షరాలంతరణను సంతరించిన చిత్రకారులు శ్రీ శీలా వీర్రాజుగారు-

- మా ప్రచురణలను ముద్రించిన ఎ. ఎన్. ఆర్ట్ ప్రింటర్స్, ముఖ చిత్ర ముద్రాపకులు బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్....

- బ్లాకుల నిర్మాణంలో శిల్పులు మోహన్ ప్రాసెస్ వారు,

- నవ్య సాహితీ లహరి ఉపన్యాస కార్యక్రమాలను తమ ప్రాంగణంలో నిర్వహించుకోవడానికి దయతో అనుమతించిన ఆంధ్ర సారస్వత పరిషత్తు పెద్దలు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, కార్యాలయ నిర్వాహకులు శ్రీ హరికిషన్‌రావుగారు;

- మా ప్రచురణ కొనుగోలులో ఇతోధికంగా ప్రోత్సహిస్తున్న రాజా రాంమోహన్‌రాయ్ గ్రంధాలయ ఫౌండేషన్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గ్రంధాలయ శాఖ డైరెక్టర్, జిల్లా గ్రంధాలయాధికారులు.

- మా యువభారతీ కార్యక్రమాలు ఇతోధికంగా లోకానికి తెలియ జెప్పి ప్రోత్సహించే పాత్రికేయులు....

- మా సభలకు అవసరమైన ఫర్నిచర్‌ను, విద్యుద్దీపాలంకరణను సమకూర్చిన యూసఫ్ అండ్ కంపెనీ, హనుమాన్ ఎలక్ట్రికల్స్ వారు;

- మా సాహిత్య కార్యక్రమాలకు వచ్చి 'యువభారతి' సాహిత్యోద్యమాన్ని సాదరంగా ప్రోత్సహిస్తున్న సాహిత్య స్నేహ మూర్తులు, సహృదయులైన తెలుగు వారు....

- 'యువభారతి' చైతన్యం ఒక సమైక్య కృషి, ఈ కృషిలో కష్ట నిష్ఠురాలకోర్చి శ్రమించిన యువభారతి సభ్యులు, అండదండలను అందించిన 'సాహితీ మిత్రులు', 'భారతీ మిత్రలు', భారతీ భూషణులు....

- కార్యక్రమ నిర్వహణలో రేయింబవళ్ళు శ్రమించి కార్యక్రమాలను దిగ్విజయం చేయడంలో సహకరించిన యువభారతి కార్యాలయం సిబ్బంది....

ఎదురుగా కనబడేది ఇందరు! కనుమరుగున ఉండి మమ్మల్ని దీవించేది ఇంకెందరో !!

**అందరికీ మా వందనములు**

ఎస్. వి. ప్రభాకరరావు

కార్యదర్శి - యువభారతి

# అనుక్రమణిక



# నవ్యసాహితీ లహరి

## ఉపన్యాస మంజరి-పుస్తక ప్రచురణ

కార్యక్రమ వివరణ

స్థలం : ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు, తిలక్‌రోడ్, హైదరాబాద్.

మొదటి సమావేశము :

18 అక్టోబరు 1987, ఆదివారం.

అధ్యక్షులు :

శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు

ఉపన్యాసము : "నవల" గూర్చి

డా॥ అక్కిరాజు రమాపతిరావు

"నాటిక"ను గూర్చి

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి

రెండవ సమావేశం :

19 అక్టోబరు 1987, సోమవారం.

అధ్యక్షులు :

ఆచార్యయం.కులశేఖరరావుగారు

"వ్యాసాన్ని" గూర్చి

ఆచార్య వేటూరి ఆనందమూర్తి

"కథానిక"ను గూర్చి

డా॥ పోరంకి దక్షిణామూర్తి

''నవ్యసాహితీ లహరి'' ఆవిష్కర్తలు

శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావుగారు

# న వ ల

## తెలుగు నవల-ఉద్భవ వికాస పరిణామాలు

### డా॥ అక్కిరాజు రమాపతిరావు (మంజుశ్రీ)

భారతదేశంలో ఇంగ్లీషు వాళ్ళ పరిపాలన మొదలైన తర్వాత భారతీయ సామాజిక జీవనంలో ఎన్నో మార్పులు వచ్చాయి. చిన్న పల్లెటూరి నుంచి పెద్ద పట్టణానికి వచ్చి ఒక సామాన్య మానవుడు జీవించవలసి వచ్చినప్పుడు అతడి జీవిత విధానం ఎంతగా మారిపోతుందో అటువంటిదే సంభవించింది భారతీయ సమాజ జీవనంలో కూడా.

గ్రామీణ జీవితానికి అలవాటు పడ్డ సమాజ జీవితంలో క్రమంగా పట్టణం, నగరం, బతుకుతెరువు దృష్ట్యా ఆకర్షకాలైనాయి. ప్రయాణ సౌకర్యాలు పెరగటంతో జీవితావగాహన పరిధి విస్తృతమైంది. అచ్చు యంత్రాలు, వార్తాపత్రికలు, విదేశాలతో వ్యాపారం, ఉద్యోగాలు, నెల జీతాలు, ఇంగ్లీషు నేర్పే పాఠశాలలు, యంత్రోత్పాదక నిత్యావసరవస్తువులు, విదేశీయమైన మిల్లు బట్టలు, భారత దేశంలోని సాంఘిక విలువలలో కొత్త ధోరణులు ప్రవేశించటానికి కారణమైనాయి.

ప్రజల్లో వస్తు సంగ్రహణం పట్ల ఆసక్తి ఎక్కువైంది. వస్తు మార్పిడి పద్ధతి పోయి ద్రవ్య చలామణి పద్ధతి ప్రవేశించింది. కులవృత్తులు క్షీణించాయి. పల్లెటూళ్ళు స్వయం పోషక జీవన విధానానికి స్వస్తి చెప్పాయి. ప్రకృతికి మానవ జీవితానికి అన్యోన్యత తగ్గిపోయింది. అందువల్ల దేశీయ సాంస్కృతిక విలువల ప్రాబల్యం తగ్గిపోతూ వచ్చింది. సంఘ జీవనంలో ఒక పరివర్తన మొదలైంది.

ఏతావతా ఇంగ్లీషు వారి రాకతో వాళ్ళ సాంఘిక సాహిత్య సాంస్కృతిక ధోరణుల పరిచయంతో, ప్రభావంతో భారత దేశంలోనూ తత్రాపి తెలుగు దేశంలోనూ వచ్చిన భావ వైఖరులను ఈ విధంగా క్రోడీకరించవచ్చు.

1. గ్రామీణ జీవితంలోని వివిధ కులాల పరస్పర సాంఘికాధార దృక్పథం శిథిలమవుతూ వచ్చింది.

2. ధాన్య వినిమయం బదులుగా డబ్బు ప్రవేశించింది.

3. పై తరగతులలో ఇంగ్లీషు చదువులపట్ల ఆసక్తి మొదలై ఉద్యోగాల కోసం అర్రులు చాచడం ప్రారంభమైంది.

4. ఇంగ్లండులోని యాంత్రికోత్పాదక వస్తువుల ముందు భారత దేశ కులవృత్తులు దెబ్బ తిన్నాయి.

5. ప్రయాణ సౌకర్యాలు విస్తరించడం వల్ల, కోర్టులు, రెవెన్యూ కచ్చేరీలు పనిచేయడం మొదలైనందువల్ల, పత్రికలు ప్రారంభమైనందు వల్ల జీవితానుభవ పరిధి విశాలతరమైంది.

6. సాంస్కృతికమైన నమ్మకాలు సడలిపోవటం మొదలైంది.

7. ఇంగ్లీషు చదువులు, బాలికా పాఠశాలలు, సంఘంలోని లోపాల పట్ల దృష్టిని ప్రసరింప చేశాయి.

8. విదేశీ మత ప్రచారకుల మత వ్యాపనం వల్లా, భారతదేశ సాంఘిక వ్యవస్థలోని అడుగుస్తరంలోని కులాల మతం మార్పిడుల వల్లా అంతవరకూ అంగీకృతమవుతూ వచ్చిన విలువలలోని అహేతుకత, అమానుషతలు సమాధానాలు కోరాయి.

9. సాహిత్యంలో ఇతివృత్త ప్రాధాన్యంలో ధోరణులు మారిపోయి లౌకిక జీవనం గూర్చిన రచనలకు ప్రాచుర్యం మొదలైంది.

10. సాహిత్యంలో ప్రక్రియా వైవిధ్యం ప్రారంభమైంది. పాఠకుల సంఖ్య పెరుగుతూ వచ్చింది. ముద్రణ యంత్రాలు, పత్రికలవల్ల సాహిత్య వ్యాప్తికూడా పెరిగింది.

11. సాంఘిక జీవనంలో కొత్తగా సంపన్న వర్గం, నవీన భూస్వామ్య వర్గం వ్యవస్థితమవుతూ వచ్చింది.

12. బ్రాహ్మ సమాజం మొదలైన సాంస్కృతిక సంస్కరణోద్యమాల ప్రభావం విద్యావంతులను ఆకర్షించి హేతువాదతర్కం మొదలై ముందుచూపు వెనక చూపు అంటూ సిద్ధాంత చర్చలు మొదలైనాయి.

ఆనాటి విద్యావంతులలోను, ఇంగ్లీషు చదువుల ద్వారా పెద్ద ఉద్యోగాలలోకి వచ్చిన వారిలోనూ ఆలోచనా ధోరణి ఏ విధంగా ఉండేదో మీర్ షుజాయత్ ఆలీఖాన్ అనే గొప్ప రెవెన్యూ అధికారి మాటల ద్వారా తెలుసుకోవచ్చు. వీరిది నరసాపురం. సివిల్ స్టేట్యుట వరీ సర్వీసులో దేశీయుడు పొందదగిన ఉత్తమ హోదాను వీరు పొందారు. వీరేశలింగం పంతులుగారి సమకాలికుడీయన. పంతులు గారి కన్నా ముందే విద్వన్మనోహారిణి అనే పత్రికను కూడా నరసాపురం నుంచి ప్రారంభించిన వారు. ఈ పత్రిక నాలుగైదు నెలలు వచ్చిన తర్వాత వీరేశ లింగం పంతులు గారి వివేకవర్ధనిలో విలీనమైంది. అప్పట్లో వివేకవర్ధనిలోని ఇంగ్లీషు విభాగానికి షుజాయత్ ఆలీఖాన్ గారే సంపాదకత్వం వహించే వారని పంతులు గారు స్వీయ చరిత్రంలో చెప్పారు. నూరు నూటపదిహేను సంవత్సరాల క్రితమే విద్యాధికులైన ఒక ముస్లింతాను మెట్టిన దేశాన్ని అభిమానించి తెలుగులో పాండితీస్ఫోరకమైన పత్రిక నడపటం విశేషం శ్రీ ఖాన్ గారిట్లా వ్రాశారు వివేక వర్ధనిలో

"It is admitted by one and all that western lore has worked wonders among the natives of India. We are quite aware that English education has rendered natives more refined in their menners, has dispelled the mist of superstition from the minds of several of them if not many, and has Considerably developed their moral calibre wherever it is properly imparted. No sensible person can be blind to the great boon that occidental learning has conferred on natives. Native socicty whether Mohammadan or Hindu, owes all its modern improvement to the English, many a

**gentleman of which nation is sincerely acknowledged as a real benefactor to her Majestis Indian subjects."** [1]

ఈ అభిప్రాయం కింద షుజాయిత్ ఆలీఖాన్‌గారి పేరు ఎమ్. ఎస్. ఎ. కె. అని పొడి అక్షరాలతో ఉంది 1875 సంవత్సరాల నాటికే విద్యావంతుల అభిప్రాయాలలో ఇంగ్లీషు విద్య పట్ల ప్రబలమైన ఆరాధనా భావం ఉండేదనటంలో ఆశ్చర్యం లేదు. మహమ్మదీయులలో ఘోషా పద్ధతిని ఇంట్లో బయటా సడలించింది ఇప్పటివరకూ ఈయన ఒక్కరే అని వీరిని గురించి హిందూ జన సంస్కారిణి పత్రిక 1885 లో వ్రాసింది. ఈయన అట్టే కాలం జీవించలేదు. నలభై సంవత్సరాలు కూడా నిండకుండానే దివంగతుడైనాడు.

ఇక ఆనాడు గణుతి కెక్కిన ఇంగ్లీషు పండితుడు వావిలాల వాసుదేవశాస్త్రి గారి అభిప్రాయాలు గమనించవచ్చు. ఈయన బి. ఏ. పరీక్షలో సర్వ ప్రథముడిగా మేక్డోనాల్డ్ ఇంగ్లీషు పతకం పొందినవారు. షేక్స్పియర్ నాటకాలను తెలుగులోకి తెచ్చిన వారిలో ఈయనే మొదటి వారు.

అప్పట్లో ప్రిన్స్ ఆఫ్ వేల్సు భారతదేశాన్ని సందర్శించటానికి రాగా వారికి స్వాగత పద్యాలు సమర్పించారు వాసుదేవశాస్త్రిగారు.

ఇవి 1875 డిసెంబర్ వివేకవర్ధని పత్రికలో ప్రచురితమైనాయి.

దేశమెల్లను బాదయ్యె, దేవిడీలు
పేరు మాత్రమే కాని విద్యారమకును
విధవ భావంబు సమకూరె వ్రేటువడి యె
రూఢిగా హిందుదేశపు ప్రొద్దుగ్రుంకె
శాస్త్రములు పుస్తకంబుల శరణు పొందె
దుష్ట జనులెల్ల సద్యోగధుర్యులైరి
లంచములు మించె జేటుగాలంబు వచ్చె
నయ్యె దేశము దానధమాధమంబు

1. 1875 అక్టోబర్ వివేకవర్ధని సంచిక, సం. 2 సం 1.

దేవునికి దయవచ్చె మా దేశమందు
నెపుడు కుంపిణి వర్తకు లేగుదెంచి
రపుడె మముఁబట్టుకున్న దైన్యంబుపోయె
బోల్చిచూడ మా పాలింట బ్రొద్దుపొడిచె"

అని ఇంగ్లీషు వారు ఈ దేశానికి రాకముందూ వచ్చిన తరవాత పరిస్థితుల వ్యత్యాసాన్ని అంచనా వేశారు శాస్త్రిగారు. అంటే ఇంగ్లీషువారి పరిపాలనవల్ల భారత దేశానికి మేలు జరిగింది అని ఆనాటి విద్యావంతులు భావించారన్న మాట.

అంతేకాదు ఈ వాసుదేవశాస్త్రిగారు తమ తండ్రిగారు ఇజారాదారుడనీ, గవర్నమెంటు ట్రెజరీకి రెండు లక్షల రూపాయల పన్ను చెల్లిస్తారనీ కూడా ప్రస్తావించారు ప్రొవిన్షియల్ కోర్టులో పండితుడైన వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రి దౌహిత్రుణ్ణి నేను అని కూడా చెప్పుకున్నారు. అంటే పందొమ్మిదో శతాబ్ది పూర్వార్ధంలోనే కులవృత్తులకు క్షతి ఏర్పడిందని తెలుస్తూనే ఉన్నది కదా.

ఇక సాహిత్య విషయానికి వస్తే ప్రబంధాలుగా, ద్విపదలుగా, యక్షగానాలుగా ఏ పురాణ గాథనో స్వీకరించి రచించడం వెనుక పట్టి నాటకాను వాదాలు, వచన రచనలు, చేయాలన్న అభిలాష ప్రబలమైన విషయం పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధానికే చూడవచ్చు. జూలియస్ సీజర్ నాటకాన్ని వావిలాల వాసుదేవశాస్త్రిగారు తెలుగులోకి తెచ్చారు. అయితే షేక్స్పియర్ 'బ్లాంక్ వెర్స్'లో నాటకాలు రచించినందువల్ల, అనువాదానికి కూడా ఒకే ఛందం ఉంటే బాగుంటుందని ద్విపదలో దీన్ని నిర్వహింప బూనారు వాసుదేవశాస్త్రిగారు.

**'A translation of shakspeares play, complete in Telugu metre, with prefatory remarks and Indexes'** అని ముఖ పత్రం పైన శాస్త్రిగారు వివరించారంటే ఇంగ్లీషు సారస్వత రీతులు ఆనాటికే విద్యాధికులను ఎంతగా ఆకర్షించిందీ తెలుసుకోవచ్చు.

ఇంగ్లీషు సాహిత్యం వల్ల తెలుగు సాహిత్యంలో వచ్చిన ప్రధానమైన మార్పు మానవ జీవితం రచనా వస్తువు కావడం. లౌకిక జీవితం పట్ల దృష్టి మళ్ళటం. వాస్తవికతపట్ల ఆసక్తి ఎక్కువ కావడం.

సమకాలీన సాంఘిక జీవితాన్ని ప్రతిబింబింప చేయటానికి కొత్తప్రక్రియలు అవసరమైనాయి. అందువల్లనే నాటకం, ప్రహసనం, కథ, నవల వంటి కొత్త ప్రక్రియలను తెలుగులో కూడా రచయితలు చేపట్టటం జరిగింది.

దేశీయ సాహిత్యంలో నవల, కథ వంటి ప్రక్రియలు ఇంగ్లీషు సాహిత్యంతో మనకు పరిచయం కాక పూర్వం నుంచీ ఉండేవి అనటం వాస్తవ విరుద్ధం. సంస్కృతంలోని వచన రచనలైన కాదంబరి, దశ కుమార చరిత్రల వంటి వాటిని నవలలు అనలేము. అట్లానే విక్రమార్కుడి కథలు. కాశీమజిలీ కథలు, ఆధునిక కథానిక పూర్వరూపాలని చెప్పటం కూడా సరిఅయిన సమన్వయం కాదు. పొగ చుట్టకు, ఫ్యాక్టరీలో తయారైన సిగరెట్టుకూ ఉండే భేదమే పూర్వపు జానపద గాధలకూ, ఆధునిక సమాజ ప్రతిబింబిత మయ్యే కథలకూ ఉంటుందనుకోవచ్చు.

ఏది ఏమైతేనేం పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్థంలో రెండు దశాబ్దాలు గడిచేసరికి తెలుగు సాహిత్యంలో ప్రక్రియా వైవిధ్యం ప్రారంభమైంది. 1872 నాటికే ఆధునిక దృక్పథంతో నవలా రచన చేయాలన్న ప్రేరణ కూడా తెలుగు సాహిత్యంలో మొదలైంది.

కర్నూలులో డిప్యూటీ కలెక్టరుగా పనిచేస్తున్న నరహరి గోపాలకృష్ణమ్మ చెట్టి గారనే వారు నవలా రచనకు పూనుకొన్నారు. ఇందు కాయనకు ప్రేరణ ప్రభుత్వ గెజటులో వెలుపడ్డ ఒక ప్రకటన ద్వారా లభించింది. 1872లో బెంగాల్ గెజట్‌లో అప్పటి గవర్నర్ జెనరలైన మేయో ఒక ప్రకటన గావించారు. బెంగాలీ వారి ఆచార వ్యవహారాలు ప్రతిబింబించే ఒక వచన గాధ రచించిన వాళ్ళకు బహుమానం ఇస్తుంది ప్రభుత్వం అనేది ఆ ప్రకటన సారాంశం, అప్పట్లో ప్రభుత్వంలోని ఉన్నతాధికారులంతా ఇంగ్లీషువారే. వాళ్ళకు దేశీయుల సంప్రదాయాలు, విశ్వాసాలు, జీవన విధానంతో తగినంత పరిచయం ఉండేదికాదు. ఇంగ్లండు నుండి ఈ దేశానికి వచ్చేప్పుడు ఈ దేశం గురించి వాళ్ళకేవేవో వింతవింత అభిప్రాయాలుండేవి. ఆ కారణంగా మేయో ఇంగ్లీషు అధికారులకు దేశీయ సమాజం గురించిన చిత్రణ లభించాలని గెజెటులో ఇటువంటి ప్రకటన చేయించి ఉంటారు. గవర్నర్ జెనరల్ కేంద్ర కార్యస్థానం అప్పట్లో కలకత్తాలో ఉండేది కాబట్టి, లార్డుమేయో కలకత్తాలో ఉండేవారు కాబట్టి, బెంగాలీల ఆచార వ్యవహారాలు తెలుపుతూ ఒక వచన రచన చేసేవారికిబహుమానం ప్రకటించి ఉంటారు. నరహరి గోపాలు కృష్ణమ సెట్టి ఆ రోజుల్లో చెప్పుకో

దగ్గిన ఉన్నతోద్యోగి కాబట్టి, ఆ ప్రకటన చూడటం సంభవించింది. అందువల్ల ఆయనకు తెలుగులో తానటువంటి రచనకు పూనుకోవాలన్న ప్రేరణ కలగటం సహజమే. ఏమంటే ఆయన అప్పటికే రచయిత. చిన్నయ సూరిగారి సహకర్తృకతతో ఆయన ఇంగ్లీషు నుంచి ప్రామాణికమైన న్యాయశాస్త్రచట్టాన్ని కూడా తెనిగించి ఉన్నారు. కాబట్టి ఆయన తెలుగులో "శ్రీ రంగరాజు చరిత్రము" అనే పేరుతో ఆనాటి తెలుగువారి సామాజిక ఆచార వ్యవహారాలను తెలియజేసే ఒక కల్పనా కథను రచించారు. అయితే ఇది మొదటి ప్రయత్నం కాబట్టి చారిత్రక నేపధ్యం ఆశ్రయించారు. కల్పితమైన పాత్రలనే తీసుకున్నా రంగస్థలమూ, దేహబంధమూ చారిత్రక వాతావరణ స్ఫోరకంగా నిర్వహించాల్సి వచ్చింది రచయితకు. ఎందుకంటే అప్పటికి మార్గదర్శకమైన రచనలేవీలేవు కాబట్టి. అయితే అప్పటి కాయనకు ఈ ప్రక్రియకు నవల అని పేరు పెట్టాలని తోచలేదు. అందువల్ల దీన్ని వచన ప్రబంధమన్నా రాయన. 1872 వ సంవత్సరంలోనే ఈ వచన ప్రబంధాన్ని గోపాలకృష్ణమ్మ చెట్టిగారు రచించడమూ, పుస్తక రూపంలో ప్రకటించడమూ కూడా జరిగింది. అప్పట్లో మద్రాసు గెజటు కొత్త పుస్తకాల పరిచయ ప్రకటన శీర్షికలో యీ గ్రంథాన్ని నవలగానే పేర్కొంది. నవలా రచనలో తెలుగులో ఇదే తొలి ప్రయత్నమని కూడా అభిప్రాయపడింది. అప్పట్లో ప్రసిద్ధి కెక్కిన తెలుగు పత్రిక పురుషార్థప్రదాయిని కూడా ఇంగ్లీషులో తన అభిప్రాయాన్ని యీ పుస్తకాన్ని గూర్చి ప్రకటించే సందర్భంలో దీన్ని నవలగానే పేర్కొంది.

"Rangaraju Charitra is a novel in a sweet essy grammatical and idiomatic Telugu Prose. Its object is to delienate the manners and customs of own Telugu people, and it is a best story in which we believe the outhor has drawn a well colored picture of what he had a design. This manual of 88 pages contains instuctive and amusing matter Throughout for general reading. It may be safely selected as a text - book of reading in schools for classes below the standard of matriculation. We hope the Government would encourage and patronize such undertakings as this. This

work which is got up with good taste and good object is worth reading by all in general." అని ఆ పత్రిక యీ గ్రంథాన్ని శ్లాఘించింది.

అయితే ఆధునిక ప్రక్రియగా నవల ప్రమాణాలను దృష్టిలో పెట్టుకున్నప్పుడు శ్రీ రంగరాజు చరిత్రము నవలా రచనలో తొలిప్రయత్నమేగాని ఫలవంతమైన ప్రయత్నం అని చెప్పటానికి వీలులేదు. ఇది 15 ఉల్లాసాల చిన్న గ్రంథం జానపద కథా ధోరణి కూడా కొంత కనపడుతుంది. గంగా గౌరీ సంవాదం పాట ఇందులో చోటు చేసుకుంది. అప్పటికి నాలుగు వందల సంవత్సరాల కిందట జరిగిన కథ ఇది అని గోపాలకృష్ణమ్మ చెట్టిగారు ఉపోద్ఘాతంలో చెప్పుకున్నారు. నాయకుడు మహా కులీనుడై ఉండాలన్న ఆలంకారిక సూక్తిని కూడా తొలిపలుకులలో ఉల్లేఖించారు చెట్టిగారు. కొంత మటుకు అద్భుత గాథాత్మకంగా కూడా ఉంది. గోపాలకృష్ణమ్మ చెట్టిగారు తమ ఈ వచన ప్రబంధ రచనా ప్రయత్నాన్ని గూర్చి ఇట్లా ప్రస్తావించారు.

పది నెలలనాడు లార్డుమేయో గారు బంగాళిల యాచారంబులు తెలుపు ప్రబంధము గావించువానికి బహుమానంబు చేయబడునని ప్రచురము చేసిరి. అది నేను చదివినప్పుడు తెలుగు దేశము వారియాచారంబులు తెలుపునట్టి ప్రబంధం బొకటి రచియించుట తెలుగు వారి కుపయుక్తంబగునని తలంచి నా నేర్పుకొలదిని ప్రబంధంబు చెప్పబూనితిని".

"ఇది కేవలము కల్పితంబు. కథానాయకుండు మహా కులీనుడై యుండవలయునను యీ దేశంబున మున్ను దొరతనము చేసిన విద్యానగర రాజు వంశము వారిలో శ్రీ రంగరాజను పేరు గైకొంటిని గాని యిందు జెప్పిన చరితము యథార్థముగా జరిగిన కథయని యెంచగూడదు ఇందు జెప్పిన యాచారములు మాత్రము యథార్థముగా నాచరింపబడునవి. ఈ కథ 400 సంవత్సరములనాడు జరిగినట్లుగా చెప్పబడియె గాని యప్పటి యాచారములకు నిప్పటి యాచారములకును లేశంబుగాని భేదంబులేమింజేసి యిందుదహరింపబడిన యాచారంబులన్ని యిపుడాచరింపబడుచున్న వని యెరంగునది - కేవలగద్యాత్మకములయిన తెనుగు ప్రబంధములు-విశేషములేమింజేసి యిది తెనుగు విద్యార్థులకు సయితముపయోగించునని తలచెద".

ఈ విధంగా తొలి తెలుగు నవలా రచనా ప్రయత్నానికి పూనుకొన్న నర హరిగోపాలకృష్ణమ్మ చెట్టిగారు ఈ ప్రక్రియను నవల అని కాకుండా వచన ప్రబంధమనీ, నవీనప్రబంధమని మాత్రమే ప్రస్తావించారు.

తెలుగులో ఈ ప్రక్రియ ప్రారంభమైన తర్వాత రెండు దశాబ్దాల దాకా ఈ ప్రక్రియకు 'నవల' అనే పేరులేదు. ఈ ప్రక్రియకు నవల అని నామకరణం చేసినవారు కాశీ భట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు. ఈ ప్రక్రియను మనం ఇంగ్లీషులోని 'నావెల్' అనే ప్రక్రియనుంచే దిగుమతి చేసుకున్నాం కాబట్టి ఆదే పేరుతో పిలవటం బాగుంటుందని వీరేశలింగంపంతులుగారి రాజశేఖర చరిత్రను విమర్శిస్తూ వివేక చంద్రికా విమర్శనం అనే గ్రంథం వ్రాసి అందులో తొలిపలుకులో ఈ విషయం చెప్పారు. బ్రహ్మయ్య శాస్త్రిగారు.

కాబట్టి ఏం తెలుస్తుందంటే తెలుగులో ఈ ప్రక్రియ పుట్టిన తర్వాత సుమారు పాతిక సంవత్సరాల వరకు ఈ ప్రక్రియకు వచన ప్రబంధమనే పేరే ఉండేదనీ అప్పటి నుంచి నవల అనే పేరే వాడుకలోకి వచ్చిందనీ.

వీరేశలింగంపంతులు గారంతటి మహా ప్రతిభావంతుడు ఈ ప్రక్రియను చేపట్టటంతో దీనికి ఆకర్షణ కలిగినట్లుగా చెప్పాలి నరహరి వారి వచన ప్రబంధము వచ్చిన ఆరు సంవత్సరాలకు వీరేశలింగంపంతులు గారు తమ రాజశేఖర చరిత్రను తాము నడుపుతున్న వివేక వర్ధని పత్రికలో ధారావాహికంగా ప్రారంభించారు. ఈ రాజశేఖర చరిత్రకు ఇంగ్లీషులోని ఆలివర్ గోల్డస్మిత్ రచించిన "దివికా రాఫ్ వేక్ ఫీల్డు" అనే నవల ఆధారం. ఇంగ్లీషు నవలకు అనువాదంగా కాకుండా అనుసరణగా దీన్ని నిర్వహించారు పంతులుగారు. వీరేశలింగంపంతులు గారు విరివిగా వచన రచనకు పూనుకొనేకాలానికి తెలుగులో వచన రచన చాలా తక్కువ. ఈ కాలంలో మొదలు ఆయన కూడా సంప్రదాయమార్గాన్నే అనుసరిస్తూ ప్రౌఢ వచనమే రచించారు. చిన్నయసూరి వదిలిపెట్టిన పంచతంత్రంలోని సంధి విగ్రహాలు అదే ప్రౌఢమైన శైలిలో వీరేశలింగంపంతులు గారు రచించారు. వీరి కన్నా ముందుగా కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు కూడా విగ్రహ తంత్రాన్ని వెలువరించారు. కొక్కొండవారి అభిమానులొకరు వీరేశలింగంపంతులు గారి విగ్రహం వెలువడిన తరువాత అది వెంకటరత్నంపంతులుగారి అనువాదాని కన్నా తీసికట్టు అని విమర్శించారు. దానికి కోపించి వీరేశలింగంపంతులు గారి

కొక్కొండ వెంకటరత్న కవి కృత విగ్రహతంత్ర నిమర్శనం అనే పేరిట తమ వివేకవర్ధని పత్రికలో విమర్శించారు. విమర్శలో నూతనమైన పోకడలను చూపిన వీరేశలింగంపంతులు గారిని మెచ్చుకుంటూ మద్రాసులోని సమర్థి రంగయ్య శ్రేష్టిగారు వీరేశలింగంపంతులుగారికి అప్పటికి అపరిచితులే అయినప్పటికీ **Can you not under take a oirginal novel in Telugu** అని శ్లాఘిస్తూ వ్రాశారు. అది ప్రోద్బలకం కాగా వీరేశలింగంపంతులుగారు రాజశేఖర చరిత్రం రచించారు. అయితే మొట్ట మొదటనే మౌలికమైన నవల రాయడానికి ఆయన సందేహించారు. శైలి కుదురు పరచుకోవటానికి శిల్పం తెలుసుకోవడానికి ఏదైనా ఇంగ్లీషు నవలను అనుసరించడం మంచిదని ఆయనకు తోచింది అప్పుడు "దివికారాఫ్ వేక్ ఫీల్డు"ను అనువదించటానికి పూనుకొన్నారు. అయితే ఆ ఇంగ్లీషుదేశపు వాతావరణమూ, పేర్లు, ఆచార వ్యవహారాలు తెలుగు వారికి ఆసక్తికరంగా ఉండవనితోచి స్వేచ్ఛగా అనుసరించటానికి పూనుకొన్నారు. అందువల్ల గోదావరినది వర్ణనతో ఈ నవలనాయన ప్రారంభించారు. శ్రీకారంతో ప్రారంభించడం కూడా విస్మరించ లేదు తెలుగు సాహిత్యంలో గోదావరినదీమతల్లి వర్ణనలలో పంతులుగారి వర్ణన ఎన్నదగినది. ఎంతో భావుకతతో ఈ వర్ణన నాయన నిర్వహించారు. రెండు చేతులు చాచి నాథుణ్ణి కౌగిలించుకోవటానికి ఉత్సహిస్తున్నట్లుగా ధవళేశ్వరం వద్ద అఖండ గౌతమి రెండుపాయలుగా చీలిందన్న వీరేశలింగంపంతులు గారి వర్ణన అటు తర్వాత విశ్వనాథ సత్యనారాయణ గారిని కూడా ఆకర్షించినట్లుగా కనపడు తుంది. కిన్నెరసాని పాటలో ఆయన ఇటువంటి వర్ణనమే చేశాడు.

ఏది ఏమైనా గోల్డుస్మిత్ ఇంగ్లీషులో రచించిన నవలకు రాజశేఖర చరిత్రం అనువాదమే అయినా మౌలికమైన అచ్చమైన తెలుగు నవలలాగే దీన్ని తీర్చిదిద్దడంలో పంతులుగారి ప్రతిభ ప్రకాశించింది. తెలుగుదేశపు ఆనాటి సాంఘిక పరిస్థితులకన్నిటికి ఈ నవల అద్దం పడుతోంది. ఇంగ్లీషు నవలలోలేని అనేకమైన అంశాలు రాజశేఖర చరిత్రలో చోటు చేసుకున్నాయి. ప్రచురంగా ఆనాడు సంఘంలో వ్యాపించి ఉన్న సర్వమూఢాచారాలు మోసాలు ఆయన ఈ నవలలో స్పృశించారు ఆనాటి సాంఘిక వ్యవస్థపరిణామాలన్నిటినీ ఏదో ఒక సందర్భం పురస్కరించు కొని ఈ నవలలో పంతులుగారు చిత్రించారు. ఈ నవల రెండో ముద్రణ రావటానికి సుమారు ఇరవై సంవత్సరాలు పట్టినా ఆ రోజుల్లో విద్యావంతులను బాగా ఆకర్షించింది.

నవలా ప్రక్రియమీద విమర్శకూడా రాజశేఖర చరిత్ర మీదనే మొదలు కావడం గమనార్హం. కాశీ భట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు మూలగ్రంధాన్ని పరిమాణంలో మించిపోయిన విమర్శ గ్రంథాన్ని వెలయించారు. రాజశేఖర చరిత్రలోని మొత్తం 15 ప్రకరణాలను బ్రహ్మయ్య శాస్త్రిగారు తమ వివేకచంద్రికా విమర్శనంలో 8 అధ్యాయాలలో విమర్శకు గురి చేశారు. దీనివల్ల తెలుసుకోవలసిందేమిటంటే ఈ ఆధునిక ప్రక్రియగావచ్చిన రచనలపై వెంటనే విమర్శకూడా వచ్చిందని

వీరేశలింగంపంతులుగారు మొత్తం 3 నవలలు రచించారు. ఇందులో రెండు ఇంగ్లీషు నవలలకు అనుసరణలు. ఒకటి స్వతంత్రం. కుటుంబ జీవనేతివృత్తంతో తెలుగులో మొదటి నవల వ్రాసింది పంతులుగారే. ఈ నవల సత్యవతీ చరిత్రం. ఆనాటి అవిభక్త కుటుంబాల తీరు తెన్నులు ఇందులో బాగా వర్ణితమైనాయి విద్యా గంధంలేకపోయినందు వల్ల స్త్రీలలో కన్పించే కలహశీలత, అత్తగారు కోడళ్ళను బాధిస్తూ ఉండడం అతి బాల్య వివాహాల వల్ల సంభవించే అనర్ధకాలు ఈ నవలలో బాగా ప్రసక్తమైనాయి.

సత్యరాజా పూర్వదేశ యాత్రలు అనే నవల జొనాథన్‌స్విఫ్ట్ గలివర్స్ ట్రావెల్స్‌ను అనుసరించి పంతులుగారు రెండు భాగాలుగా రచించారు. మొదటి భాగానికి ఆడుమలయాళమనీ, రెండో భాగానికి లంకాయాత్ర అనీ పేర్లు. సంఘంలో స్త్రీలు చదువుకోకపోయినందువల్ల ఆ సంఘం ఎంత వెనకబడి ఉండేదీ ఈ నవలావ్యాజాన చక్కగా వర్ణించారు పంతులుగారు. సంఘంలో స్త్రీ విద్యావంతురాలూ వివేకవంతురాలూ కాకపోతే పూర్తిగా ఆ సంఘమే నూతిలో కప్పతత్త్వంతో బతుకుతుందనీ అన్ని దురాచారాలను మూఢ విశ్వాసాలను సమర్థించుకుంటూ తనకంపే తనకింపు అనుకుంటూ అజ్ఞానావస్థలో ఉండిపోతుందనీ పంతులుగారీ నవలలో వర్ణించారు.

పంతులుగారి కాలానికి అగ్రవర్ణాలలో బాల్య వివాహాలు ప్రచురంగా ఉండేవి వృద్ధ వివాహాలు కూడా ఉండేవి. ఆడపిల్లలకు పదేళ్ళురాకుండానే పెళ్ళి చేయకపోవటం తప్పుగా భావించే వాళ్ళు. పురుషులు అరవై ఏళ్ళు, డెబ్బైఏళ్ళ వయసులో కూడా రెండో పెళ్ళి మూడో పెళ్ళి చేసుకునే వాళ్ళు నిరాక్షేపణగా తప్పు జాత కాలు చెల్లిపోయేవి. జాతకాలు కూటసృష్టిచేసి ఆయుర్దాయం ఐశ్వర్యంచూసి వయసు మీరిన వాళ్ళు కూడా చిన్నపిల్లలను పెళ్ళాడి వాళ్ళ గొంతులు కోసేవాళ్ళు.

గురుజాడ అప్పారావుగారు కన్యాశుల్కంలోను వీరేశలింగంపంతులుగారి బ్రాహ్మ వివాహంలోనూ ఈ తప్పుడు జాతకాల తతంగమంతా విపులంగా వర్ణితం. ఈ విధంగా వయసు మీరిన మగవాళ్ళు బాలికలైన ఆడపిల్లలూ పెళ్ళి చేసుకున్నందు వల్ల సంఘంలో వితంతువుల సంఖ్య ఎక్కువైంది. అంతేకాక వైద్యసౌకర్యాలు సరిగా వుండనందువల్లా భూతప్రేత పిశాచాల పట్ల అమితమైన నమ్మకం వల్లా, కూడా వైద్యం సకాలంలో జరగక పడుచు వాళ్ళలో కూడా మగవాళ్ళలో ఎక్కువ మంది మరణించే వాళ్ళేమో ననుకోవాలి. లేకపోతే ఆ సంఘంలో వేల సంఖ్యలో వితంతువులు ఉండటం సంభవించేదికాదు. ఇంచుమించుగా ప్రతి కుటుంబమూ బాల్యకుటుంబ సమస్యలతో బాధ పడుతూ ఉండేదని పరిస్థితుల వల్ల భావించవచ్చు.

స్త్రీలకు చదువు సంధ్యలుండేవి కావు. వీధిలోకి వెళితే వేశ్యల ప్రాబల్యం ఎక్కువగానే ఉండేది ఈ విషయాలన్ని సంఘానికి ఎంత చెరుపు చేస్తాయో చూప టానికే పంతులుగారు సత్యరాజా పూర్వదేశ యాత్రలు, ఆడు మలయాళం, లంకాయాత్ర అనే రెండు భాగాలుగా రచించారు. మన సంఘంలోని క్రౌర్యాలన్ని టినీ ఆడు మలయాళం నవలలో అక్కడి సంఘంలో పురుషులు గురి అయ్యేట్లుగా వర్ణించి మన సంఘంలోని అమానుష పరిస్థితులను చూపి సంఘానికి కనువిప్పు కలగజేశారు. హిందూ సంఘంలో బాల వితంతువుకి తల బోడి చేస్తే ఆడు మల యాళంలో పత్ని మరణించిన పురుషుడు అతడెంత చిన్న వయసులో ఉన్నాసరే అతడికి ముక్కు కోసివేస్తారు. అట్లానే హిందూ సంఘంలో భోగకాంతలుంటే ఆడు మలయాళంలో భోగపురుషులుంటారు. ఇక్కడ మనదేశంలో స్త్రీ లనుభవించే కష్టాలన్నీ అక్కడ పురుషులనుభవిస్తున్నట్లు చమత్కారంగా వ్యంగ్య అవహేళనా త్మకంగా యీ నవల రచించారు. వీరేశలింగంపంతులుగారు. అట్లానే లంకాద్వీపం అనే నవలలో జ్యోతిష్యం నమ్ముకొని జీవయాత్ర జరుపుకోవడం ఎంత అవివేకమో ఎద్దేవా చేశారు. పంతులుగారి రచనలన్నిటా ఆయన సాంఘిక పురోగమన దృష్టి కనపడుతుంది. ఆయనమీద బ్రహ్మ సమాజ ప్రభావం అధికంగా ఉంది. ఆయన చదువుకున్నది, మెట్రిక్యులేషన్ వరకే అయినా ఇంగ్లీషులో మంచి అభిరుచిశక్తి యుక్తులూ ఆయన సాధించారు. ఇంగ్లీషు సాహిత్య ప్రభావంతో తెలుగులో నవలా రచన చేసిన మొట్టమొదటి రచయిత వీరేశలింగంపంతులు గారే అని చెప్పాలి.

1872 లోనే ఆధునికాంధ్ర సాహిత్యంలో తొలి తెలుగు నవలా రచనా ప్రయత్నం జరిగినప్పటికి సుమారు రెండు దశాబ్దాలు గడిచే వరకూ తెలుగు రచ

యితలను ఈ ప్రక్రియ ఆకర్షించలేకపోవడం గమనార్హం, మొదటి పాతిక సంవత్సరకాలంలో పది పదిహేను నవలలు కూడా కనబడటంలేదు. 1899వ సంవత్సరములో రాజమండ్రి నుంచి వెలువడుతున్న చింతామణి పత్రిక నవలా రచనలో పోటీ ప్రారంభించినంత వరకు ఈ ప్రక్రియ విశేషించి తెలుగు రచయితలను ఆకర్షించలేదు.

మొట్టమొదటి పాతిక సంవత్సరాల తెలుగు నవల వ్యాప్తిని గూర్చి యీ విధంగా క్రోడీకరించవచ్చు.

1. ఈ ప్రక్రియకు మొదట్లో నవల అనేపేరేలేదు. మొదటి పాతిక సంవత్సరాలూ వచన ప్రబంధమనీ నవీన ప్రబంధమనీ మాత్రమే పిలిచారు.

2. మొదటి ప్రయత్నం తరువాత 6 సం॥లకు రెండో ప్రయత్నం జరుగలేదు. మొదటిసారిగా జరిగిన ప్రయత్నం నేరుగా పుస్తక రూపానే ప్రచురితం. రెండోసారి జరిగిన ప్రయత్నం ఒక మాస పత్రికలో ధారావాహికంగా సుమారు 2 సం॥లు వచ్చి తర్వాత పుస్తకరూపాన ప్రకటితమైంది.

3. మొదటి ప్రయత్నంపై ఇంగ్లీషు సాహిత్య ప్రభావంలేదు. రెండో ప్రయత్నంపై ఇంగ్లీషు సాహిత్య ప్రభావం ఎంతగానో ఉంది.

4. రెండో ప్రయత్నం జరిగిన ఐదేళ్ళకు మూడో ప్రయత్నం జరిగింది. అంటే పదేళ్ళలో మూడే నవలలు వెలువడ్డాయన్నమాట.

5. ఆధునిక తెలుగు సాహిత్యంలో తెలుగు వారి కుటుంబ జీవితాన్ని వర్ణించే మొట్టమొదటి నవల రచించింది. వీరేశలింగంపంతులుగారే ఆ నవల సత్యవతీ చరిత్రం. సుప్రసిద్ధ కథకుడు శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రిని యీ కుటుంబ నవల ఎంతగానో ఆకర్షించింది.

6. ఈ ప్రక్రియ ప్రభవించిన ఇరవై సంవత్సరాలకు ఈ ప్రక్రియలో ఎక్కువగా రచయితలు బయలు దేరాలని చింతామణి అనే పత్రిక పోటీలు ప్రారంభించింది.

7. మొదటి పదేళ్ళలో మూడే నవలలు వచ్చినా చింతామణి పత్రిక ప్రారంభమైన తరువాత పదేళ్ళలో సుమారు 30 నవలలు వచ్చాయి మొట్టమొదటి సారి జరిగిన పోటీకి మూడే నవలలు వచ్చాయి.

8. ఈ ప్రక్రియ పుట్టిన పాతిక సంవత్సరాలకు ఈ ప్రక్రియకు నవల అన్న పేరు రూఢమైంది.

9. ఈ ప్రక్రియను గూర్చి వెలువడ్డ మొట్టమొదటి విమర్శ గ్రంథం పరిణామంలో మూలగ్రంథాన్ని మించిపోయింది. ఈ ప్రక్రియ గూర్చిన మొదటి విమర్శకుడు కాశీ భట్టబ్రహ్మయ్య శాస్త్రి.

10. పందొమ్మిదో శతాబ్ది ముగిసి ఇరవై య్యో శతాబ్ది ప్రారంభమయ్యే నాటికి ఇతి వృత్తంలో ఎంతో వైవిధ్యం సాధించింది తెలుగు నవల.

11. తెలుగులో నవలా రచనకు మార్గదర్శకుడు వీరేశలింగంపంతులు గారే. అందువల్లనే ఆయన తొలి తెలుగు నవలా రచయితగా కీర్తితుడైనాడు. విశేషం ఏమంటే ఆయన నవలలు తమిళ మలయాళ కన్నడ భాషలలోకి కూడా వెంటనే అనూదితమైనాయి. 1887 నాటికే ఇంగ్లీషులోకి కూడా అనువాదం పొంది లండన్ టైమ్స్ వంటి పత్రికలో సమీక్ష కూడా పొందింది. ఆయన రాజశేఖర చరిత్ర.

12. చింతామణి ఆర్థిక యాజమాన్యం న్యాపతి సుబ్బారావు పంతులు గారిదే అయినా ప్రచురణ నిర్వహణ అంటే రచనలు ఎంపిక చేయడం అచ్చువేయడం మొదలయినవి. వీరేశలింగంపంతులు గారే చూసే వారనడానికి బోలెడు ఆధారాలున్నాయి. చింతామణిలో నవలా రచనా పోటీలకు సంబంధించిన నియమనిబంధనలు రాసి ప్రకటించింది కూడా పంతులు గారే.

ఈ నిబంధన వ్యాఖ్యలలో ఒకచోట "ఇంగ్లీషు వారు వ్రాసిన గ్రంధములను జూచి యిప్పటి మనవారు వచన ప్రబంధములను వ్రాయ నారంభించినారు గాని, యింకను మన భాషలో నుండవలసినన్ని పుస్తకములు పుట్టలేదు." అని

స్పష్టంగా పేర్కొనడం జరిగింది. కాబట్టి పుట్టినప్పటి నుంచీ ఈ ప్రక్రియ ఇంగ్లీషు సాహిత్య ప్రభావంతో వికసిస్తూ వచ్చిందనడంలో సందేహం లేదు.

వీరేశలింగం పంతులుగారి తర్వాత వెంటనే చెప్పుకోవాల్సిన గొప్ప నవలా రచయిత చిలకమర్తి లక్ష్మీనరసింహం. వీరేశలింగంగారిని అనుసరించే తాను నవలలు రాయడం నేర్చుకున్నానని చిలకమర్తి చెప్పుకున్నాడు కూడాను. చింతామణి నవలల పోటీలు సుమారు 5, 6 సం॥లు మాత్రమే జరిగాయి. ఈ పోటీలలో మూడుసార్లు బహుమానాలు గెల్చుకున్నాడు చిలకమర్తి. ఆయన మొదటి సారి పోటీకి పంపించిన నవల రామచంద్ర విజయం. ఈ నవలకూ వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్రకూ ఎన్నో పోలికలున్నాయి. తెలుగులో మొట్ట మొదటి హాస్యనవలను రాసినవాడు చిలకమర్తి. సుమారు పాతిక సంవత్సరాల కాలం చిన్నవీ పెద్దవీ సాంఘికాలూ, కాల్పనికాలూ అయిన పధ్నాలుగు నవలల దాకా రచించారు చిలకమర్తి. ఆయన నాటకాలు చాలా ప్రసిద్ధికెక్కాయి కాబట్టి నవలా రచయితగా చిలకమర్తికి గొప్పగుర్తింపు రాలేదేమోననిపిస్తుంది. ప్రసన్న మధురమైన శైలిలో పాఠకులకు తాదాత్మ్యం కలిగిస్తాడు చిలకమర్తి. ఆయన అనువాదాలూ అనుసరణలూ కూడా మౌలిక రచనలంత సరళంగా ప్రతిభా వంతంగా ఉంటాయి.

తొలి రోజులలో నవలల పేర్లు విలాసం, విజయం, చరిత్రవంటి పేర్లతో కలిసి ఉండేవి. మొట్టమొదటి సారికి పోటీకి వచ్చిన నవలల్లో ధర్మవతీ విలాసం, సంజీవరాయ చరిత్రం బహుమతి పొందాయి. ఆ తర్వాత రామచంద్ర విజయం బహుమానం పొందింది. ఆ తర్వాత సంవత్సరం త్రివిక్రమ విలాసం బహుమానం పొందింది. తొలి రోజుల్లో నవలా రచయితల మీద వీరేశలింగం పంతులుగారి ప్రభావం బాగా ఉండేది అనిపిస్తుంది. సంఘంలో మహిళ స్థితి ఆశాజనకంగా ఉండాలనీ, కులమత భేదాలు రూపుమాసిపోవాలనీ, ధర్మం, సత్యం, నీతి, న్యాయం విజయం సాధించి తీరాలని తొలి తరం తెలుగు నవలా రచయితలు తమ రచనలలో ప్రతిపాదించే వాళ్ళు.

తెలుగు నవల ఇతివృత్త వైవిధ్యానికీ, వికాసానికీ, సంఘ సంస్కరణ ప్రబోధానికీ, దాని ద్వారా సాధించిన సాంఘిక ప్రయోజనానికీ చింతామణి పత్రిక చాలా దోహదం చేసిందని చెప్పాలి. 1896 నాటికే చారిత్రక నవలల పోటీని

ప్రకటించింది ఆ పత్రిక దీని ద్వారా జాతీయాభిమానం పెంపొందింప చేయటం ఈ పత్రిక ఆశించింది. పందొమ్మిదో శతాబ్ది ముగిసే కాలానికి దివ్య జ్ఞాన సమాజ ప్రభావం విద్యార్థులపై గణనీయంగా ప్రసరించింది. రామకృష్ణ పరమహంస బోధలు, వివేకానందస్వామి షికాగోలో భారతదేశం గొప్పతనాన్ని ఆవిష్కరించడమూ జాతీయాభిమానాన్ని పెంపొందించడం గూర్చి దేశీయులలో ఆసక్తి కలిగించింది. సంఘంలో ఉన్న లోపాలను సరిదిద్దుకోవాల్సిన ఆవశ్యకతవైపు రచయితల మేధావుల దృష్టి మళ్ళింది. పాశ్చాత్యులు భారతీయ జీవన విధానాన్ని సాంఘిక లోపాలను గూర్చి చేసే విమర్శలు భారతీయులను అంతర్ముఖులను చేశాయి. ఈ భావాలన్ని సాహిత్యంలో ప్రతిబింబించటం మొదలైంది.

పందొమ్మిదో శతాబ్ది మొదటి దశకంలో వందేమాతరం ఉద్యమం భారత దేశంలో జాతీయాభిమానాన్ని ప్రజ్వలింపచేసింది. వంగదేశం తక్కిన ప్రాంతాల వారందరికీ ఆరాధ్యం కావడం ప్రారంభమైంది. ఈ దశాబ్దంలో వంగ భాష నవల లెన్నో తెలుగులోకి అనువాదం పొందాయి. 1906లో విజ్ఞాన చంద్రికామండలి స్థాపనంతో తెలుగులో సాహిత్య ప్రచురణ ఉద్యమ రూపం ధరించింది. విజ్ఞాన చంద్రికామండలికి ఆ రోజుల్లోనే సుమారు నాలుగు వేలమంది చందాదారులుండే వాళ్ళంటే కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు తెలుగువారిలో ఎటువంటి చైతన్యం కలిగించారో తెలుసుకోవచ్చు. తిలక్, అరవిందుడు బంకించంద్రచటర్జీలు తెలుగు వాళ్ళకు ఎంతో స్ఫూర్తినిచ్చారు. స్వాతంత్ర్యేచ్ఛ రోజు రోజుకు విద్యార్థి కులలో బలపడింది.

1857వ సంవత్సరంలో స్థాపనమైన విశ్వవిద్యాలయం 1907 నాటికి రెండు మూడు తరాల నూతన విద్యాధిక వర్గాన్ని సృష్టించింది. రైలు లేర్పడి దేశంలో రాకపోకలకు అవకాశాలు ఎక్కువైనాయి. వార్తా పత్రికలు ప్రారంభమైనాయి. పందొమ్మిదో శతాబ్ది ప్రారంభమయ్యేనాటికే సాహిత్య సాంస్కృతిక సాంఘిక పత్రికల వ్యాప్తి బహుళ తరమైంది. ప్రతి పండితుడూ, కవీ, శాస్త్ర పేరుప్రఖ్యాతులు సంపాదించిన ప్రతిరచయితా ఆ రోజుల్లో ఒక పత్రిక నడిపారు. అందువల్ల సాహిత్యంలో ప్రక్రియా వైవిధ్యానికి ఆస్కారం కలిగింది. విజ్ఞాన చంద్రికామండలి వారి పోటీలవల్ల చారిత్రక నవలా రచనలో ఆసక్తి ప్రబలింది. ఈ శతాబ్ది మొదటి రెండు దశకాలాలో భోగరాజునారాయణమూర్తి, కేతవరపు

వేంకటశాస్త్రి, వేంకటపార్వతీశ్వరకవుల వంటి నవలా రచయితలు తెలుగు నవలను సుసంపన్నం చేశారు. నారాయణమూర్తి గారి విమలాదేవి, కేతవరపు వారి రాయచూరు యుద్ధం వేంకటపార్వతీశ కవుల ప్రమదావనం వంటి నవలలు పాఠకులను ఎంతగానో ఆకర్షించాయి. గడచిపోయిన భారతదేశ చరిత్రను ఉత్తేజకరంగా కళ్ళముందు నిలిపి నేటి దైన్యాన్ని విడనాడాలన్న ప్రబోధానికే ముఖ్యంగా చారిత్రక నవలలు ఉద్దేశించాయి. గాంధీగారి హరిజనోద్ధరణోద్యమం భారతదేశంలో ఇంకా ప్రారంభం కాకముందే తల్లా ప్రగడ సూర్య నారాయణరావుగారు వేంకటపార్వతీశ్వరుల వంటివారు ఈ సమస్యపై నవలలు రాయటం గమనార్హం.

1900 నుండి 1920 వరకు మౌలికమైన నవలలతో పాటు అనువాద నవలలు కూడా అధిక సంఖ్యలోనే వచ్చాయి. 1914 నాటికే కేతవరపు వేంకటశాస్త్రి లక్ష్మీప్రసాదం నవలలో పాశ్చాత్య వ్యామోహాన్ని నిరసించారు. ఆ రోజుల్లో కొత్తగా ఒక విద్యాధిక వర్గం బయలుదేరి విదేశాలలో విద్యార్జన వ్యామోహంతో విదేశాలకు వెళ్ళి ఆ సాంఘిక వ్యవస్థను మెచ్చుకుంటూ భారతదేశం తిరిగివచ్చిన తర్వాత కుటుంబ సమస్యలను, సాంఘిక సమస్యలను సృష్టించేవారు. ఇంగ్లీషువాళ్ళ సాంఘిక వ్యవస్థ, నాగరికత, స్వేచ్ఛ, విద్యావికాసాలు భారతీయులకన్నా శ్రేష్ఠమైన వని నమ్మి భారతీయ సాంఘిక జీవితాన్ని కించపరిచేవాళ్ళు. ఈ విషయాలను స్పృశిస్తూ వెలుపడ్డ నవల లక్ష్మీప్రసాదం. లక్ష్మి, ప్రసాదరావులు ఇందులో నాయికానాయకులు. అయితే ప్రసాదరావు చివరకు పశ్చాత్తాపం చెంది తన సంసార జీవితాన్ని నిలబెట్టుకుంటాడు.

తెలుగు నవలా చరిత్రలోనే మాలపల్లి నవలా రచనం ఒక గొప్ప ఘట్టం. సాంఘిక నవల సామాజిక వ్యవస్థాత్మకంగా మలుపుతిరగటం ఈ ఘట్టంలోనే జరిగింది. సంఘంలో కులకట్టుబాట్లు, ఆచారాలు సంప్రదాయాలు కుటుంబ సమస్యలు, మత, సాంఘిక పరిస్థితులు చిత్రించడం నుంచి సమాజ పరిణామాల పట్ల తాత్విక చింతన ప్రారంభం కావడమే మాలపల్లి నవల విశిష్టత. అంతవరకు సామాజికమైన పరిణామాలకు ప్రేరకశక్తులేవిటన్న ఆలోచన కన్పించేదికాదు. సాహిత్యంలో రాజకీయ ఆర్థిక శక్తుల ప్రాబల్యం సమాజాన్ని ఏ విధంగా శాసిస్తున్నదీ సృజనాత్మక రచయితలు తమ రచనా వస్తువుగా స్వీకరించిన దాఖలాలు మాలపల్లి వచ్చిందాకా తెలుగు సాహిత్యంలో కనిపించవు. 1914లో మొదలైన ప్రపంచ

యుద్ధం, 1917లో రష్యాలో అక్టోబరు విప్లవం సాధించిన ఘన విజయం రాజకీయార్థిక సాంఘిక తత్వాలోకన నవలకు ప్రేరణ కలిగించి ఉండవచ్చు.

ఆధునిక తెలుగు సాహిత్యంలో మాలపల్లి ఒక మహేతిహాసం. శిఖరాయమాణమైన నవల ఇది.

"మానవ స్వాతంత్ర్య ధర్మసంరంభమునందు సకలార్థ సిద్ధికిని సాహిత్యమాధారము.........సర్వతోముఖమైన మానవ స్వాతంత్ర్య ధర్మావతరణమునకు స్వతంత్ర సాహిత్యము మూలాధారము. వర్తమానకాలమందు ప్రజా జీవన వికాసమునకాధారములైన వర్ణాశ్రమ ధర్మములు, సాంఘికాచార వ్యవస్థలు, రాజ్యాంగములు, మత విశ్వాసములు, వృత్తులు, ధనార్జన విధానములు, ధర్మ సాధనములు సాహిత్య రచనలు మొదలగు సకల వ్యవస్థలును శిథిలములై పునర్నిర్మాణము నాపేక్షించుచున్న విధమును ప్రపంచావృతమైన మహాపరివర్తనము విశదము చేయుచున్నది. ఉన్నవ లక్ష్మీనారాయణగారు మాలపల్లియందు సంకల్పించిన నవజీవన నిర్మాణ విధానము లాంధ్రసాహిత్య సంస్కారమునందు నూతనాధ్యాయములు" అంటూ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు "మాలపల్లియందు సాంఘిక రాజకీయార్థిక పరివర్తనములు రసవంతముగ వర్ణింపబడినవి. తక్కెళ్ళ జగ్గడి నాయకత్వమున నడిచిన ధర్మదోపిళ్ళ యుదంతము సాంఘిక పరివర్తనమునందు నూతనాధ్యాయము. జగ్గన్న యనుచరులు పాడెడి పాటలు గంభీరముగ సాంఘికార్థిక పరివర్తనావసరమును వెల్లడి చేయుచున్నవి." అంటూ సామ్యవాద భావాలను కూడా బలపరుస్తున్నారు నాగేశ్వరరావు పంతులుగారు. ఇదంతా ప్రపంచ దేశాలను సాహిత్యాన్ని అక్టోబరు విప్లవం ఎంతగా ప్రభావితం చేసిందో నిరూపిస్తున్నది.

ఈ నవల మూడోభాగంలో సామ్యవాద విప్లవమే సాంఘిక సువ్యవస్థకు ఏకైక శరణ్యమని వాదించే వేంకటదాసు ఈ విధంగా అంటాడు.

"భాగ్యవంతులు బీదలను దోచుకుంటే దానిపేరు వ్యవహారం. బీదలు తమ హక్కును తీసుకుంటే చౌర్యం.........అశాస్త్రీయ చౌర్యములకంటే శాస్త్రీయ చౌర్యములే లోకాని కెక్కువహాని చేస్తున్నవి. భాగ్యవంతులకుపయోగించేది చట్టసమ్మతం. కానిది నేరం............బీదవాండ్లను భాగ్యవంతుల క్షేమానికే భగవంతుడు సృష్టించాడని వాండ్ల నమ్మకం............కలియుగంలో రాక్షసులుభేరంటారు కాని ధనికులే కలియుగరాక్షసులు".

మాలపల్లి నాలుగు భాగాల పెద్ద నవల. ఆనాటి సాంఘిక వ్యవస్థ అంతా ఇందులో నిరూపితం. సుమారు 800 పుటలఐతిహాసిక నవల ఇది. తెలుగు నవల స్వర్ణోత్సవ ఘట్టానికి ప్రభవించిన గొప్ప నవల. భారతదేశ ఆధునిక భాషా సాహిత్యాలలో సాంఘిక వ్యవస్థా నిరూపణాత్మకమైన ఇటువంటి నవల మరి ఒకటి అప్పటికి పుట్టలేదు.

మాలపల్లి తరువాత తెలుగు సాహిత్యంలో ఆధునిక అధ్యాయం ప్రారంభమైందని చెప్పాలి. రచయిత స్వీకరించే ఇతివృత్తపరిధి విశాలతరమైంది. 1913వ సంవత్సరములోనే ఆంధ్రమహాసభ ప్రథమ సమావేశం బాపట్లలో జరిగింది. తెలుగు మాట్లాడే జిల్లాలతో సంయుక్త మద్రాసు రాష్ట్రంనుంచి ప్రత్యేకమైన ఆంధ్రరాష్ట్రం ఏర్పడాలని, తెలుగువారి సర్వతోముఖ వికాసానికి కృషి చేయాలనీ తెలుగు పెద్దలు అప్పటినుంచీ ప్రతి సంవత్సరమూ తెలుగు జిల్లాల వివిధ ప్రాంతాలలో సభలూ సమావేశాలూ నిర్వహిస్తూవచ్చారు. భోగరాజునారాయణమూర్తి గారు 1916 నాటికే ఆంధ్రరాష్ట్రం అనే నవల కాకతీయుల చరిత్రను ఇతివృత్తంగా స్వీకరించి రచించటానికి ఆనాటి ఆంధ్రుల ఆశయం కారణమై ఉండవచ్చు. కాకతీయుల తర్వాత తెలుగు వారి చరిత్రలో అత్యుచ్ఛ్రాయదశను అనుభవించింది విజయనగరసామ్రాజ్యం. 1920 నాటికే విజయనగరసామ్రాజ్య మహర్దశ కథా వస్తువుగా విజయనగర సామ్రాజ్యం, రాయచూరు యుద్ధం వంటి నవలలు వచ్చాయి.

1920 తర్వాత నవలా రచయితలుగా చెప్పుకోవాల్సిన ప్రముఖులు అడవి బాపిరాజు. విశ్వనాథసత్యనారాయణ, చలం, నోరి నరసింహశాస్త్రి. 1922కే బందరులో శారద మాసపత్రిక ప్రారంభమైంది. శారద మాసపత్రికలో బాపిరాజు నవల హిమబిందు ధారావాహికంగా వెలువడటం 1922లోనే మొదలైంది. శాతవాహనుల కాలానికి చెందిన కథ హిమబిందు. శాతవాహనులు ఆంధ్రులని ఒకవాదం వుంది. ధాన్యకటకం రాజధానిగా విశాలమైన సామ్రాజ్యాన్ని పరిపాలించారని శాతవాహనులను గురించి కథలూ గాథలూ ఉన్నాయి. బాపిరాజు అన్నిటా ఆంధ్రాభిమాని. గొప్ప భావుకుడు. తెలుగు వారి పురాగాథోజ్జ్వల చరిత్రను కథా వస్తువుగా చేసుకొని బాపిరాజు హిమబిందు, గోన గన్నారెడ్డి అడవిశాంతిశ్రీ వంటి ప్రశస్తమైన నవలలు రచించారు.

చలం సామాజిక వ్యవస్థపై తిరుగుబాటు చేసిన రచయిత. సంఘంలో పురుషుడి ఆధిక్యం చెల్ల గూడదనీ స్త్రీకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుండాలని ఆయన వాదించారు. స్త్రీపురుష సంబంధాలలో కూడా స్త్రీకి తనదైన స్వేచ్ఛ ఉండటం ఆయనకు అభిమతం. 1926లో వెలువడ్డ ఆయన నవల శశిరేఖ వస్తువు శిల్పమూ పాత్ర చిత్రణ తన తాత్విక దృక్పధమూదృష్ట్యా అతి ప్రాధమికమైనది. ఆ తర్వాత 1934లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నిర్వహించిన పోటీకి చలం తన నవల మైదానం పంపించారు ఇది ప్రతీకాత్మకమైన నవల. చలం ఇంకా దైవమిచ్చిన భార్య. అరుణ, వివాహం, జీవితాదర్శం వంటి నవలలు రచించారు. ఆనాటి సంఘంలో కనపడుతున్న, కాపట్యాన్ని తీవ్రంగా నిరసించాడు చలం. వివాహవ్యవస్థలో స్త్రీ పురుషుల సమానత్వానికీ సుఖసంతోషాలకు చోటులేదన్నది ఆయన గాఢంగా నమ్మిన సిద్ధాంతంలాగా కనపడుతుంది. కాల్పనిక రచయితల రచనలలో ఊహాపోహలెట్లా ఉంటాయో చలం రచనలలో కూడా కాల్పనిక జగత్తు అదేవిధంగా చోటుచేసుకుంది ఆయన ప్రచారం చేసిన సిద్ధాంతాలకూ చరమ జీవితంలో ఆశ్రయించిన విశ్వాసాలకూ పొంతన కనపడదు. లేఖల్లో ఆ విషయం అయన అంగీకరించాడుకూడా.

విశ్వనాథ సత్యనారాయణ, అడవిబాపిరాజుగారలుకూడా ఆంధ్ర విశ, విద్యాలయంవారు 1934లో జరిపిన నవలల పోటీకి తమ నవలలు పంపించార్యు విశ్వనాథవారు పంపించిన నవల వేయిపడగలు. బాపిరాజు పంపించిన నవల నారాయణరావు.

విశ్వనాథవారి నవలలు అవి చారిత్రకాలైనా సాంఘికాలైనా వ్యవస్థను సమర్థించే ఉద్దేశం కనపడుతుంది. కాని నిరసించే ఉద్రేకం కనపడదు. అట్లాఅని ఆయన ఆధునిక విలువల విరోధి అనికానీ. సాంఘిక పరిణామాల బద్ధ విరోధి అనికానీ. భావించడం సరికాదేమో, వ్యవస్థ ఏర్పాటులో సహజ సిద్ధంగా ఉండే దోషంకన్నా వ్యవస్థ అను పాలనలో దోషాలుంటాయనేది ఆయన సిద్ధాంతం. ఆయన్ను అభ్యుదయనిరోధకుడనటం సరికాదు సంప్రదాయాభిమాని అనవచ్చు.

వేయిపడగలు నవలలో విశ్వనాథవారు గడచిన 2 వందల సంవత్సరాలుగా ఆంధ్రదేశంలో వచ్చిన సాంఘిక పరిణామాలను విశ్లేషించారు. ఇది ప్రతీకాత్మకమైన నవల ఆయన ఇతర నవలలు చెలియలికట్ట, ఏకవీర, మాబాబు, వీరవల్లడు బద్దన్న సేనాని, ధర్మచక్రం, ఆయన సృజనాత్మక ప్రతిభకు నిదర్శనాలు.

అడవి బాపిరాజు నారాయణరావు ఆంధ్రదేశంలోని స్వాతంత్ర్యోద్యమాన్ని సవివరంగా చిత్రించే నవల. గాంధీగారి ప్రభావం 1920 నుంచి మొదలై 1930 ఉప్పు సత్యాగ్రహం వరకు ఆంధ్రదేశాన్ని ఏవిధంగా చైతన్య వంతం చేసిందో నారాయణరావు నవల వర్ణిస్తుంది.

తెలుగులో ఐతిహాసిక నవలలు మొత్తం 10 కన్నా ఎక్కువరాలేదు. తెలుగులో గొప్ప నవలలు ఎక్కువగా రాకపోటానికి శ్రీ శ్రీ యీ విధంగా ఊహించాడు.

"అసలు సంగతి ఏమిటంటే కడచిన నూరునూట ఏభై ఏళ్ళలో మనదేశం అత్యంత హీన క్షీణదశ అనుభవించింది. సరిఅయిన విలువలు లోపించాయి. బంగారమేదో కాకి బంగారమేదో తెలుసుకో లేని స్థితి దేశానికి ప్రాప్తించింది." (వ్యాస క్రీడలు-పుట 63). ఈ మాటలే విశ్వనాథ అంటే ఆయన్ను అభివృద్ధి నిరోధకుడని వెయ్యేళ్ళ వెనుక పుట్టాల్సిన వాడని ఆక్షేపిస్తారు. విశ్వనాథ చెప్పిందికూడా ఇదే.

నవలా రచన గురించి శ్రీ శ్రీ ఇట్లా అభిప్రాయపడ్డాడు. "కుడ్య చిత్ర రచనవంటిది నవలా రచన. బహుశామన ఆంధ్రుల ప్రతిభ మినియేచర్ పెయింటింగ్‌లో కనపడుతుందనుకుంటాను." ఈ అభిప్రాయం వెలిబుచ్చడంలో ఆయన ఉద్దేశం తెలుగులో చిన్నకథలో చూపిన ప్రతిభ నవలా రచనలో సాధించలేదని కావచ్చు. ఇదే అభిప్రాయాన్ని ఆయన ఇంకో విధంగాకూడా వ్యక్తం చేశాడు." తెలుగులో సంతృప్తికరమైన కవిత్వం వచ్చినట్లు కథలు వచ్చినట్లు నవలలు ఇంకా రాలేదని నాదో చిరకాలపు పిర్యాదు ఉంది అన్నాడు శ్రీ శ్రీ రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారి రాజు-మహిషి నవలకు పరిచయం రాస్తూ రాజుమహిషీనవలను శ్రీ శ్రీ గొప్పగా మెచ్చుకున్నారు.

మాలపల్లి నుంచి చివరకు మిగిలేది నవల వచ్చేదాకా మధ్యకాలం సాంఘిక సమస్యలకూ సామాజిక పరిణామాలకు ఆర్థిక రాజకీయ సిద్ధాంతాలకు వాహికగా తెలుగు నవల సాగింది. అయితే నోరి నరసింహశాస్త్రి గారి వంటివారు ఈ కాలంలో కేవలం చారిత్రక నవలలు రచించారు. ఆంధ్రదేశ చరిత్రను ముఖ్యంగా కవి చరిత్రపరంగా రాయడం అభిమతంగా ఆయన తమ చారిత్రక నవల లన్నిటినీ నిర్వహిం

చారు. నారాయణ భట్టు, రుద్రమదేవి, కవిద్వయం, మల్లారెడ్డి, ధూర్జటి వంటివి నోరివారి ప్రసిద్ధ నవలలు.

ఆధునిక నవలా రచయితలలో కొడవటిగంటి కుటుంబరావు జి.వి. కృష్ణారావు గోపీచంద్, బుచ్చిబాబులు ప్రతిభావంతులు సమాజాన్ని శాసించే ఆర్థిక రాజకీయ పరిణామాలను, విలువలను, సాంఘిక సమస్యలను సంఘానికి వ్యక్తికీ ఘర్షణ వచ్చినప్పుడు ఉత్పన్నమయ్యే సమస్యలను తమ నవలలద్వారా ప్రతిభావంతంగా నిరూపించారు. మనోవైజ్ఞానిక విశ్లేషణకూడా స్వాతంత్ర్యం వచ్చే కాలానికి తెలుగు నవలలో ఆకర్షణీయాంశమైంది. బుచ్చిబాబు చివరకు మిగిలేది, గోపిచంద్ అసమర్థుని జీవయాత్ర మేధావి వర్గ సమస్యలనుచర్చించాయి. అవి విద్యాధికులైన పాఠకులను ఆకర్షిస్తాయి.

స్వాతంత్ర్యానంతర కాలంలో తెలుగు నవల బహుముఖంగా వికసించింది. 1950ల నుంచి కుటుంబ జీవితం నవలకు కథావస్తువైంది. మధ్యతరగతి కుటుంబ జీవితేతి వృత్తాలు బహుళ సంఖ్యాకంగా నవలలో చోటుచేసుకున్నాయి. నిరుద్యోగం ప్రేమ వివాహాలను ఆటంక పరిచే కుల అంశాలు కులాంతర వివాహాల పర్యవసానాలు 1960 తర్వాత నవలా రచయితలకు ప్రధాన ఇతివృత్తమైనాయి. స్వాతంత్ర్యానంతరం ముఖ్యంగా పేర్కొనదగిన అంశం మహిళలెందరో నవలా రచనకు పూనుకోవడం. నిజానికి రచయితలకన్నా అధిక సంఖ్యలో రచయిత్రులు సాహితీ వ్యాసంగానికి ముఖ్యంగా నవలా రచనకు పూనుకొన్నారు.

స్వాతంత్ర్యానంతరం తెలుగు నవలలో శిల్ప విషయికమైన ఎన్నో ప్రయోగాలు జరిగాయి. మానవ జీవితాన్ని, సాంఘిక వ్యవస్థను వ్యక్తి స్వేచ్ఛను తాత్విక దృక్పథంతో ఆలోచించి చర్చించి నిగ్గుదేల్చే ప్రయత్నంతో నవలలు చేపట్టిన మేధావి రచయితలు బయలుదేరారు.

వీరేశలింగం నుంచి ఉన్నవ వారి వరకు సమాజ సంస్కరణం ముఖ్యోద్దేశ్యంగా నవలా రచన సాగింది. అక్కడినుండి వ్యక్తిగత సమస్యలు సామాజిక సమస్యలుగా ఏ విధంగా పరిణమిస్తున్నాయో గవేషించడం మొదలైంది. సామాజిక సమస్యలు వ్యక్తి సమస్యలుగా కుటుంబ సమస్యలుగా మొదటి విభాగం నవలలు వెలువడ్డాయి. అటు తర్వాత వ్యక్తి సమస్యలు సమాజ సమస్యలుగా ఏ విధంగా అవగాహన చేసుకోవాలో వివేచన ప్రారంభమైంది. కిందటి శతాబ్ది ఉద్యమాలన్నీ

సంఘసంస్కరణోద్యమాలే అని చెప్పాలి. ఈ శతాబ్ది ఉద్యమాలు రాజకీయ వ్యవస్థాత్మక సిద్ధాంత పరమైనవి. ఆర్థిక వ్యవస్థాపరిణామాత్మకమైనవి. మధ్యలో రెండు మూడు దశాబ్దాలు స్వాతంత్ర్యోద్యమమూ, జాతీయాభిమాన ప్రబోధమూ కూడా నవలా రచనను ప్రభావితం చేశాయి.

స్వాతంత్ర్యానంతరం మన సాంఘిక జీవనంలో ఒక నవీన సంపన్న వర్గం బలిసింది. అన్ని రంగాలలో వ్యాపారదృష్టి ప్రబలింది. ఈ సమాజాన్ని వ్యంగ్యంగా చిత్రించే నవలలు విశ్వనాథ శాస్త్రి వ్రాశారు.

నాసికాత్ర్యం బకందగ్గర గోదావరి ప్రభవ స్థానానికీ ధవళేశ్వరం దగ్గర సాగర సంగమ సన్నాహక స్థానానికీ గోదావరినది రూపు రేఖలలో ఎంత అంతర ముందో తెలుగు నవల రాజశేఖర చరిత్రంగా ఉద్భవించిన కాలానికీ నూరేళ్ళ తర్వాత 1980 ప్రాంతాల ఈ ప్రక్రియ వికాస పరిణామాలకు అంతే తేడావుంది సర్వసాధారణంగా తాము చూస్తున్న తాము ప్రాతినిధ్యం వహిస్తున్న సంఘాన్నే కథా వస్తువు చేసుకున్నారు ఈ నూరేళ్ళ కాలంలోనూ రచయితలు రచయిత్రులు కూడా. స్వాతంత్ర్యానంతర కాలంలో సాంఘిక సమస్యల పరిధి కూడా విస్తృతమైంది. నగరీ కరణ ప్రభావం సంఘం మీద ఎక్కువైంది సాంఘిక వర్గాలలో పరస్పర చర్య ఎక్కువైంది. దేశాల ఎల్లలు భావప్రసార రూపేణ విశాలమైనాయి

స్వాతంత్ర్యానంతర కాలంలో నవలలో వస్తు వైవిధ్యం అనంతంగా విస్తరించింది. మొదటి పది సంవత్సరాలలో ఒకరిద్దరికన్నా నవలా రచయితలు లేక పోగా ఈనాడు తెలుగులో చెప్పుకోదగిన నవలా రచయితలు నూరుగురైనా కనపడతారు. ఒక చిన్న పట్టణం నగరంగా మహా నగరంగా ఆనవాలు పోల్చుకో లేనట్లు పెరిగిపోయినంతగా నవలలో ఇతివృత్త వైవిధ్యం బయలుదేరింది.

ఇప్పటికి చారిత్రక నవలలు వ్రాసేవాళ్ళూ, తమకంగా చదివే పాఠకులూ ఉంటూనే ఉన్నారు. స్వాతంత్ర్యానంతరం తెలుగు నవలా రచయితలుగా బలివాడ కాంతారావు, శారద, రావిశాస్త్రి, బీనాదేవి, రంగనాయకమ్మ. వాసిరెడ్డి సీతాదేవి మాలతీచందూర్, ద్వివేదులవిశాలాక్షి, యద్దనపూడి సులోచనారాణి ప్రముఖస్థానం సంపాదించుకున్నారు.

భాషా విషయికమైన ప్రయోగం ద్వారా ఆంధ్రదేశంలోని ప్రధానమైన మూడు మాండలిక శైలుల్లో నవలలు వ్రాసి డా॥ పోరంకి దక్షిణామూర్తి ఒక ప్రత్యేకతను సాధించారు. గోదావరి జిల్లాల మాండలిక శైలిలో వెలుగు వెన్నెల గోదారి, అట్లానే తెలంగాణా మాండలిక శైలిలో ముత్యాల పందిరి, రాయలసీమ మాండలికంలో రంగవల్లి వీరు రచించారు

యువ రచయితలలో శీలావీర్రాజు అవసరాల రామకృష్ణారావు, హితశ్రీ, ఇచ్ఛాపురపు జగన్నాధరావు, కొమ్మూరి వేణుగోపాలరావుగార్లు ప్రసిద్ధులు. తెలుగు నవలకు పాఠక బాహుళ్యాన్ని ప్రసాదించినవారు కోడూరి కౌసల్యాదేవి, యద్దనపూడి సులోచనారాణీ గారలు. వారపత్రికల సంఖ్య పెరిగినకొద్దీ ధారావాహిక నవలలకు గిరాకీ ఎక్కువవుతూ ఉన్నది. ఇటీవల యండమూరి వీరేంద్రనాథ్. మల్లాది వెంకటకృష్ణమూర్తి గార్ల రచనలకు తరుణ పాఠకులలో ఆదరణ ఎక్కువగా లభించింది. 1950 నుంచి 60, 65 దాకా లత నవలలు పాఠకులను ఎక్కువగా చదివించాయి. కొత్తదైన వస్తు సంవరణంగానీ, భావదోరణిగానీ పాఠకలోకంలో ఎక్కువగా ఆద్రుతమవుతూనే వచ్చాయి. మళ్ళీ అవి పాతబడి పోగానే కొత్తకొత్త ప్రయోగాలకోసం అన్వేషించడమూ కనపడుతున్నది. లక్షలసంఖ్యలో పాఠకులున్నందువల్ల వ్యాపారసరళి నవలా సాహిత్యానికికూడా అవకాశం వచ్చింది ఈనాడు నవలల పోటీలు నిర్వహిస్తే వందల సంఖ్యలో నవలలు వస్తున్నాయి.

ఈ నూరు నూటపది సంవత్సరాల తెలుగు నవలా సాహిత్య చరిత్రను పరిశీలిస్తే ఈ విషయాలు స్పష్టపడుతాయి.

1. మొదట్లో నవలలు సంఘసంస్కరణ ప్రబోధాత్మకాలుగా వెలువడ్డాయి.
2. తరువాత దశలో జాతీయాభిమానోత్తేజకాలుగా చారిత్రక నవలలు వెలువడ్డాయి.
3. ఈ శతాబ్ది మొదటి రెండు దశాబ్దాలు గడిచే నాటికి ఇతివృత్త వైవిధ్యం ఎక్కువైంది.
4. రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో సమాజ వ్యవస్థాతత్త్వ విశ్లేషణాత్మకంగా నవల రూపొందింది.

5. మొదటి రెండు దశాబ్దాలు గడిచిన తర్వాత ఈ శతాబ్దిలో తర్వాత రెండు దశాబ్దాల కాలాన్ని స్వాతంత్రోద్యమం ప్రభావితం చేసింది మాలపల్లి, వేయిపడగలు, నారాయణరావులాంటి నవలలు ఈ కాలంలో వెలువడ్డాయి.

6. ఆటు తర్వాత మనో విజ్ఞాన విశ్లేషణకు తమ నవలలో ప్రవేశం కల్పించారు తెలుగు నవలా రచయితలు.

7. స్వాతంత్ర్యానంతరం మధ్యతరగతి కుటుంబ జీవనాత్మకంగా నవల రూపుదిద్దుకొంది.

8. ఈ అర్ధ శతాబ్దం గడిచిన తర్వాత అధిక సంఖ్యలో మహిళలు నవలా రచనకు పూనుకొన్నారు. అందువల్ల సమాజ సమస్యలు విస్తృతంగా అనుశీలితమైనాయి.

9. రాజకీయోద్యమాలు, సాయుధపోరాటాలు, వర్గకలహం, సాంఘిక మైన దోపిడి, నవీన సంపన్న వర్గాల వంచనలు 1960ల తర్వాత కథా వస్తువుగా చాలా నవలలు వచ్చాయి.

10. తెలుగులో చెప్పుకోదగిన ఐతిహాసిక నవలలు పదికన్నా ఎక్కువ లేవు. అతడు-ఆమె, చంఘిజ్ ఖాన్ వంటి నవలలు శిల్పం దృష్ట్యా వస్తువు దృష్ట్యా స్వాతంత్ర్యానంతర కాలం వెలువడ్డ గొప్ప ఐతి హాసిక నవలలు.

11. ప్రస్తుతం సామాజిక చైతన్యాన్ని ఉద్బుద్ధం చేయగల నవలలుగాని సమస్యలు ప్రతిబింబించే నవలలు గాని రావడం లేదు. రాశిపోగా అవాస్తవిక కల్పనలతో అభూత ఊహాగానాలతో, ఉద్వేగాన్ని, ఉత్తేజాన్ని ఉద్దేశించేవీ, స్త్రీ పుంసంబంధాన్ని, సంఘంలోని నేర ప్రవృత్తినీ ఉద్రేకదాయకంగా తరుణ పాఠకులను ఆకర్షించేవీ అయిన నవలలకు ఆదరణ లభిస్తున్నదని ఒక అభియోగం వినప డుతున్నది.

12. తెలుగు నవల కాలిక పరిణామాలమీద విపులమైన ప్రామాణికమైన విమర్శ ఇప్పుడెంతో అవసరం.

సమాజానికి లక్ష్యం నిర్దేశితం కాక పోతే సాహిత్యానికి అంతే. ఇప్పుడదే మనం చూస్తున్నాం.

# కథానిక

పోరంకి దక్షిణామూర్తి

ఈ శతాబ్దిలో ఏడున్నర దశాబ్దుల కిందట తెలుగుకథ పుట్టిందని అంటే ఇందులో ఆశ్చర్యపోవలసిందీ లేదు, విచారించవలసిందీ లేదు. ఎందుకంటే, మనకు తెలిసినంత వరకు ఇది యథార్థం కాబట్టి. గురజాడ అప్పారావుగారి 'దిద్దుబాటు' కథ, అయ్యంకి వెంకటరమణయ్యగారి 'ఆంధ్రభారతి' పత్రికలో ఫిబ్రవరి 1910 సంచికలో అచ్చయింది. ఇది మొట్టమొదటి తెలుగు కథగా-అంటే, కథానికగా-గుర్తింపు పొందింది.

ఇక్కడ"కథ", 'కథానిక' అన్న పదాల్ని గురించి కొంచెం వివరించాలి అప్పారావుగారి "దిద్దుబాటు"ను కథ అనడంలో తప్పులేదు. కాని కథానిక అనడం ఒప్పుతుంది. ఎందుకంటే ప్రతికథానికా కథే; కాని ప్రతి కథా కథానిక కాదు. కథా శబ్దానికున్న అర్థవిస్తృతి కథానికాశబ్దానికి లేదు. కథానికార్థానికున్న నిర్దిష్టత, నైశిత్యం, విశిష్టత కథాశబ్దార్థానికి లేదు. 'దిద్దుబాటు'కు పూర్వం చాలా కాలంనుంచీ మనకు కథలున్నాయి; కాని కథానికలు లేవన్నది ఇంతవరకు జరిగిన పరిశీలనల వల్ల తెలియవచ్చింది.

జానపద సాహిత్య సంప్రదాయంలో మనకు-మనకే కాదు, ప్రతి భాషా సమాజం వారికీ-అనేక కథలు పారంపర్యంగా వినవస్తూ ఉన్నమాట నిజమే. కాని వాటి స్వరూప స్వభావాలు వేరు. కాబట్టి ఆధునికమయిన కథానికా ప్రక్రియ వాటికి భిన్నమయిందని చెప్పకతప్పదు. ఇంగ్లీషు సాహిత్యంతో పరిచయమున్న వారే దీన్ని తెలుగులో ప్రవేశపెట్టారనీ ఇంగ్లీషు సాహిత్య ప్రభావం వల్లనే తెలుగు కథానిక పుట్టిందనీ ఒప్పుకోడంలో తప్పులేదు.

"తెలుగులో తొలి కథానిక ఏది?" అన్న విషయంమీద ఆ మధ్య కొంత వివాదం వచ్చింది. 1977 ఆగస్టులో విశాఖ సాహితివారు జరిపిన ఒక సభలో

పురిపండా అప్పలస్వామిగారు ఈ వివాదం లేవదీశారు. ఆ ప్రక్రియకు వాడుతున్న పేరుకే ఆయన అభ్యంతరం చెప్పారు. దాన్ని 'కథానిక' అని కాని, 'కథ' అని కాని అనగూడదన్నారు. విశాఖపట్నం ప్రాంతంలోనో శ్రీకాకుళం ప్రాంతంలోనో 'తిత్తవ' అనే మాట వాడుకలో ఉందనీ అదే వాడటం మంచిదనీ సూచించారు. కాని, దీంతో రెండు ఇబ్బందులున్నాయి. ఒకటి- ఈ మాటకు అర్థం ప్రాంతీయంగా కొంతమందికి తెలుస్తుందేమో కాని తక్కిన వారందరికీ తెలుస్తుందని చెప్పలేం. కథ, కత అన్న మాటలకు అర్థం అన్ని ప్రాంతాలవారికీ తెలుసు. ఇక రెండోది- కథ, కథానిక అన్నమాటలు సంస్కృతం నుంచి వచ్చినవి కాబట్టి వాటిని పరిహరించాలని అంటే, అదీ కుదరదు. తెలియని తెలుగు మాటకంటే తెలిసిన సంస్కృత పదం వాడటంలో సులువు చాలా ఉంది. పైపెచ్చు, 'తిత్తవ' తెలుగుమాట అనుకోడానికి అవకాశం లేదు. ఇది సంస్కృతంలోని 'తత్వ' శబ్దంనుంచి వచ్చింది కావచ్చు. 'తత్త్వాలు పాడటం' తెలుగువాళ్ళకి అలవాటే. కాని, చెప్పేది కథ పాడేది తత్త్వం. కాబట్టి 'తిత్తవ' అనేది ఈ ప్రక్రియకు నప్పదన్నమాట.

ఇకపోతే, 'తెలుగులో తొలి కథానిక ఏది?' అన్న విషయానికి వద్దాం. గురజాడవారి 'దిద్దుబాటు' (1910)కు పూర్వమే ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మగారు 'కల్పలత' పత్రికలో ప్రచురించిన 'లలిత' (1903) అన్నకథ తెలుగులో తొలి కథానిక అని పురిపండావారి అభిప్రాయం. సుమారు ఏడున్నర దశాబ్దాలుగా ఎవరి కంటికీ ఆనని ఆ కథను భాస్కర స్వర్ణాంబగారు సేకరించి 'ఆంధ్ర జ్యోతి' (నవంబరు 20, 1977) దినపత్రికలో ప్రచురించారు. తీరా చూస్తే, దాంట్లో ఆధునిక కథానికా లక్షణాలు బొత్తిగా లేవు. కథావస్తువు చాలా 'సిల్లీ'గా కనిపించింది. భాషకూడా ఆధునికం కాదు. శిల్పం అసలేలేదు' ఈపాటి కథలు రాయగలవాళ్ళు 1903కు పూర్వం మాత్రం ఉండరని ఎందుకనుకోవాలి.? కాలం ఒక్కటే ప్రమాణమని అనుకోలేంకదా! ఒకవేళ అనుకొన్నా, గురజాడ వారి 'దిద్దుబాటు' అచ్చయింది 1910లోనే అయినా కథానికా ప్రక్రియను తెలుగులో రూపొందించాలన్న ఆలోచన-బహుశా ప్రయత్నం కూడా-అంతకు పూర్వం సుమారు రెండు దశాబ్దుల కిందటే ఆయన మనస్సులో ఉన్నట్లు ఆయన డైరీల వల్ల మనకు తెలుస్తుంది. అంతేకాదు, కొన్ని కథలకు బీజాలూ ప్రణాళికలూ కూడా ఆ కాలంలోనే ఆయన రాసి పెట్టుకున్నట్టు వాటివల్ల తెలుస్తోంది. (ఉదా॥ 'మెటిల్డా' కథ గురించి).

ఆచంట వారిదే 'అపూర్వోపన్యాసము' అన్న కథకూడా ఆంధ్రజ్యోతిలో పునర్ముద్రించడం జరిగింది. అదికూడా అంతంత మాత్రంగానే ఉంది. వస్తురీత్యా, భాషారీత్యా, శిల్పరీత్యా ఆధునిక కథానికలో ముఖ్యంగా గురజాడవారి కథల్లో ఉన్న నిర్దిష్టతా సైశిత్యమూ విశిష్టతా ఈ రెండు కథల్లోనూలేవు. అందుచేత తెలుగులో కథానికా ప్రక్రియకు గురజాడవారే ఆద్యులని చెప్పవలసి ఉంటుంది.

'కథానిక' అంటే చిన్న కథ అని అర్థం. దీన్ని ఒక ప్రత్యేక సాహిత్య ప్రక్రియగా గుర్తించి ప్రపంచంలో మొట్టమొదటి సారిగా లక్షణ నిర్దేశం చేసిన ప్రతిష్ట అగ్నిపురాణానికి దక్కుతుంది. అందులో కథానికా ప్రక్రియను (అధ్యాయం: 337) ఇలా నిర్వచించారు.

భయానకం సుఖపరం గర్భేచ కరుణోరసః
అద్భుతోఽంతే సుక్లప్తార్థా నోదాత్తా సా కథానికా.

కథానిక క్లుప్తంగా ఉండాలి. దూరంగా సాగిపోక పొందికగా ఉండాలి. ఇది మొదటి లక్షణం. పెద్దపెద్ద సమాసాలతోనూ వర్ణనలతోనూ కథా శరీరం బిగిసిపోకుండా అనుదాత్తంగా ఉండాలి. ఇది రెండో లక్షణం. ఈ రెండూ కథానికకు బాహ్య లక్షణాలు. ప్రతి కథానికకూ తప్పనిసరి అయినవి.

కథానికలో పఠితను సంభ్రమాశ్చర్యాల్లో ముంచెత్తే విచిత్ర సంఘటన ఉండాలి. కథాగర్భంలో హృదయాన్ని కరిగించే కరుణరసాత్మకమయిన సన్నివేశం ఉండాలి. పఠిత ఊహకు అందని విధంగా కథ అద్భుతావహంగా ముగిసిపోవాలి. ఈ మూడూ అభ్యంతర లక్షణాలు. వీటిలో ఏ ఓక్కటయినా లేకపోవచ్చు కాని 'అద్భుతాంతం' మట్టుకు లేకుండా ఉండగూడదు.

పైన చెప్పిన బాహ్యలక్షణాలు కథానికా స్వరూపానికి సంబంధించినవయితే అభ్యంతర లక్షణాలు స్వభావానికి సంబధించివవి. ఈ రెండింటి మేళవింపుతో, కథానిక చక్కగా రాణిస్తుంది. ఇదీ అగ్ని పురాణ కాలానికి కథానికను గురించి ఏర్పడ్డ భావన.

సాధారణంగా, పాఠకుడు ఏ రచన చదువుతున్నా ఆదిమధ్యాంతాలు గమనిస్తాడు. వాటిలో-ఆదిలో ఉద్వేగం కలిగించని భయానకరసం, మధ్యలో కరుణ

రసం, అంతంలో అమృతరసం ఉండాలన్నది పై లక్షణకారుడి అభిప్రాయం. కావ్యాన్ని రసపరమయిన దృష్టితో చూడటం భారతీయ లాక్షణిక సంప్రదాయం కావడం వల్లనే ఈ విధంగా చెప్పడం జరిగింది. కాని, కథానిక వంటి ఒక చిన్న రచనలో ఇన్ని రసాలు కూడినట్లయితే రసభంగం జరిగే ప్రమాదం లేకపోలేదు. అంతేకాకుండా, రచనలో రసానికే ప్రాధాన్యమిచ్చినట్లయితే దాని ప్రమేయం పెట్టుకోని రచనలు కథానికా ప్రక్రియ పరిధిలోకి రాకుండా పోతాయి. పాశ్చాత్యులూ ఆధునిక భారతీయ రచయితలు అనేకులూ రాసిన కథానికలు రసప్రాధాన్య దృష్టితో రాసినవి కాకపోయినా కథానికలుగానే రాణిస్తున్నాయి.

అగ్నిపురాణంలో చెప్పిన లక్షణాల్లో రెండంశాలకు ఎక్కువ ప్రాముఖ్యముంది: (1) సంక్షిప్తత, (2) అద్భుతమయిన ముగింపు. ప్రపంచ కథానికా సాహిత్యంలో పేరుమోసిన రచయితలు కూడా వీటిని పాటించారనడంలో సందేహం లేదు. అయితే సంక్షిప్తంగా ఉన్న ప్రతి కథా కథానిక కాకపోవచ్చు. కొందరు రచయితలు దీర్ఘమయిన కథానికలూ రాశారు. సంక్షిప్తత, దీర్ఘత అనేవి పరిమాణ సంబంధమయిన అంశాలు. ఈ పరిమాణం కథావస్తువు మీద ఆధారపడి ఉంటుంది. రచయిత ఎంచుకొన్న వస్తువును బట్టి కథానిక నిడివి పెరిగినప్పటికీ ఇది అపవాదమన్న సంగతి విస్మరించగూడదు. కథానికా రచయితకు ఉపాదేయమయినది సంక్షిప్తతే ననడంలో విప్రతిపత్తి లేదు.

ఇక రెండో అంశం, ముగింపు. కథానిక చదవడానికి పాఠకుడు కొంత సమయాన్ని వినియోగించినందుకు అతనికి తృప్తి కలిగించే శక్తి ఆ రచనలో ఉండాలి. దాన్ని చమత్కారమయిన ముగింపుతోకూడా రచయిత సాధించవచ్చు. చదువరి ఊహించని విధంగా రచయిత దాన్ని సాధించినప్పుడు నైపుణ్యం కనిపిస్తుంది. చదువరి హృదయానికి హత్తుకుంటుంది. ఆ విధమైన అనుభూతి కలిగించగల రచన జీవం పోసుకుంటుంది.

మొత్తం మీద, అగ్నిపురాణ కర్త చెప్పిన లక్షణాలను గురించి చర్చిస్తూ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు (కథానిక : 'ప్రతిభ', సంపుటి 1, సంచిక 2, ఆగస్టు 1936, పుట 160), ఆ లక్షణాలు అన్నీ ఉన్న కథానికలు ప్రాచీన సాహిత్యంలో కనిపించకపోయినా కథానిక నీడలు మాత్రం బాగా గోచరిస్తాయని అన్నారు.

శ్రవ్య, దృశ్యకావ్యాలపట్ల పెరిగిన అభిరుచివల్ల వచన రచన ముఖ్యంగా కథానికారచన-పట్ల ఆదరం లోపించడమే పైన చెప్పిన లక్షణాలతో అన్నివిధాల తులతూగే రచనలు మనకు లభించకపోవడానికి కారణం. రచనలు అంతగా జరక్కపోయీ ఉండవచ్చు. జరిగినవి నశించిపోయీ ఉండవచ్చు. అయితే అగ్ని పురాణ కాలంనాటికి సాహిత్యశాస్త్రవేత్తలకు ఈ ప్రక్రియమీద అభిమానం ఉండబట్టే పురాణకర్త, దానికి లక్షణ నిరూపణ చేశాడు; భారతీయుల ప్రతిష్ఠ నిలిపాడు.

కవితలో గీతం ఎటువంటిదో వచనరచనలో కథానిక అటువంటిది. కవితలో గీతానికి ఎంతటి ఉన్నతస్థానముందో, కథానిక అంతటి స్థానానికి అర్హమయినది. గీతానికీ దీర్ఘ కావ్యానికీ ఎలాటి తేడా ఉందో కథానికకూ నవలకూ, లేదా నాటకానికీ, అలాటి తేడా ఉంది. "సంగ్రహంగా చెప్పాలంటే పర్వతం ముందు వజ్రం ఎలా ఉంటుందో దీర్ఘకథ ముందు కథానిక అలా ఉంటుంది," అన్నాడు ఫ్రెడరిక్ బి. పెర్కిన్స్.

అయినా ఈ ప్రక్రియకు పాశ్చాత్య సాహిత్యంలో కూడా పందొమ్మిదో శతాబ్ది వరకు ఆదరం లభించలేదు. అమెరికా కథానికా రచయితల్లో ప్రప్రథము డనిపించుకొన్న వాషింగ్టన్ ఇర్వింగ్ కూడా ఈ ప్రక్రియను యాదృచ్ఛికంగా చేపట్టాడు (1819). ఆయితే ఇర్వింగ్ తన రచన మౌలికంగా ఉండాలన్న ఉద్దేశంతో 'స్కెచ్' అనే ప్రక్రియను రూపొందించుకొన్నాడు. దాంట్లోకూడా సాధారణతను కాకుండా నిర్దిష్టతను అభిలషించాడు. అతనికి కావలసినవి నమూనాలు కావు. ఒక మూసలో పోసినట్టుండే పాత్రలుకావు. జీవంతో తొణికిసలాడే వ్యక్తులు కావాలి. కథకొక పథకం వేసుకోడం, నాటకీయమైన సంఘర్షణ రూపొందించడం వంటి వాటితో అతనికి ప్రమేయం లేదు. ఏదయినా ఒక చిత్తవృత్తిని కాని భావోద్రేకాన్ని కాని తీసుకొని, దానికి తగ్గవాతావరణం కల్పించి రచన సాగించడం ప్రారంభించాడు. ఈ విధంగా ఇతడు కథానికనొక ప్రత్యేక సాహిత్య ప్రక్రియగా గుర్తించాడు. తరువాత చాలామంది ఆ మార్గాన్ని అనుసరించారు. త్వరలోనే అది యూరప్‌లో జనాదరణ నందుకొన్నది. ఈ ప్రభావం అమెరికాలో కూడా యువ రచయిత లనేకులను ఉత్సాహపరిచింది. కాథరిన్ సిడ్జువిక్, పౌలింగ్,సిమ్స్, హాథారన్, పో-కథానిక రచనలో అగ్రగాములనిపించుకున్నారు.

హాథారన్ ప్రతిభావంతుడయిన రచయిత. 'పో' వంటి ఉత్తమ విమర్శకుడి మన్నన నందుకొన్నాడు. ఈయన ప్రచురించిన కథల సంపుటి పాశ్చాత్య కథానికా సాహిత్యంలో చరిత్ర సృష్టించింది. ఈ కథలను 'పో' పరిశీలించి, 'గ్రాహమ్స్ మేగజైన్' అనేపత్రికలో 1842 ఏప్రిల్-మే మాసాల్లో వెలువడ్డ సంచికలో సమీక్ష ప్రచురించాడు; లక్షణ నిర్దేశం చేశాడు. 1885లో బ్రాండర్ మాథ్యూస్' 'పో', 'ది ఫిలాసఫీ ఆఫ్ షార్ట్‌స్టోరీ' అన్న వ్యాసం రాస్తూ, 'పో' వెల్లడించిన అంశాల్లో అస్పష్టంగా ఉన్నవాటిని స్పష్టం చెయ్యడానికి పూనుకొని, కథానికకు అవశ్యకమయిన లక్షణాలు ఎనిమిది చెప్పాడు. (1) మౌలికత (2) ఏకత (3) క్లుప్తత (4) శైలీరమ్యత (5) క్రియాశీలత (6) రూపం (7) వస్తువు (8) వీలుంటే-విపరీతకల్పన.

కథానికా ప్రక్రియ తాలూకు నిర్దిష్టాంశాల విషయంలో అగ్నిపురాణ కాలం నుంచి ఈనాటి వరకు భిన్నాభిప్రాయమన్నది లేదు. భారతీయ లాక్షణికులు సూత్రప్రాయంగా చెప్పిన అంశాలకు పాశ్చాత్య సాహిత్య శాస్త్రంలో 'వివరణలు' గ్రహించవచ్చు. అయితే భారతీయ కథానికా ప్రగతి అనేక శతాబ్దాల కాలం కుంటు బడినందువల్ల పాశ్చాత్య లాక్షణికులు చూపించిన శ్రద్ధ భారతీయ లాక్షణికులు చూపించలేదు. అందువల్ల, భారతీయ లాక్షణికులు, పాశ్చాత్యుల మాదిరిగా ఈ ప్రక్రియను సంపూర్ణంగా ఆవిష్కరించలేక పోయారు. ఏది ఏమయినప్పటికీ భారతీయ, పాశ్చాత్య సాహితీవేత్తలు ఉభయులూ చాలావరకు ఏకదిశగానే ప్రయాణిం చారనడంలో సందేహంలేదు ఈ ఉభయులూ చెప్పిన లక్షణాల్ని సమన్వయం చేసుకొని, 'కథానిక'ను—

ఏకాంశవ్యగ్రమయి స్వయం సమగ్రమయిన
కథాత్మక వచన ప్రక్రియ[1]గా నిర్వచించవచ్చు.

సాహిత్యం కథాసహితం కావచ్చు. కథారహితం కావచ్చు. కథాసహితమ యినది వచనాత్మకమయినా కావచ్చు, పద్యాత్మకమైనా కావచ్చు. కథాసహితమయి వచనాత్మకమైన రచననే పై నిర్వచనంలో కథాత్మక వచన సాహిత్యం (ప్రోజ్ ఫిక్షన్) అని చెప్పడం జరిగింది. దీని ప్రధానరూపాల్లో, ఒకటి నవల, రెండోది కథానిక.

1 ఈ వ్యాసకర్త, తన సిద్ధాంత గ్రంథంలో ప్రతిపాదించినది.

ప్రక్రియాపరంగా కథానికకు రెండు లక్షణాలున్నాయని పై నిర్వచనంలో తెలుస్తుంది: (1) ఏకాంశ వ్యగ్రత (2) స్వయం సమగ్రత.

మానవ జీవితంలో అనేక సంఘటనలు ఎదురవుతూ ఉంటాయి. అనేక సంవేదనలు అనుభూతమవుతూ ఉంటాయి. అనేక ఆలోచనలు ఏర్పడుతూ ఉంటాయి. వాటిలో ఏ ఒక్క అంశమో స్వీకృతమయి, ఆద్యంతం ఏకోన్ముకంగా సాగుతూ మూలభావంలో పర్యవసించడం దీని ప్రధానగుణం. తక్కిన అంశాలు ఏవీ చేరినప్పటికీ ఉద్దిష్టలక్ష్యానికి అవి ఉపబలకాలవుతాయి; వాటికి ప్రాధాన్యం మాత్రం ఉండదు. ఇదే ఏకాంశ వ్యగ్రత.

రెండోది స్వయం సమగ్రత. అంటే- అవసరమయిన విషయం అవసరమయినంతమట్టుకే చెప్పి, ఇంతకుమించి చెప్పవలసింది మరేమీలేనట్టు, మరిదేనితోనూ సంబంధం లేనట్టు, సంపూర్ణమయిన కళాఖండంగా భాసించడమన్న మాట.

కథానిక అంటే చిన్న కథ అన్న అర్థం ఎలాగా తెలుస్తుంది. కనుక 'క్లుప్తత' విషయం ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు.

ఈ రెండు లక్షణాల్ని బట్టే ఒక రచన 'కథానిక' అవునో కాదో తేల్చుకోవచ్చు. పాశ్చాత్య రచయితల ప్రభావంవల్ల భారతదేశంలోకి ప్రవేశించిన 'ఆధునిక' కథానిక, ఇతర భాషల మాదిరిగానే తెలుగును కూడా ప్రభావితం చేసింది. దాంతో తెలుగు కథానిక పుట్టడమే ఆధునికంగా పుట్టింది. గురజాడ అప్పారావుగారి తరువాత శ్రీ పాదసుబ్రమణ్యశాస్త్రి, చింతాదీక్షితులు వంటివారు మొదలు నేటిరచయితల దాకా కొన్ని వందలమంది-దాదాపు ఎనిమిది దశాబ్దుల కాలంలో-కథానికలు విరివిగా పండించారు. వాటిలో జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపుపొందిన కథానికలుకూడా ఉండడం వల్ల, తెలుగు కథానిక, ప్రపంచంలోని ఏ భాషా సాహిత్యంలోని కథానికకూ తీసిపోదని గట్టిగా చెప్పవచ్చు.

సాధారణంగా, కథానికను మూడుకోణాల్లో పరిశీలిస్తూ ఉంటాం: (1) వస్తువు (2) భాష (3) శిల్పం, వీటిని బట్టి స్థూలంగా, కథానిక మంచిచెడ్డలను నిర్ణయిస్తూ ఉంటాం. కాని వింగడించి చూసినట్లయితే ఇంకా అనేక అంశాలు పరిశీలనలోకి వస్తాయి.

# త్రిమితీయ విశ్లేషణ

కథానికను త్రిమితీయం (three_dimensional)గా విశ్లేషించవచ్చు: (1) వస్తుగత విశ్లేషణ (2) రూపగత విశ్లేషణ (3) సంవిధాన విశ్లేషణ.

రచనకు మూలభూతమయి, ప్రేరక బీజంతో మొదలుకొని పరమార్థసిద్ధి పర్యంతం సాగే అంతఃస్రోతస్విని వస్తుగత విభాగం. ఆది నుంచి అంతం వరకు వివిధావయవాలతో సుసంఘటితమయిన కథాశరీరం రూపగత విభాగం. అవయవ సంఘటన కావించి సౌష్టవంచేకూర్చి, సౌందర్యాన్ని పోషించే వివిధాంశాల సమాహారం సంవిధాన విభాగం.

వస్తుగత విశ్లేషణలో పరిశీలనకు వచ్చే అంశాలు నాలుగు: కథాబీజం, కథావస్తువు. ఇతివృత్తం, పరమార్థం.

ఒకసన్నివేశంకాని, సంఘటనకాని, భావసంఘర్షణకాని, శీలవిశిష్టతకాని, వాతావరణస్థితికాని, ఒక ఊహకాని, విలక్షణకాని-ఇలాంటి వాటిలో ఏ ఒక్కటయినా కథకుడి హృదయంలో స్పందన కలిగించినప్పుడు, ఆలోచనకు ప్రేరణ ఇచ్చినప్పుడు, కథారూపం పొందే అవకాశమున్నప్పుడు దాన్ని కథాబీజం అంటాం.

కథకుడి మనస్సులో నాటుకొన్న బీజం నానినాని మొలకవేసి నప్పుడు దాన్ని కథా వస్తువు అంటాం. కథాబీజం, వస్తువుకు మాతృక అన్నంత మాత్రాన ఆ వస్తువు, బీజానికి భిన్నరూపం దాల్చే అవకాశం కూడా లేకపోలేదు. ఒకప్పుడు ఆ రెండింటికీ పోలికే లేకపోవచ్చు.

రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు, 'మెరుపు మెరిసింది' అన్న కథ రాయడానికి ప్రేరణ ఎలా కలిగిందో వివరిస్తూ 'ఓ కథ కథ' అన్న వ్యాసం ఒకటి రాశారు. మద్రాసులో చదివే రోజుల్లో ఆయన సహాధ్యాయుల్లో ఒక పిసినారివాడు ఉండేవాడట. అతను పరీక్ష రోజుల్లో కూడా బస్సులోనే కాలేజికి వెళ్తూండేవాడట. ఒక రోజున బస్‌స్టాండులో ఎంతసేపు పడిగాపులు పడిఉన్నా బస్సు దొరకలేదు. ఒక మూల, పరీక్షకు టైమయిపోతుంది. అతను చాలా ఆందోళన పడుతున్నాడు. ఇంతలో ముక్కూ-మొహం తెలియని పెద్దమనిషి ఒకాయన కారులో వెళ్తూ, అతన్ని ఎక్కించుకొని కాలేజి దగ్గర దిగవిడచి వెళ్ళాడట. ఆ అపరిచితుడు చేసిన సాయం

ఆ సహాధ్యాయి, సంతోషంగా అందరికీ చెప్పాడు. అది విన్నమీదట విశ్వనాథ శాస్త్రిగారికి- "కార్లో ఓ మొగోడు లిఫ్ట్ ఇస్తేనే ఈ కుర్రోడింత పొంగిపోతున్నాడు! మరింక వయసులో ఉన్న ఆడదే కాని లిఫ్ట్ ఇస్తే కుర్రోడెంత పొంగిపోనో!" అనుకున్నాడు. 'మెరుపు మెరిసింది' అన్న కథకు ఇదీ బీజం.

ఇది కథావస్తువు మొలకెత్తడానికి కారణమయింది. 'ముప్ఫయి ఐదేళ్ళు వెళ్ళినా వివాహంకాని స్త్రీకి- అందులోనూ అనాకారికి- అందంగా ఉన్న సంపన్నుడితో పరిచయమయినప్పుడు ఆమె హృదయంలో ఆశ కలగడం సహజం. కొద్ది రోజుల తరువాత అతని చూపు తనమీంచి మళ్ళిపోయినప్పుడు ఆమె నిరాశతో కుంగిపోవచ్చు' కథాబీజానికిది తొలిపరిణామం. ఇది కథావస్తువు.

కథావస్తువుకు రచనానుకూలమయిన పథకం రూపొందించుకొన్నప్పుడు అది ఇతివృత్తం (Plot) అవుతుంది. విశ్వనాథశాస్త్రిగారి ఇతివృత్తంలోని కథా సంగ్రహాన్ని ఇలా చెప్పవచ్చు.

నీరజ ఒక స్కూల్లో టీచరు. ఆమెకు ముప్ఫయి ఐదేళ్ళు వెళ్ళాయి. పెళ్ళి కాలేదు. అది ఆమెకు చింతగా ఉంటుంది. అందులో ఆమె అనాకారి. అయినా తనకు పెళ్ళికావాలనీ పిల్లలు పుట్టాలనీ కోరిగ్గా ఉంటుంది. వర్షాకాలంలో ఒకనాడు ఆమె స్కూలుకు వెళ్ళడానికి బస్సుకోసం చాలాసేపు నిరీక్షిస్తూ బాధపడుతూ ఉండిపోయిన సమయంలో నడివయసు సుందరాంగుడొకడు దారినిపోతూ, తనకారు ఆపి ఆమెను ఎక్కించుకొని వెళ్ళి స్కూలుదగ్గర విడుస్తాడు. దాంతో ఆమె పులకించిపోతుంది. ఆ చిన్న సంఘటన పునాదిమీద ఎత్తయిన కలల భవనాలు కట్టేసుకుంటుంది. ఆ చిన్న స్నేహమే పెద్దదయి పెళ్ళిగా పరిణమించగూడదా-అని ఆశలు పెట్టుకుంటుంది. ఆ మర్నాడు కూడా వర్షం కుండపోతగా కురుస్తూ ఉండడంతో అదే టైముకు, అదే బస్స్టాండు దగ్గర అదే కారుకోసం ఆమె ఎదురుతెన్నులు చూస్తూ ఉంటుంది. ఇంతలో నిన్నటి సుందరాంగుడు మళ్ళీ అదే దారంట వెళ్తూ, కారుఆపి కూడా, ఆమెను చూసికూడా, చూడనట్టు నటించి, ఆమెకంటె చిన్నవయస్సులోనూ అందంగానూ ఉన్న నలుగురు ఆడపిల్లల్ని కారులో ఎక్కించుకొని, ఈమెను నిరాశకూ వర్షానికీ వదిలేసి వెళ్ళిపోతాడు. *

---

* రాచకొండ విశ్వనాథశాస్త్రి, ఓ కథ కథ, అనామిక సంక్రాంతి ప్రారంభ సంచిక, జనవరి 1975, పు. 13-15.

కథాబీజ స్థితినుంచి సంపూర్ణ వికాస స్థితివరకు కలిగే పరిణామం ప్రతి రచయితకూ అనుభవవేద్యమే. అయితే ఈ పరిణామం ప్రతి రచయిత విషయం లోనూ, ప్రతి రచన విషయంలోనూ ఇలాగే జరుగుతుందని చెప్పలేం.

కథలో ఎత్తుగడమొదలు ముగింపు వరకు పూలలో దారంలాగసాగే ప్రధానాంశాన్ని 'కథాసూత్రం' అంటూంటారు. ఇది అఖండంగా సాగడం కథానికకు తప్పనిసరి. ఓకానొక 'నడివయస్సు అవివాహిత' హృదయాభిలాషే రాచకొండ కథలో అంతస్సూత్రం. ఇది ఏకోన్ముఖంగా సాగింది.

రచన చదివినప్పుడు స్థూలంగా అది కలిగించే అనుభూతి ఏమిటి? లేదా దాని పరమార్థం ఏమిటి- అన్న ప్రశ్న ఉదయిస్తుంది. రాచకొండ కథలోని సీరజనే తీసుకొంటే, ఆమె పరిస్థితికి- "అయ్యో,పాపం!" అనిపిస్తుంది. పాఠకుడికి ఆమెమీద సానుభూతి కలుగుతుంది. సమాజంలో అటువంటివాళ్ళు ఎందరో ఉంటారు. వాళ్ళను సానుభూతితో అర్థంచేసుకోవాలన్న స్ఫూర్తి పాఠకుడికి కలుగుతుంది. తద్వారా అతని సంస్కారం పెరుగుతుంది. ఇదే ఈ కథలో పరమార్థం

రూపగత విభాగంలో ఆరు అంశాలు పరిశీలనలోకి వస్తాయి: ఎత్తుగడ, నడక విషమస్థితి, పరాకాష్ట (పట్టు), చరమసీమ (విడుపు), ముగింపు.

రచయిత ఏర్పరుచుకొన్న పథకాన్ని అనుసరించి కథను ఎక్కడ ప్రారంభిస్తాడో అది ఎత్తుగడ. అది పాఠకుణ్ణి ఆ కట్టుకోవాలి. కథ చదవడానికి అతన్ని సుముఖుణ్ణిచేసి ఆసక్తి పుట్టించి ఉత్కంఠ రేకెత్తిస్తే పాఠకుడు తప్పకుండా చదువుతాడు. అది సంవాదంతో మొదలుకావచ్చు. దృశ్యవర్ణనతోనూ మొదలుకావచ్చు ఒక్కొక్క ఎత్తుగడ సంఘర్షణతోనే మొదలవుతుంది. ఇలా ఏ విధంగా ఆరంభమయినప్పటికీ పాఠకుడు సూటిగా కథలోకి ప్రవేశించేటట్టు ఉండాలి. "నా మీద చాలాసార్లు హత్యాప్రయత్నం జరిగింది. మొట్టమొదటిసారి-మా అమ్మ కడుపులో ఉండగా-ఆరు నెలలప్పుడు, "అంటూ ఎత్తుకుంటాడు ఒక రచయిత, ఈ ఎత్తుగడ పాఠకుణ్ణి ఆకట్టుకోడంలో ఆశ్చర్యంలేదు.

రెండోది నడక. ఇది కథకు చాలా అవసరం. నడకలేనిది నిశ్చల చిత్రమే అవుతుంది కాని కథానిక కాజాలదు. ఈ నడక సూటిగానూ సాగవచ్చు. మలు

పులూ తిరగవచ్చు. కొంతసేపు మందగొడిగానూ సాగవచ్చు. మరుక్షణంలో మరింత వేగం పుంజుకోనూవచ్చు. సాధారణంగా కథల్లో పురోగమనం (ఒక నిర్దిష్ట కాలంలో మొదలయి అనంతర కాలంలోకి) ఎక్కువగా చూస్తూ ఉంటాం. కొన్ని కథల్లో-ఫ్లాష్ బాక్ పద్ధతిలో- తిరోగమనమూ (కొంత మట్టుకయినా) చూస్తూ ఉంటాం. కొంతముందుకూ కొంత వెనక్కూ పోతూవస్తూ చెడుగుడు ఆడినట్టు ఉంటుంది ఒక్కొక్క కథ గమనం. దీన్ని తిర్యగ్గమనమనీ అనవచ్చు.

మొత్తంమీద కథాగమనం ఆద్యంతం కుంటుబడకుండా సాగాలన్నది నిర్వివాదాంశం, వేటగాడు ఎక్కుపెట్టి విడిచిన బాణంలా దూసుకు పోతూండాలని చెప్తారు. అందుకు అనువుగా రచయిత రాసే ప్రతి వాక్యంలోంచీ మరో వాక్యం సహజంగా పుట్టుకువస్తుంది.

మూడో అంశం విషమస్థితి (Crisis) కథాగతమయిన ఫలాపేక్షకు అవరోధమేర్పడి పరస్పర విరుద్ధశక్తుల మధ్య ఘర్షణ ఏర్పడి, పర్యవసానం అనిశ్చితంగా ఉన్నప్పటి స్థితిని విషమస్థితి అనిగాని సంకటస్థితి అనిగాని చెప్పవచ్చు. ఇది పాత్రల మధ్య ఏర్పడవచ్చు. పాత్రకూ సన్నివేశానికీ మధ్య ఏర్పడవచ్చు. కథలో ఇటువంటి విషమస్థితులు పాఠకుడి ఉత్కంఠను రేకెత్తిస్తాయి, ఆలోచనకు పురిగొల్పుతాయి ఇటువంటి ఘట్టాన్ని నిర్వహించడంలో రచయిత ప్రతిభ రాణిస్తుంది.

నాలుగో అంశం పరాకాష్ఠ (Climax) దీన్నే ఉత్కర్ష అని కూడా అంటూంటారు. ఆరోహణ క్రమంలో సాగుతున్న కథ, శక్తినంతనూ కూడగట్టుకొని ఏ శిఖర స్థాయి నందుకొంటుందో అదే పరాకాష్ఠ.

ఇది సంఘటనరూపంలో ఉండవచ్చు. సంఘర్షణాత్మకంగా నయినా ఉండవచ్చు. ఇది పాత్రగతమయినప్పుడు పాక్షికంగా బాహ్యమూ పాక్షికంగా ఆభ్యంతరమూ కావచ్చు. సంఘటన, సన్నివేశాల బలమున్నప్పుడు అది బాహ్యమవుతుంది. అంతస్సంఘర్షణ అయినప్పుడు ఆభ్యంతరమవుతుంది ఈ రెంటి కలయికా మామూలు.

ఐదో అంశం చరమసీమ (denoument). ఇది పరాకాష్ఠకూ ముగింపుకూ మధ్యవస్తుంది. పరాకాష్ఠలో ఏర్పడ్డ భావోద్రేకాలన్నీ చరమసీమకు వచ్చేసరికి కొంత

వరకు శమిస్తాయి: చిక్కుముడులు విడివడతాయి, కథాగమనం ముగింపువేపు త్వర త్వరగా సాగుతుంది.

ప్రతి కథలోనూ చరమసీమ ఉండాలన్న నియమంలేదు. పరాకాష్ఠనుంచి నేరుగా ముగింపుకు వచ్చే కథలుఉన్నాయి. పరాకాష్ఠతోనే ముగిసిన కథలూ ఉన్నాయి.

ఆరో అంశం ముగింపు. కథానిర్మాణం యావత్తూ ముగింపు మీద ఆధార పడి ఉంటుంది. అందువల్ల రచయితలు ముందు ముగింపు ఏలా వుండాలో నిర్ణ యించుకొని ఎత్తుగడను గురించి ఆలోచించడం మామూలు. ఐక్యసాధనదృష్ట్యా ఆద్యంతాలకు సంబంధముంటుంది. ఆ రెంటిలో, అంతానికే అధిక ప్రాముఖ్యముం టుంది. "కథాతరంగం, ముగింపుమాట దగ్గరే బయలుదేరాలి", అంటాడు జేమ్స్ స్టెర్న్, *అంటే రచయిత ఎక్కడ ముగిస్తాడో అక్కణ్నించి కథ పుట్టుకొస్తుందన్న మాట.

కథానికకు 'అద్భుతాంతం' ఉండాలంటాడు అగ్నిపురాణ కర్త. ఓ. హెన్రీ కథల్లో ఇది కనిపిస్తుంది. దీన్నే "కొస మెరుపు" అంటూంటారు. కథకు కొస మెరుపు అందంచేకూర్చవచ్చు. కాని కథాస్వభావానికి అదివిరుద్ధమయి అసహజంగా కనిపించినప్పుడు పాఠకుడి నిరసనకు గురికావచ్చు. కృతకమైన కొసమెరుపుకంటే సహజమైన సాదా ముగింపునే సాధారణంగారచయితలూ పాఠకులూ అభిలషిస్తారు.

త్రిమితీయ విశ్లేషణలో పరిశీలనకు వచ్చే మూడో విషయం సంవిధాన విభాగం ఇందులో ప్రధానంగా ఐదంశాలున్నాయి: పాత్ర, సంఘటన, సంఘర్షణ, సన్నివేశం, కథనం.

రూపకాల్లోనూ కథాత్మక రచనల్లోనూ సంవాద, నటనలద్వారా స్వీయప్రవృత్తిని ప్రకటించే-లేదా తన ప్రభావాన్ని ప్రసరింపజేసే వ్యక్తిని పాత్ర (Chara-

---

* "The ripple must start, not finish, with the last word" James stern, as quoted by Victor Jones, Creative Writing, St. Paut's House Warwick Lone, London, Ec, 4P, P. 63-64.

cter) అంటాం. పాత్ర చెప్పేది సంవాదం(dialogue), పాత్ర చేసేది నటన/చర్య (action). ఈ రెంటికీ మూలం వైయక్తికప్రవృత్తి. పాత్రల్లో కొన్ని, మొదటినించి చివరివరకు ఏ మార్పూ లేకుండా ఉండవచ్చు. మరికొన్ని సమూలంగా మారుతూ ఉండవచ్చు. మార్పు ఉన్నప్పటికీ కథలో పాత్రప్రవేశానికీ నిష్క్రమణకూ ఉండే మధ్యవ్యవధిలో పాత్రప్రవర్తనలో ఒక సంగతత్వం (Consistancy) ఉండక తప్పదు. అది సహేతుకం కావాలి.

ఈనాడు కథ అంటే మానవకథ; ముఖ్యంగా, మాన్యతవున్న సామాన్యుని కథ. అతని చుట్టూవున్న సమాజశక్తుల పరస్పరవైరుధ్యంలోంచి పుట్టిన బాహ్యాభ్యంతర సంఘర్షణల కథ అందువల్ల కథా పాత్రలు మానవసహజమైన ఆశానిరాశలనూ సాఫల్యవైఫల్యాలనూ రాగద్వేషాలనూ స్వార్థనిస్స్వార్థాలనూ అత్యంత స్వాభావికంగా ప్రదర్శిస్తాయి.

కథ పాత్రచుట్టూ నడిపించవచ్చు. పాత్రవేషభాషలూ అభ్యాసప్రవర్తనలూ అతనిస్థితికీ స్థాయికీ స్వభావానికీ సంకేతాలు. మానవప్రపంచానికి ఏకదేశికసంక్షిప్తరూపమే కథాగత పాత్ర. దీనికి కర్తాభోక్తా పాత్రే. కాబట్టి కథలోకి ప్రవేశించని పాత్ర ఉండవచ్చు కాని పాత్రలేని కథమట్టుకు జరగదనే చెప్పవచ్చు.

రెండో అంశం సంఘటన (incident) ప్రత్యక్షంగాగాని పరోక్షంగాగాని పాత్ర(ల)ను ప్రభావితం చేసేటట్లుగా జరిగిన విషయాన్ని సంఘటన అనవచ్చు. ఇది ఒకటైన కావచ్చు. ఎక్కువైనా కావచ్చు. కాని ప్రధానమైంది ఒక్కటే ఉంటుంది.

సంఘటనలు రెండు రకాలు: సయత్నకమయినవీ యాదృచ్ఛికమయినవీ. యాదృచ్ఛికమైనవాటిలో మానవేతరశక్తి ప్రమేయమున్నవి కూడా సంభవించవచ్చు. సంఘటనల్లోంచి నాయకులు పుట్టుకురావచ్చు. ఒక చిన్న సంఘటన ఒక మహోద్యమానికి నాంది పలకవచ్చు. ఒక్కచిన్న సంఘటనతోనే మహాసంరంభం కూడా చప్పగా చల్లారిపోవచ్చు.

మూడో అంశం సంఘర్షణ (Conflict). రెండు పరస్పర విరోధశక్తులు తలపడినప్పుడు కలిగే రాపిడిని సంఘర్షణ అంటాం ఇది బాహ్యం కావచ్చు; అంత

రికమూ కావచ్చు. కుటుంబంలో, వర్గంలో, సమాజంలో, రాజకీయవ్యవస్థలో-ఎక్కడైనా ఎదురయేది బాహ్యసంఘర్షణ. పాత్ర అంతరంగంలో సంభవించేది అంతస్సంఘర్షణ. ఈ రెంటికీ కథమీద ప్రభావముంటుంది. దీని పర్యవసానం మీద కథా పర్యవసానం ఆధారపడిఉంటుంది.

నాలుగో అంశం సన్నివేశం (situation). ఒకానొక పాత్రగాని పాత్రలుగాని ఉన్న స్థితిని సన్నివేశమనవచ్చు. ఇది కేవలం వైయక్తికంకాదు; అతనిచుట్టువున్న పరిసరాలు, నేపథ్యం, వాతావరణం మొదలైనవన్నీ దీంట్లో చేరతాయి.

పాత్రల స్థితి అన్నది సంపూర్ణంగా ఆంతరికం కాదు. బాహ్య ప్రభావాల ముద్ర దానిమీద ఉండనే ఉంటుంది. దేశకాలాదులు దానికి కారణమవుతాయి.

సన్నివేశచిత్రణ సహజంగా, సంగ్రహంగా సాగడమన్నది కథకు శోభ చేకూరుస్తుంది. అందులో ప్రతిదానికీ ప్రతివాక్యానికీ సార్థకం సాధించవలసి ఉంటుంది. అనావశ్యకాన్ని-అది కొంచెమున్నప్పటికీ-పరిహరించి ఆవశ్యకాన్ని పోషించడం రచయిత ప్రథమ కర్తవ్యమవుతుంది. ఆ విధమైన వర్ణనలో ప్రతి చిన్న అంశమూ సన్నివేశంలో అంతర్భాగమై ఉండాలి. అందుకు అనుగుణమైన భాషా శైలిని ప్రయోగించాలి.

ఐదో అంశం కథనం (narration). కథలో పాత్రల సంవాదంవినా, తక్కినదంతా కథనంలోకి వస్తుంది. ఇది రెండు విధాలుగా ఉండవచ్చు; ఒకటి, పాత్రలే ఆత్మగతంగా చెప్పేది; రెండోది, కథకుడు తానుగా చెప్పేది. కథకుడు తానుగా చెప్పడానికీ ఇతరులచేత చెప్పించడానికీ అనుసరించే పద్ధతులు వేరువేరుగా ఉండవచ్చు.

కథకుడు సర్వసాక్షి (omnisient) స్థానంలో ఉండి ప్రథమ పురుషలో చెప్పేపద్ధతి ఒకటి. పాత్రలోకి ప్రవేశించి అతని ముఖత: ఆత్మగతంగా (ఉత్తమ పురుషలో) చెప్పేది మరొకటి. ఐతే రచయితకు ప్రథమ పురుష కథనంలో ఉండే సౌకర్యం ఉత్తమపురుష కథనంలో ఉండదు. ప్రథమపురుషలో అతడు సర్వసాక్షి, సర్వవ్యాపి. అందువల్ల పాత్రలకు తెలియని అంశాల్నీ తెలియనవసరంలేని అంశాల్నీ తెలిసే అవకాశంలేని అంశాల్నీ తానే చెప్పవచ్చు. వాటిని వ్యాఖ్యానించవచ్చు. ఏకకాలంలో భిన్నపాత్రల బాహ్యాభ్యంతర ప్రవృత్తులను రమ్యంగా బహు

వర్ణపటంగా చిత్రీకరించవచ్చు. కాని ఉత్తమ పురుషలో చెప్పినప్పుడు అతని చూపు, అతనిమాట ఏకదేశంగానే సాగక తప్పదు.

కథనానికి సహజవాహకం సరళమైన భాష. తాను నిర్ణయించుకొన్న వస్తువుకు, రూపొందించిన ప్రణాళికకు అనుగుణంగా ఉండాలి అతని శైలి. భాషను ఎంత పొదుపుగా, ఎంత సహజంగా వాడితే కథకు అంత అందం వస్తుంది.

మొత్తంమీద, పైన పేర్కొన్న అంశాలన్నిటినీ దృష్టిలో ఉంచుకొని పరిశీలించినట్లయితే కథానిక స్వరూప స్వభావాలు తెలుస్తాయి.

## శిల్పం

సాహిత్య చర్చల్లో పదిమంది అలవోకగా ప్రయోగించేదీ కొందరి నిరసనకు గురి అవుతున్నదీ 'శిల్పం' (technique) అన్నపదం. ప్రాచీన భారతీయ లాక్షణికులు శిల్పశబ్దాన్ని పారిభాషికార్థంలో ప్రయోగించిన దాఖలాలు కనిపించలేదు. "అమలోదాత్త మనీష నేనుభయ కావ్యప్రౌఢి బాటించు శిల్పమునం బారగుఁడం, గళావిదుఁడ........" * అంటూ తిక్కనగారు చెప్పడంలోకూడా శిల్పశబ్దానికి నైపుణ్యం అన్న సామాన్యార్థమేకాని పారిభాషికార్థం లేదు. ఇది అర్వాచీన కాలంలోనే సాహిత్యశాస్త్రంలోకి ప్రవేశించింది.

సాహిత్య పారిభాషికపదకోశం (Dictionary of Literary Terms, Mc Graw-Hill Book Company, New York: London etc. 1972, P. 373)లోనూ ఆక్స్‌ఫర్డ్ సంక్షిప్త నిఘంటువులోనూ రాండమ్‌హౌస్ సమగ్ర నిఘంటువులోనూ, 'టెక్నిక్' అనే పదానికి ఇచ్చిన అర్థాలను పరిశీలించినట్లయితే: "ఒక రచయిత (లేదా, కళాకారుడు) తనపనిలో 'కళాకౌశలాలను వినియోగించే రీతి, సామర్థ్యం: ఒక నిర్దిష్టరంగంలో వినియోగించే ప్రత్యేకీకృత పద్ధతులు, ప్రక్రియావిధానాల సమాహారం' అన్నది స్పష్టమవుతుంది. సంగ్రహంగా చెప్పాలంటే ఏ పనిలోనయినా చూపించే కళా "నైపుణ్యం"-లేదా ఆ నైపుణ్యాన్ని చూపించే పద్ధతి అని చెప్పవచ్చు, కాబట్టి కథానికా రచనలో రచయిత చూపించే

---

* నిర్వచనోత్తరరామాయణము, ఆం. ప్ర. సాహిత్య అకాడమి ప్రతి,1968 పు.3

నైపుణ్యమే శిల్పమని చెప్పవలసి ఉంటుంది. కథానికా శిల్పం అన్నదానికి ఇంత కంటె విశేషార్థం కనిపించడం లేదు.

కథానికా రచయితగా అంతర్జాతీయ ఖ్యాతి పొందిన పాలగుమ్మి పద్మరాజు గారు 'కథానికా శిల్పం' అన్న పేరుతో ఒకవ్యాసం * రాస్తూ, "కథలో ఏది ఎక్కువ స్ఫుటంగా చిత్రించాలో నిర్ణయించడమే కథాశిల్పంలో ముఖ్యమైనది.... కథానికలో ప్రతివాక్యం ప్రతిభావచిత్రం మెరుస్తుండాలి. వైచిత్రి కథానికకు ప్రాణం" అని అన్నారు. దీన్నిబట్టి త్రిముఖాత్మకంగా విశ్లేషించిన కథానికా ప్రక్రియలో రూపగత విభాగంలోని 'ఎత్తుగడ' మొదలు 'ముగింపు' వరకు సంవిధాన విభాగంలోని 'పాత్ర' మొదలు 'కథనం' వరకు మొదట్లో ఉదాహరించిన ప్రతి అంశమూ శిల్పాన్ని ప్రదర్శిస్తుందని చెప్పవచ్చు.

'కథానికాశిల్పం' అన్న మాటను 'కథానికాప్రక్రియ' అన్న అర్థంలో వాడటం చూస్తూ ఉంటాం. అలాగే 'శిల్పం' అన్నపదాన్ని 'రచనానైపుణ్యం' అనే అర్థంలోనూ వాడుతున్నారు, కాబట్టి కథానికాప్రక్రియలో అభివ్యక్తమయ్యే రచనా నైపుణ్యాన్ని కిందివిధంగా వర్గీకరించుకోవచ్చునని ప్రతిపాదించడమైంది: వస్తు విన్యాసశిల్పం, పాత్రచిత్రణశిల్పం, సంఘటనఘటనాశిల్పం, సంఘర్షణోత్పాదన శిల్పం, సన్నివేశకల్పనా శిల్పం, కథనశిల్పం, వర్ణనశిల్పం, శీర్షికాశిల్పం.

ఈ మాదిరిగా ప్రక్రియాంతర్గతమైన వివిధ అంగాలు రచనా నైపుణ్యం కనబరచినప్పుడు ఆ రచన ఒక కళాఖండం అనిపించుకొంటుంది. కాని, వివిధ అంగాల కూర్పు యాంత్రికంగా జరిగినప్పుడు సమీక్షకుల నిరసనకు గురికాక మానదు. గతానుగతికమైన సూత్రబద్ధకథలు (**formula stories**) ఈ కోవలోవి కథానికా శిల్పం పేరిట ఇతివృత్తమనే చట్రం ఒకటి బిగించి, తోచినదేదో దాంట్లో నింపినట్లయితే పాఠకుడు స్వీకరించడు.

'కథానికాశిల్పం' వస్తువుతో ముడిపడి ఉన్నదేకాని దానికి ప్రత్యేకమైన అస్తిత్వమంటూ లేదు. ఒకే వస్తువును నలుగురు రచయితలు నాలుగు విధాలుగా దర్శించవచ్చు. ఈ దర్శనంలోని భిన్నత్వం వల్లనే వస్తు, శిల్ప విచక్షణ భావమే

---

* భారతి (వ్యయ-కార్తికం), నవంబరు 1946, పు. 408.

ర్పడుతోంది. ఇది భ్రమ అని చెబుతూ ఆర్. ఎస్. సుదర్శనంగారు, "వస్తువుకు ఆకృతిలేదు. రచయిత దర్శనమే వస్తువుకు ఆకృతి కల్పిస్తుంది. అదే కథ; కథా శిల్పం అంటే ఆ దర్శన వైశిష్ట్యమే,"* అంటారు; మనం చెప్పుకొనే నమూనాలూ లక్షణాలూ కేవలం కొండగుర్తులు మాత్రమేనని కూడా అంటారు.

## కథానిక : సమాజం

సాహిత్యం సమాజనిష్ఠం. అది వైయక్తిక సృష్టికావచ్చు: సామూహిక సృష్టికావచ్చు. సమాజానికీ వ్యక్తికీ పరస్పర పోష్య పోషకభావం ఉంది. పైగా, వ్యక్తికీ తనదయిన అంతరంగం ఒకటి ఉంది. అభిరుచి ఉంది. అపేక్ష ఉంది. సమాజంకోసం వాటిని పూర్తిగా వదలుకోలేడు. సమాజమూ అతన్ని వదులుకోలేదు.

సాహిత్యానికీ సమాజానికీ పరస్పర పోష్య పోషక సంబంధమున్నట్లే బింబ ప్రతిబింబ భావం కూడా ఇమిడిఉంది. అందువల్ల తెలుగు కథానిక సమాజ స్థితిగతులకు ఏవిధంగా అద్దంపడుతున్నదీ పరిశీలించవలసి ఉంటుంది. ఈ పరిశీలనకు తోడ్పడే అంశాలను స్థూలంగా ఆరు విభాగాలుగా వింగడించవచ్చు.

1) సంస్కృతి సంప్రదాయాలు 2) కుటుంబజీవనం 3) వృత్తి-ఉద్యోగం
4) రాజకీయ ప్రభావాలు 5) సాంఘికనేరాలు-దురాచారాలు 6) అభ్యుదయ కామన

"ఏ కళాకారుడూ వాస్తవాన్ని సహించడు", అన్నాడు కవీ తాత్త్వికుడూ అయిన నీషే (Friedrich Nietzsche) తరువాత కొన్నేళ్ళకు, అస్తిత్వవాది రచయిత అయిన ఆల్బర్ట్ కామూ (Albert Camus), నీషే చెప్పింది ఒప్పుకుంటూనే దానికి మరో వాక్యాంశం కలిపాడు- "వాస్తవంలేనిదే ఏ కళాకారుడూ ముందుకు సాగలేడు" అని.

---

* తెలుగుకథ : శిల్పం. 'తెలుగుకథ' (వ్యాససంకలనం), ఆంధ్ర సారస్వత సమితి, మచిలీపట్నం, 1974 (పుటలకు సంఖ్యలు లేవు).

వాస్తవానికి కేవలం అద్దం పట్టడంవేరు; దానికి కళాకృతి ఇవ్వడం వేరు కళాకారుడు స్వభావత: సృజనాత్మక గుణసంపన్నుడు. కాబట్టి తాను చూసినదానికి ఒకపొందిక, ఒక ఎంపిక, ఒక క్రమం ఏర్పరుస్తాడు. అంటే వాస్తవానికి అతడు రూపకల్పన చేస్తాడని అర్థం. ఆ రూపకల్పనలో 'వాస్తవం' మారుపాటు చెందుతూ ఉండవచ్చు. అప్పుడు కళాకారుడిలో విమర్శనాత్మకత గోచరిస్తుంది. తద్వారా అతడు సమాజ విమర్శకుడని కూడా అనిపించుకొంటాడు. రచయిత విషయంలో ఇది మరీ స్పష్టమవుతుంది.

## తెలుగులో కథానిక

తెలుగు కథానికావాఙ్మయ చరిత్రలో గురజాడవారి 'దిద్దుబాటు' అచ్చయిన సంవత్సరాన్ని (1910) ఒక సరిహద్దుగా తీసుకొన్నప్పుడు ఆనాటినుంచి నేటి వరకు ఈ ప్రక్రియలో రచనలు చేసి వాఙ్మయాన్ని సంపన్నంచేసిన రచయితలు కొన్ని వందలమంది కనిపిస్తారు. వీరిలో కొన్ని వందల కథలు పుంఖానుపుంఖంగా రాసిన వాళ్ళూ ఉన్నారు. పట్టుమని పదికూడా రాయకపోయినా అద్భుతనైపుణ్యం చూపించి చిరస్మరణీయులయినవాళ్ళూ ఉన్నారు. అంతవరకు ఎందుకు ? కనీసం ఒక్కటయినా మంచికథ రాసినవాళ్ళూ అనేకమంది అవుపిస్తూ ఉంటారు. వాళ్ళలో కొందరికి గుర్తింపు రావచ్చు, రాకపోవచ్చు. ఇతర ప్రక్రియలు సాధించడంలో పేరుతెచ్చుకొన్నవాళ్ళు కొందరు (ఉదా॥ కొనకళ్ళ వెంకటరత్నం) కథారచనలో చేసిన కృషి కొందరి దృష్టికే ఆనదు. అయినప్పటికి తెలుగులో కథానికా వికాసానికి వీరందరి కృషి తోడ్పడుతుంది. ప్రస్తుత ప్రణాళికకున్న పరిమితులవల్ల వారందరి రచనలనూ పరిశీలించడానికి కాని, కనీసం పేర్కొనడానికి కాని, అవకాశం లేదు. కాబట్టి కొందరు రచయితలనూ కొన్ని రచనలనూ స్థూలంగా ప్రస్తావించడం మట్టుకే ఇక్కడ చెయ్యగలిగింది.

గురజాడ రచించిన ఐదుకథలూ సమాజపరిశీలనలోంచి పుట్టుకొచ్చినవే. పురుషుడి వేశ్యా వ్యామోహం (దిద్దుబాటు) మత విశ్వాసాన్ని స్వార్థప్రయోజనాల కోసం వినియోగించుకోడం (మీ పేరేమిటి) వయస్సు మళ్ళిన భర్తతో కాపురం చేస్తూ జీవితంలో భద్రత కోసం మనసును చంపుకోనే పడుచు ఇల్లాలి ఆరాటం

(మెటిల్డా), నిగ్రహం కోల్పోయిన సంస్కర్త బలహీనత (సంస్కర్త హృదయం) మతాంతరీకరణ (పెద్ద మసీదు) వారికి కథావస్తువులయాయి. జీవద్భాషా ప్రయోగంతో బాటు చక్కటి సంవాదనైపుణ్యం, చమత్కారమైన వ్యాఖ్యలు గురజాడ కథానికా రచనకు వన్నెతెచ్చాయి.

తరువాత చెప్పుకోదగ్గ రచయిత శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. ఆయన మొట్టమొదటి కథ "ఇరువురమొక్కచోటికేపోదము" 1914లో వెలువడింది. ముగ్ధప్రేమికుల విషాదాంత కథ ఇది. శ్రీ పాదవారు, పడుచు వితంతువుల జీవిత సమస్యలను అనేక కథలకు వస్తువులుగా గ్రహించారు. దానికి కారణం, కందుకూరి వీరేశలింగంపంతులుగారి పట్లా వారి ఉద్యమం పట్లా శాస్త్రిగారికి గల గౌరవం. 1925 మే నాటి రెడ్డిరాణి పత్రికలో "బుచ్చివెంకటయ్యమ్మ" కథ రాస్తూ, "భూమంచి రెడ్లలో వితంతు వివాహవాంఛయైన పొడమని రోజులవి.... "బాలవితంతువగు ఒకి రెడ్డియువతి మరల పెళ్ళి చేసుకొన్నట్లు ఒక కథ కల్పించండి. అని నన్నాయన కోరెను." అంటూ తమ మిత్రులయిన రెడ్డిగారొకరు బాల వితంతువైన తమ కుమార్తెను దృష్టిలో పెట్టుకొని అలా కోరినట్లు శాస్త్రిగారు పేర్కొన్నారు. ఈ విధంగా వాస్తవ జీవితంలో కనిపించే సమస్యల్ని ఎన్నుకుని కథలు రాయడం శ్రీ పాదవారి సమకాలికతాస్పృహకూ ఆధునికతకూ నిదర్శనం "ఇల్లాంటి తవ్వాయి వస్తే", "బ్రాహ్మణాగ్రహారం", "మార్గదర్శి" మొదలైనవి అందుకు ఉదాహరణలు సవర్ణహిందువులు పంచములపట్ల చూపించే వైఖరి ఎలాటి దుష్పరిణామాలకు దారితీస్తుందో సహేతుకంగా నిరూపించారు. "ఇలాటి తవ్వాయి వస్తే" అన్న కథలో, "దేశస్వాతంత్ర్యం కంటె సంఘ సంస్కారము ముఖ్యమన్న నిశ్చయం ఈయనలో కనిపిస్తుంది" "హిందూ సంఘం స్త్రీల గౌరవాన్ని మరచి పోయిఉంది. అందుచేతనే దేశం ఇలా ఉంది" అంటారు వీరు. స్త్రీలు వివేకంతో సాహసంతో ముందడుగు వేస్తే తమను తాము ఉద్ధరించుకోడంతో బాటు సంఘాన్ని కూడా ఉద్ధరించగలరని శాస్త్రిగారి అభిప్రాయం. "హిందూ సంఘం కట్టుబాట్లను సడలించకపోతే తమ సౌకర్యాల కోసం కొందరు అన్యమత స్వీకారం చేస్తారు సుమా-అన్న హెచ్చరిక "సాగర సంగం" కథలో వ్యక్తమవుతుంది. కథావస్తువరణంలోనే కాదు, భాషలోనూ భావంలోనూ కూడా ప్రగతిశీలి క్రాంతదర్శి అచ్చమయిన తెలుగు కథకుడు శ్రీపాద.

చింతా దీక్షితులుగారు "చెంచురాణి" మొదలు "వటీరావు" వరకు వింత వింత ప్రవృత్తులనూ "దాసరిపాట" వంటి దయనీయగాథలను కూడా కథలుగా తీర్చిదిద్దారు. మాడపాటి హనుమంతరావుగారు తొలితరం కథారచయితల్లో వారే కాని అనువాదాలే ఎక్కువ చేశారు. హృదయశల్యము, నేనే అన్నకథలు, వారి మౌలిక రచనానైపుణ్యానికి మచ్చుతునకలు.

తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారు కవులూ పండితులూ సభాపతులూ మాత్రమే కాక కథకులుగా కూడా వన్నెకెక్కారు. గుడిపాటి వెంకటచలంగారు, స్త్రీల మానసిక వికాసానికి అవరోధాలుగా కనిపించిన సాంఘికమయిన కట్టుబాట్లను నిరసించి స్త్రీ పురుష సంబంధాల మధ్య స్వేచ్ఛను ప్రతిపాదించే కథలు రచించారు. ఆయన భావాల్లో ఎంత పదునుందో ఆయన భాషాశైలిలో అంతబలముంది. చలంగారి దొకధ్రువమయితే మునిమాణిక్యం వారిది మారో ధ్రువం. సంసార జీవతంలోనే సిరులూ మరులూ పండించుకోవచ్చునన్న వాస్తవానికి ప్రతిబింబాలు ఆయన కథలు. వాటికి వన్నె తెచ్చినవి ఆయన చమత్కారాలూ హాస్యప్రియత్వమూ, చలంగారి ఉప్పెనకు మునిమాణిక్యం వారి కాంతం అడ్డుకట్టగా నిలిచిందంటే ఆశ్చర్యం లేదు.

భాషలో సరళతా, భావంలో స్పష్టతా, సమకాలిక స్థితిగతుల సంపూర్ణావగాహనా, ప్రగతిశీలం గల రచయిత కొడవటిగంటి కుటుంబరావుగారు. అటు గల్పికల్లోనూ ఇటు కథల్లోనూ కూడా సిద్ధహస్తుడనిపించుకొన్నాడీయన. మధ్య తరగతి మనస్తత్వాన్ని ఈయనలా అన్ని కోణాలలోంచీ చూసి, చూపించిన వాళ్ళు అరుదు.

మల్లాది రామకృష్ణశాస్త్రిగారు, బంగారాన్ని చికిలిచేసినట్టు కథారచన చేసిన రచయిత భాషమీద ఆయనకున్న అధికారం అసదృశమయినది. భూమిమీద "మమకారం" మాత్రమే కాక ఆనాటి రాజకీయ, సాంఘిక, ఆర్థిక పరిణామ ప్రభావాలను కూడా చిత్రించే కథలను అందించిన గోపీచంద్ స్ఫూర్తిమంతమయిన రచనలు చేశారు.

1925-50 మధ్యకాలంలో వేలూరి శివరామశాస్త్రిగారు సుమారు ఏభై వరకు కథలు రాశారు. ఆర్థిక మాంద్యం ఏర్పడ్డ కాలాన్ని గురించి వీరు రాసిన "డిప్రెషన్ చెంబు" కథ పఠితల్ని బాగా ఆకట్టుకొంది. "ఏ మతమ్ములో

తప్పున్నది, స్వార్థపరుడైన మానవునిలో కాక ?" అంటారు వీరు, "వ్యత్యయం, కథలో కులాలు, మతాలు, జాతులు, వృత్తులు, మానవ మనోవృత్తులు మొదలయిన విషయాలు వీరి కథలకు వస్తువులయాయి.

తెలుగు కథారచయితలలో ప్రత్యేకంగా పేర్కొనదగ్గవారు పాలగుమ్మి పద్మరాజుగారు. ఈయన "గాలివాన" కథకు అంతర్జాతీయ కథల పోటీలో బహుమానం రావడం తెలుగు కథాసాహిత్యానికి పెద్ద గౌరవం. "పడవప్రయాణం", "టెలిఫోన్" వంటి ఇతర కథలు కూడా పద్మరాజుగారి పేరు నిలబెట్టేవే.

బుచ్చిబాబు మంచి కళాకారుడు. ఆయన కళాదృష్టి, "ఎల్లోరాలో ఏకాంత సేవ", అరకులోయలో కూలిన శిఖరం", నన్ను గురించి కథ వ్రాయవూ" వంటి కథలన్నిటిలోనూ అవుపిస్తుంది.

బలివాడ కాంతారావు, మధురాంతకం రాజారాం, కొమ్మూరి వేణుగోపాలరావు, ఇల్లిందల సరస్వతీదేవి, తురగా జానకీరాణి, మంజుశ్రీ, హితశ్రీ, అవసరాల రామకృష్ణారావు, పెద్దిబొట్ల సుబ్బరామయ్య, ఆర్. వసుంధరాదేవి, ఆర్.ఎస్. సుదర్శనం మొదలయిన వారు సున్నితమయిన మనోవృత్తుల్ని చిత్రించడంలో మంచి నేర్పరులుగా ప్రసిద్ధిపొందారు.

కరుణకుమార, రాచకొండ విశ్వనాధశాస్త్రి, కాళీపట్నం రామారావు, బీనాదేవి, సి.ఎస్. రావు, నగ్నముని, రాజారామమోహనరావు, దివి వెంకట్రామయ్య వంటివారు. కింది స్థాయిలవారికి జరిగే అన్యాయాల్నీ అక్రమాల్నీ ప్రతిభావంతంగా కథలుగా తీర్చిదిద్దారు. మా. గోఖలే, చానో, ఇస్మాయిల్ ప్రభృతులు వాటిలో వర్ణచిత్రాలు కళ్ళకు కట్టించారు.

అట్టడుగునున్న అరిపేద మొదలు ఆగర్భ శ్రీమంతుని వరకు ఎన్నిరకాల మనుషులు, ఎన్నిరకాల ప్రవృత్తులు, ఎన్ని తీరుల సమస్యలు, ఎన్ని విధాల సంఘర్షణలు, ఎన్ని అసంతృప్తులు, ఎన్ని ఆరాటాలు ఎదుర్కొంటూ ఉంటారో తెలుగు రచయితలు తమ కథల్లో చూపించారు రచయితకు ప్రతిభే ఉండాలి కాని వస్తువులకు కొరతలేదని నిరూపించారు. వర్ణనలో, పాత్ర చిత్రణలో సంవాద చాతుర్యంలో, బహిరంతర సంఘర్షణల్లో వైవిధ్యం ప్రదర్శించారు.

కథకుడి ఉపోద్ఘాతంలో మొదలయి దేశకాలపాత్రల వర్ణనల్లో అడుగుపెట్టి నిదానంగా మదగజంలా సాగిపోయే జానపద కథాకథనం గురజాడ చేతుల్లోనే నిశితంగా మారిపోయింది. ఎత్తుగడల్లో, పాత్రప్రవేశంలో, వర్ణనల్లో, సంభాషణల్లో సంఘర్షణల్లో సంక్షిప్తత, నిర్భరత, నైశిత్యం చోటుచేసుకొన్నాయి. కథ ఒక చోట మొదలవుతుంది. కొంతవరకు సాగుతుంది. టక్కున మలుపు తిరుగుతుంది. ఘర్షణ ఏర్పడుతుంది. కథ మంచి పట్టులోకి వస్తుంది. ఒక మెరుపుమెరుస్తుంది. కథ ముగుస్తుంది. ఈ వరస, కచ్చితంగా అన్ని కథలకీ ఇలాగే ఉంటుందని కాదు. రకరకాల ప్రయోగాలు జరిగాయి, రకరకాలుగా రచనలు అందగించాయి.

గురజాడ కాలం నాటికేకాక, తరవాత కొంతకాలం వరకుకూడా కావ్యభాషా శృంఖలాల్ని వదిలించుకోలేని వ్యావహారిక భాష రానురాను స్వేచ్ఛపొంది బాగా మెరుగులు దిద్దుకోసాగింది. వాక్యవిన్యాసంలోనూ పలుకుబడిలోనూ సహజత్వం ఉట్టిపడసాగింది. తన పరిసరాల్లో వినిపించే శిష్టజనుల వాడుకను విన్నదివిన్నట్టు అచ్చువేసిన ప్రగతిశీలి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఆ కాలపు చాలామంది రచయితల్లాగే శ్రీపాదవారు కూడా చాలా కాలం వరకు గ్రాంథికాన్నే ఆశ్రయించారు. తరువాత, సంభాషణలు, మట్టుకు వ్యావహారికంలో నడిపి, రచయిత కథనం మాత్రం గ్రాంథికంలో రాస్తూ వచ్చారు. ఇదొక పరిణామదశ; ప్రయోగ దశ. ఈ శతాబ్ది మొదటి పాదం ముగిసే దాకా ఆయన రచన అలాగే సాగింది. తరువాత వ్యావహారికం విజృంభించింది.

కథల్లో శిష్టేతర పాత్రలు వచ్చినప్పుడు వాళ్ళకు సహజమైన శైలినే ప్రయోగించడం రెండో పరిణామం. నిజానికి, దీనికి మూలం గురజాడవారి మొదటి కథలోనే-రాముడి పాత్రచేత పలికించిన మాటల్లోనే ఉంది. కాని చాలా కాలం వరకు రచయితలు ఈరహస్యం కనిపెట్టలేదనుకుంటాను. ఆ తరవాత మరో పరిణామం కూడా వచ్చింది. సంభాషణల్లో మట్టుకే కాకుండా రచయిత కథనంలో యావత్తు శిష్టేతర జానపద మాండలికం ప్రయోగించడం దాన్ని ఎంచుకొని కథా రచనకు ఉపక్రమించిన ప్రముఖుడు మా. గోఖలే, తరవాత తెన్నేటి సూరి. రాచకొండ, ఇరివెంటి కృష్ణమూర్తి, సురమౌళి. డా॥ యశోదారెడ్డి, దేవరాజు మహారాజు, తిరుపతయ్య మొదలయిన వారు శిష్టేతర జానపదుల పదజాలాన్నీ వాక్య విన్యాసరీతినీ పుణికి పుచ్చుకొని వైవిధ్యం చేకూర్చారు.

వాక్యాలు రానురాను సరళమయ్యాయి. క్రియారహిత వాక్యాల తరచుదనం పెరిగింది. శ్రీపతి, వాకాటి పాండురంగరావు వంటివారి చేతుల్లో వచన కవితారీతికి చేరువయిన సందర్భాలు కూడా ఉన్నాయి.

ఈ విధంగా తెలుగు కథానిక పరిమాణంతోబాటు ప్రమాణాన్ని కూడా పెంచుకుంటూ వస్తోంది. ప్రసిద్ధ రచయితల కథానికలు కొన్ని హిందీ, బెంగాలీ, ఇంగ్లీషు, మలయాళం, కన్నడం వంటి భాషల్లోకి కూడా అనువాదమవుతున్నాయి. అలాగే "విపుల" మొదలయిన పత్రికల ద్వారా ఇతర భాషల్లోని కథలు కూడా తెలుగు పాఠకులకు అందుబాటులోకి వస్తున్నాయి.

కాని దురదృష్టమేమిటంటే, ఏ ఏడాది కా ఏడాది తెలుగులో వచ్చిన మంచి కథలను వరసగా చదివి ఆనందిద్దామంటే అవకాశం ఇంతవరకు కలగడమే లేదు. తెలుగులో వచ్చిన మంచి కథలను ప్రతి ఏటా ఎంపికచేసి వరసగా సంపుటాలుగా ప్రచురించే ప్రయత్నం తెలుగు విశ్వవిద్యాలయం వంటి సంస్థవేస్తే ఎంతో మేలు.

# "తెలుగు వ్యాసవిలాసం"

ఆచార్య వేటూరి ఆనందమూర్తి

## సంగీతాన్ని, వ్యాసాన్ని నిర్వచించడం కష్టం

రసికుడైన ఏ కవినైనా సంగీతాన్ని గూర్చి ఓ రెండుమాటలు చెప్పమంటే చెప్పేదనుకోండి అందులో ఎప్పుడూ ఒకటి తప్పవుతూనే ఉంటుంది — అని **Aaron Copland** కాబోలు అన్నట్లు **Frank Muir Book** లో ఒక కొటేషనుంది. లోకంలో ఉన్నదానిని రమ్యంగా చిత్రించి, లేనిదానిని కూడా ఉన్నట్టుగా కల్పనా ప్రపంచంలో భావించి, వాక్చిత్రాలలో కట్టెదుట నిల్పే శక్తిగల ఎంతటి కవిపుంగవుడైనా సరే సంగీతకళ అంటే ఏమిటో వివరించమంటే అతడు నానా తంటాలు పడి అర్ధసత్యాన్నే గానీ దాని సంపూర్ణతత్త్వాన్ని ఎన్నడూ వ్రాక్కుచ్చనేరడని దాని తాత్పర్యము. లలితకళల్లో సంగీత శాస్త్రాన్ని గురించి చెప్పేటప్పుడు ఈ మాట ఎంత సత్యమో సాహిత్య శాస్త్రానికి సంబంధించిన వ్యాసకళ విషయంలోనూ ఇది అంతే సత్యము! శ్రుతిలయల్ని ఆధారపరచుకొని, ఆరోహణావరోహణలతో స్వరప్రస్తారంతో, మనోధర్మప్రధానమై విస్తరించే సంగీతం చైతన్య ప్రయోగ దశలో ఒక శాస్త్రంగానూ, ఆవిష్కార దశలో ఒక కళగానూ భాసించి కళాకారుని విశుద్ధయత్నమే సహృదయులైన శ్రోతల అనుభూతిలో ఆనందానికి పర్యాయం అవుతుంది. అలాగే వ్యాసం కూడాను. వాగర్థాలను ఆశ్రయించి, పూర్వపక్ష సమాధానాలతో భావవాక్య సంయోజనంతో, విషయం విరివిచెందే వ్యాసంకూడా ఆనందావిష్కార ప్రయత్నంలో కళనూ శాస్త్రాన్నీ కరిగించి, విషయ స్వభావాలను బట్టి కూర్చుకొన్న వ్యక్తిత్వపు అచ్చులో పోసి తీర్చుకొన్న ఒక రమ్య రసాకృతి.

## వ్యాసం నిర్మాణదశలో శాస్త్రం ఆవిష్కృతరూపంలో కళ

వ్యాసంలో శాస్త్ర లక్షణం విషయ నివేదనంలో కన్నా భావసంయోజనంలోనూ ఆలోచనతో కూడి ఆలోచింపజేసే విమర్శక తత్త్వంలోనూ వ్యక్తమవుతుంది. వ్యక్తిత్వాన్ని వెలిబుచ్చే ఆత్మీయతా ముద్రలోను కథనుపలె ఒక్క పెట్టున రెండో

సారికూడా చదివించే సృజన తత్త్వంలోను, అభిరుచిని పెంపొందించే అభివ్యక్తి రీతిలోను, వ్యాసంలోని కళాధర్మముంటుంది. భావపరిపుష్టిలో చమత్కారముంటుంది. రసముంటుంది.

## వ్యాసం ఆధునికం గద్యప్రధానం

ఇంతకూ ఇది పద్యం కన్నా వేరైన గద్యంతో కూర్చబడేది. ఆధునికం. తక్కిన కావ్యరూపకాది వాఙ్మయ ప్రక్రియలన్నింటిని మింగేసి బహుళవ్యాప్తితో నానాటికి బలం పుంజుకొంటున్న అర్వాచీన వచనరచనా పరిణామం. ప్రధానంగా పాశ్చాత్య వాఙ్మయ ప్రభావ ఫలితంగా రూపుదిద్దుకొన్న రచనావిశేషం. ఇన్నింటి సమాహారస్వరూపమే అయికూడా నిశ్చయించి విడివిడిగా వీటిల్లో ఏ ఒక్కటీ ఇది కాదేమో అనిపింపజేసే అనిర్వాచ్య పదార్థం వ్యాసం. అందుకే వ్యాసవిలాసాన్ని సంభావించి నిర్వచించే ప్రయత్నం ప్రయాసతో కూడుకొన్నదే గాని అధిక ప్రయోజనకారి కాదన్నది విజ్ఞులు చెప్పేమాట. అంతేకాదు అది తప్పనిసరిగా విఫలప్రయత్నమే అన్నదీ అనుభవ సత్యమే. Attempt అనే అర్థం కల Essay అనే పదాన్ని గురించి వ్రాస్తూ "any attempt to define "attempt" must perforce end in failure" అన్నాడు Hudson. అయినా ఇట్టి యత్నాలను ఎవరూ విరమించుకోవటమూలేదు. విస్మరించడమూ లేదు. పెద్దవీ, చిన్నవీ, మంచివీ, చెడ్డవీ, వ్యాసాలూ, వ్యాససంకలనాలూ వెలువడుతూనేవున్నవి. ఆ వ్యాసాలను క్రోడీకరించి పరిశీలించి విశ్లేషించి వాటిమీద రాస్తున్న పెద్ద పెద్ద సిద్ధాంత వ్యాసాలూ వస్తూనే వున్నవి; లఘు వ్యాసకాలూ ముద్రణలో కనిపిస్తూనే వున్నవి. అటువంటి యత్నంలో భాగంగా వెలువడుతున్నదే ఇప్పటి మన తెలుగు వ్యాస విలాస పరిణామాలను సంగ్రహంగా సమీక్షించే ఈ వ్యాసకమున్నూ.

## వ్యాసవస్తువు పాతదే అయినా ప్రక్రియ కొత్తది

"The word essay is late but the thing is ancient" అని ఐరోపీయ వ్యాసాన్ని గురించి బేకన్ అన్నారు. అలాగే ఆంగ్లవ్యాసాన్ని భారతీయ వాఙ్మయంతో సమన్వయిస్తూ K. R. శ్రీనివాసయ్యంగారూ "germs of the essay are found in the Upanishads, in Plato, Cicero in Seneca or in Plutarch's Moralia" అన్నారు. మన ప్రాచీన సాహిత్యంలోనూ నేటి వ్యాసానికి మూలబీజాలు లేక పోలేదు.

## క్రోడపత్రాలూ వ్యాసాలే

"పండితులు వివిధ విషయాలను ఉపన్యసించే సిద్ధాంతీకరించే వాక్యార్థాలూ శాస్త్రార్థాలూ వాటితో ఏర్పడిన క్రోడపత్రాలూ ఒకవిధంగా వ్యాసాలే" అన్నారు నూరేళ్ళ తెలుగు వ్యాసాన్ని సమీక్షించిన తిరుమల రామచంద్రగారు. Eassay లేదా 'వ్యాసం' అని ఈనాడు పిలువబడే రచనా విశేషంలోని వస్తువిశేషం పాతదే అయినా ప్రక్రియ కొత్తదే అనీ దానినామమూ రూపమూ ఆధునికమైనదీ అర్వాచీన మైనదీ అని ఆయా రచయితల అభిప్రాయం.

## పాశ్చాత్యవ్యాసం పదహారోశతాబ్దం తర్వాతిదే

వస్తుగతంగా ఇది ప్రాచీనమే అయినా ఈ ఆధునిక వచన రచనా ప్రక్రియ అచ్చమయిన వ్యాసంగా Authentic essay గా పాశ్చాత్య భాషలో పరిణ మించింది పదహారో శతాబ్ది తరువాతనే అని విమర్శకుల అభిప్రాయం. Essay అనబడే ఆ ప్రక్రియా, తద్వాచకమూ, మొదట ఫ్రెంచి భాషలోనూ సాహిత్యం లోనూ పొడసూపి ఆంగ్లంలో రూప పరిణామాన్ని పొంది రూఢి కెక్కింది. తత్సంపర్కంవలన తెలుగులోనూ ఆ ప్రక్రియ అవతరించి విరివిచెంది నామాంత రాలతో కొంతకాలం పిలుబడినా, చివరికి "వ్యాస" నామాన్ని సంతరించుకొని ప్రబలమై నవ్యప్రయోగాలలో కొత్తరూపును దిద్దుకొంటున్నది. నవ్యప్రక్రియగా కాకున్నా పాతదైన వ్యాసవస్తువును పాశ్చాత్యులు సంభావించినట్లే తెలుగులోనూ పాశ్చాత్య సంపర్కంలేని దశలో అచ్చంగా దేశీయమైన ప్రాచీన వ్యాసవస్తువూ వ్యాసనామమూ, పొందిన పరిణామాన్ని మనం కొంత భావించవచ్చును. తెలుగులో వ్యాసవిలాసాన్ని సమీక్షించే ఈ వ్యాసకంలోని విషయం తత్పరిశీలనమే. ఈ పరిశీలనంలో ఆధునికగద్యయుగంలోని వ్యాసం, తన్నామం, నిర్వచనం, లక్షణం పాశ్చాత్య వాఙ్మయంలో దానికున్న చారిత్రక నేపథ్యం, దాని ఉత్పత్తి. వికాసం సమీక్షించి మన ప్రాచీన వ్యాసవస్తువును, అర్వాచీన వ్యాసరూపాన్ని, స్వభావాన్ని నిర్మాణాన్ని తత్త్వాన్ని దృష్టిలో పెట్టుకొని తెలుగు వ్యాసపరిణామాన్ని సంభా వించడమే లక్ష్యం

## ఇది వ్యాసపరిణామ సూచియే గానీ, వ్యాససూచికాదు

ఇది తెలుగు భాషావ్యాసపరిణామసూచియే గాని వ్యాససూచి కాదు. తెలుగు వ్యాసముల సమీక్ష అంతకన్నా కాదు. ఇట్టి యత్నంలో వ్యాసపరిణామ

పరిగణనకు పనికివచ్చే వ్యాసాల, వ్యాససంకలనాల, వ్యాసకర్తల పేర్లు ఎవరెవ రెన్నెన్ని ఉదాహరించినా అవి అన్నీ కొన్నే అయి, ఇంకా ఎన్నో మిగిలిపోతూనే వుంటాయి. ఆ విషయమై ఎంత చెప్పబోయినా అది కొంతే తేలి చెప్పినదానికన్న చెప్పవలసిందే అధికమై, చెప్పనిదే భారమై వున్నట్లనిపిస్తుంది కూడాను. అయినా ప్రయత్నమే మన పని !

ఇంతకూ "What the essay is has never been precisely determined. In general it is a Composition, usually in prose of moderate length and on a restricted topic" అన్నారు Joseph T. Shipley ఇదే మాట తెలుగు వ్యాస విషయానికీ వర్తిస్తుంది. వ్యాసవచనంలోని వస్తు విషయాన్ని నిర్దేశించడానికి అవధులూ ఆంక్షలూ లేవు, అది ఏదైనా కావచ్చు గానీ ఏకాంశప్రతిపాదకమై అకృతిలో లఘువుగామాత్రం వుండాలి అలాగే వ్యాస పరమార్థానికీ నిర్దిష్టమైన ఒక లక్ష్యమంటూ లేదు. ప్రదర్శన విధికే అందులో ప్రాముఖ్యం.

ఎస్సే ఒక వచన కళాఖండం

ఇంతకూ Saintsbury అన్నట్లు ఒక వచన కళాఖండం (work of prose art) అనదగిన వ్యాసం అంటే ఏమిటో అన్వయముఖాన వివరించేకన్నా అది ఏది కాదో వ్యతిరేకముఖాన భావించడమే తేలికేమో ! ఎస్సే అంటే కేవలం "ఉద్దిష్ట విషయోద్ఘాటనమో, ఉపదేశసారమో సమాచారనిక్షేపమో, విశృంఖల వాగ్వ్యవహారమో తర్కసంగ్రహమో, నవ్వులాటో, కథాకథన కాలక్షేపమో, మాత్రమే కాదు" అంటాడాయన పైగా వ్యాస విషయం ఫలానా మాత్రమే ఉండాలన్న నియమం లేదు "పనికిమాలింది, అసంగతమైనది, నిస్సారమైనది గంభీరమైనది, తీవ్రమైనది, విషాదకరమైనది ఏదైనా కావచ్చు", అంతేకాదు- "చిట్టెలుక, సీమసుద్ద, గుడ్లగూబ, శాస్త్రం, రాజకీయం, సామాజికం," అన్నీ కూడా వ్యాస విషయాలు కావచ్చునంటాడాయన. ఇంతకూ వస్తువుకాదు వ్యాసాన్ని "వ్యాసం"గా ఆవిష్కరించేది "వ్యాసావిష్కారం అన్నది వ్యాసకర్త ఆ వస్తువును పరిష్కరించే విధానం మీద ఆధారపడి వుంటుంది" అన్నారు శ్రీ వ్రజాధీశ ప్రసాద్.

కొన్ని నిర్వచనాలు

A. C. Benson మాటల్లో "వ్యాసమన్నది ఒక చింతనం, ఒకానొక మానసిక స్థితిలో రచయిత తనకు తానుగా తనలో తాను వ్యక్తం చేసుకొనే వాగ్వైఖరి". "స్నేహ పరిచయాలతో చుట్టుముట్టేట్లుగా పాఠకుణ్ణి ఆకట్టుకొని ఆశ్లేషించి పరవశింపజేసేది వ్యాసం" అన్నది. వర్జీనియా ఉల్ఫ్. బెన్సన్ దృష్టిలో వచనకారుని స్వేచ్ఛను, వాగ్గేయకారుని గీతరచనల్లోని నిర్మాణ కౌశలాన్ని పొదువుకొన్న రచన వ్యాసము. ఆత్మాభివ్యక్తిగల ఆత్మాశ్రయ సాహిత్య విభాగానికి చెందిన వ్యాసము ప్రముఖంగా వైయక్తికమైనదన్నాడు హడ్సన్. వ్యాసకర్త మనోధర్మం, శీలం, వ్యాసశైలిలోను వ్యాస విషయంలోను ప్రతిస్పందిస్తూ వుంటుంది. వస్తునివేదన ప్రధానమైన సిద్ధాంత లక్షణ గ్రంథరచన వంటిదికాదు అసలుసిసలైన వ్యాసం. అది ఆత్మనివేదకమైన ఒక స్వతంత్రకళాకృతి. వ్యాసం విరివిచెంది, సమగ్రతను కూర్చుకొని అది సిద్ధాంత లక్షణగ్రంథం కాబోదు. అలాగే సిద్ధాంత లక్షణ గ్రంథాన్ని క్లుప్తీకరించినంత మాత్రాన అది వ్యాసమూ కాదు. చింతనమూ, వికీర్ణమైన నిశితాత్మాన్వేషణాల అభివ్యక్తి (dispersed meditations) గలది, విషయనివేదనంలో అవిశాలత్వం, అసంపూర్ణత్వం, అనే పరిమితులు స్వేచ్ఛతో కూర్చుకొన్న కొదవలు (want of finish) ఉన్నదీ అయిన వ్యాసం ఒక స్వతంత్ర కళారూపం కావడమే అందుకు కారణం. వ్యాసం సంగ్రహంగా వుంటూనే వస్తు పరిపూర్ణత భాసించక పోయినా సమగ్రావగాహన కలిగించే ఒక నిండుదనం కలిగి వుంటుంది. వ్యాసకర్త రచనా విషయం మీద సంపూర్ణఅధికారి అయినప్పుడే అలాంటి వ్యాసం రూపొందడానికవకాశముంటుంది. ఆధునిక వ్యాసం తర్కసహమైన ఆలోచనకు, నిర్మాణ సౌష్ఠవానికి, సృజన కళాతత్త్వానికి, పేరెన్నికగన్నది. కష్ట సాధ్యము ఆనందదాయకము అయిన ఇలాంటి సాహిత్యాభివ్యక్తియే వ్యాసమని సేంబొవె (Saint Beuve) పేర్కొన్నారు. అయినా పత్రికా ముఖాన బహుళంగా వ్యాపిగాంచుతున్న అనేక తరహాల వ్యాసాలను గూర్చి వ్రాస్తూ "The essay is the most popular mode of writing because it suits the writer who has neither talent nor inclination to pursue his enquiries further and......the generality of readers who are amused with variety and superficiality" అన్నారు Crabbe. ఈ చమత్కార నిర్వచనానికి గురిఅయ్యే వ్యాసాలు ప్రపంచ

వాఙ్మయంలో కోకొల్లలు లేకపోలేదు. కాని వాస్తవానికి వ్యాసగ్రథనం కూసువిద్య ఏమీ కాదు. సేంబోవె అన్నట్లు వ్యాసరచన కష్టసాధ్యము, ఆనందదాయకము అయిన సాహిత్యాభివ్యక్తి కలది. చేయి తిరిగిన రచయితకే అది సాధ్యం. అందులో రచయితకు విషయాన్ని కుదించి పొందికగా చెప్పగలిగే శక్తి వుండాలి. అల్పాక్షర సముదాయంలో అనల్పార్థయుక్తి వుండాలి. వ్యాసం ఆకృతిలో వామనమైనంత మాత్రాన రచనలో లాఘవం ఉండవలసిన అవసరంలేదు. వ్యాసంలో చొప్పించిన విషయం, విషయ నివేదనంలో అనుసరించిన విధానం వ్యాస పరిమితికి లోబడి వుండాలి. "Essay should not attempt too much"-వ్యాసంలో ఎన్ను కొన్న అంశాల పొందిక, వాటి నిర్వాహం స్వయం సమగ్రమైనట్లు నప్పి పాఠకుణ్ణి ఒప్పించే రీతిలో వుండాలి.

ఆత్మికమైన సాహిత్యశాఖకు చెందిన వ్యాసం (work of prose art) వచనకళా కావ్య మనదగి, గేయకారుని కౌశలము, వాక్య వచనకారుని స్వేచ్ఛ, పొదువుకొన్న రచన అనిపించుకొన్నా రచనా మాధ్యాన్ని బట్టి అది ప్రముఖంగా గద్య వాఙ్మయశాఖకు చెందినదే.

### వ్యాసం ఆలోచనాత్మక గద్యరచనారీతి

గద్య వాఙ్మయాన్ని పాశ్చాత్య సాహిత్య విమర్శకులు ఐదు రీతులుగా పరిగణించారు. కథనాత్మకము, తార్కికము సంభాషణాత్మకము, విషయ వివరణాత్మకము ఆలోచనాత్మకము అనే ఈ అయిదురీతుల్లో ఆలోచనాత్మక గద్య శాఖకు చెందినదే ఆధునిక వ్యాసమని వారి తీర్మానము. ఆంగ్లవ్యాసం పలుతీరులుగా పరిణమించి అర్వాచీన కాలంలో ఒక వచనకళాఖండంగా రూపొందింది. క్రమంగా వ్యాసంలోని విషయంకన్నా విలువలకన్నా ప్రతిపాదన విధానానికి ప్రాముఖ్యం హెచ్చింది. కళాత్మకసృజనాత్మక దృష్టిప్రబలింది. శైలీసౌకుమార్యం అలవడింది వ్యాసానికి.

### వచనశైలికి వ్యాసం నెలవు

అందుకే అసలుసిసలైన ఆధునిక వచన శైలిని తెలుసుకోవాలంటే వ్యాస పరిశీలనమవసరమన్న భావం ఏర్పడింది. "Essays are particularly

valuable reading for the person who wishes to aequire a knowledge of prose style since essays depend mueh more on their style than any other form of literature" అన్నారు మిస్ మేర్జరీ బూల్టన్ తమ The Anatomy of Prose అనే గ్రంథంలో.

ఎప్పుడో ఎక్కడో సన్నగా ఆరంభించే జీవస్రవంతిలాగానే వ్యాసారంభమూ గోచరించినా కాలగతిలో సుసంపన్నమై సాగరసంగమ వేళ పాయలై పరచుకొని పరవళ్లు త్రొక్కే మహానదిలా వ్యాసమూ వాఙ్మయరంగాన బహుముఖాల విస్తరించింది. పాశ్చాత్యుల వ్యాసరేఖలు సిసిరో సెనెకాల రచనల్లోనే పొడసూపినాయంటారు తద్‌జ్ఞులు. వారి Epistles అనబడే లేఖావళిలోని (dispersed meditations) చింతనం అనంతర కాలపు వ్యాసధర్మం కావడం చేత తరువాత కాలపు పరిభాషలో ఆ ఎపిసెల్స్ నీ essays అనుకోవచ్చునన్నారు విమర్శకులు. అలాగే plutarclıs, Moralia కూడా అదే వర్గానికి చెందిన నైతిక విషయ వ్యాసావళిగా పరిగణించారు. ప్లేటోడైలాగులు, థియోఫ్రాస్టస్ కేరక్టర్స్ ప్లినీ సెనెకాల ఎపిసెల్సు, ప్లూటార్క్ మోరల్సు, సిసిరో డిస్ప్యుటేషన్సు, మార్కస్ ఆరీలియస్ మెడిటేషన్సు, అరిస్టోటల్ ట్రిటైసులు,.... మొదలైనవన్నీ కూడా వ్యాసాలుగానే పరిగణింపబడినవి.

## పాశ్చాత్య వ్యాసానికి మాంటేన్ పితృతుల్యుడు

అయినా ఒక నిశ్చితమైన కళాకృతిగా నెలకొన్న సన్నిహితమైన వైయక్తిక వ్యాసా విర్భావానికి Montaigne పితృతుల్యుడనీ 16వ శతాబ్ది ఫ్రాంసు దేశం దాని జన్మభూమి అని విజ్ఞులంటారు. సూక్తులతో కథలుగాథలుగా అల్లిన రచనల్లోని హృదయ స్పందన ఆత్మికం కావడంవలన "I am myself the subjuct of my book" అనుకొన్నాడాయన. మాంటేన్ ఆత్మవిచారం ఉన్న ఆరచనల్లో attempt=ప్రయత్నము, trial అనే అర్థాన్నిచ్చే Essais అనే పదాన్ని కూడా తొలుత ఆయనే ప్రయోగించాడంటారు. అదే తర్వాతి కాలపు ఆంగ్ల రచయితల మూలాన రూఢికెక్కిన essay అనే పదానికి మూలమైంది. అందుకే ప్రపంచ వాఙ్మయంలో మాంటేన్‌ని Father of the personal subjective essay అంటారు.

### ఆంగ్ల వ్యాసానికి బేకన్ విషయ దృష్టినలవరిచాడు

ఆ తర్వాత 16వ శతాబ్ది చివరిభాగంలో బేకన్ మహాశయుడు "Essay" అనబడిన ఈ వ్యాసరచనా ప్రక్రియను ఆంగ్లభాషలోనికి అవతరింపజేశాడు. ఒక్క-నివిజ్ఞానాన్ని పొందికతో సంగ్రహంగా ప్రస్తరించడంలో బేకన్ మొనగాడు. ఆత్మాశ్రయ మూలమైన మాంటేన్ వ్యాససృష్టికి బేకన్ objective impersonal turn ఇచ్చి విషయ ప్రాధాన్య దృష్టి నలవరిచాడు. ఆ తర్వాత ఆంగ్ల వ్యాసం ఎందరి చేతుల్లోనో ఎన్నో పోకడలు పోయింది.

### వ్యాసప్రక్రియా విశ్లేషణము

ఆ పోకడలను బట్టి ఆంగ్ల వ్యాసాన్ని విమర్శకులు 1, Aphoristic essays అనీ; 2. Character essays అనీ, 3. Critical essays అనీ; 4. Periodical and Social essays. అనీ; 5. Reviews అనీ ఐదారు రీతుల్లో వింగడించి చూపారు. విషయికన్నా విషయ ప్రాధాన్యము, ఉపదేశంకన్నా వినోదం పాలు, అధికంగా గల బెకోనియన్ వ్యాసాలు మొదటిరీతి aphoristic వ్యాసాలు కాగా; హాల్,ఓవర్‌బరీ మొదలైన వారి లేఖినిలో రూపొందిన స్వభావపాత్ర చిత్రణ ప్రాధాన్యంగల వ్యాసాలు రెండో రీతి character essays. ఇకడ్రైడెన్ తొలిపలుకుల్లో (prefaces) రూపుదిద్దు కొన్న రీతిగల critical essays మూడోవి. పత్రికావ్యాసంగం పెరిగిన తర్వాత సామాజిక ప్రయోజన దృష్టితో Richard, Steele, Joseph Addison సాధించిన Spectator వ్యాసాలు తరువాతి periodical and social essays అనిపించుకొన్నవి. అలాగే పత్రికాముఖాన వెలువడినా సామాజిక వైయక్తిక విషయాల జోలికిపోక సాహిత్యానికి విమర్శకుసంబంధించిన సమీక్షాత్మక వ్యాసాలు Reviews అనబడే మరొక రీతికి చెందినవి.

### భావరచనా వైఖరులను బట్టి వ్యాసం ప్రధానంగా రెండురకాలు

ఇలా వ్యాసప్రక్రియను వారిన్ని రీతుల వింగడించుకొన్నా వాటినన్నిటినీ తిరిగి రచనా వైఖరిని బట్టి ప్రధానంగా 1. Essays par excellence-విశిష్ట

వ్యాసరాజాలు; 2. Compositions-కల్పిత వ్యాసకాలు అన్న రెండు వర్గాలుగా భావించినవా రున్నారు. అలాగే భావవైఖరిని బట్టి 1. Intellectual and expository బౌద్ధికములు - వ్యాఖ్యా ప్రాయములు 2. Intuitive and personal మనోధర్మ ప్రధానములు, వైయక్తికములు అనే రెండు తరగతులుగా భావించినవారూ ఉన్నారు. ఇలాగే రచనా విధిని బట్టి 1. Formal సువిధి పూర్వకాలు, 2. Informal అవిధి పూర్వకాలు అనేరెండు భేదాలుగానూ వ్యాసాలను స్థూలంగా విశ్లేషించి పరిశీలించిన విమర్శకులు కూడా వున్నారు.

ఆంగ్లభాషలోని వచనరచనా పరిణామగతిలో Epistle, treatise, dissertation, thesis, paper, preface, article, sketech, brief, episode, penpicture, portrait, satire, review మొదలైన పేర్లో కాలాంతరంలో ఎస్సేకి సన్నిహితంగా సాగి పర్యాయనామాలుగా గుర్తింపబడి క్రమంగా రచనా వైవిధ్యాన్ని బట్టి ప్రత్యేకతను గడించుకొని రూఢికెక్కినవి వున్నవి. అలాగే ఎస్సే అనే పదంతో భేదకత్వంగల కాంపొజిషన్ అనే మాట కూడా వుంది. వీటన్నిటికి తెలుగులో విస్పష్టార్థాలను సూచించే అనూదిత పర్యాయాలు పేర్కొనడం కష్టమే. ఉదాహరణకు C. P. Brown Composition అంటే రచన, కవనము అనీ; treatise = a written composition, చిన్నపుస్తకము, ప్రబంధము, శాస్త్రగ్రంథముఅనీ; Dissertation=వివరణము, వ్యాఖ్యానము, ప్రసంగము అనీ; Paper=ఒక చిన్న గ్రంథము; Article= ఒడంబడిక, నిబంధన, సిద్ధాంతము, ప్రకరణము అనీ; Essay=యత్నము ప్రయత్నము, హితోపదేశము. వివరణము అనీ వివరించే యత్నం చేశాడు. వీటికి వేటికి విస్పష్టార్థాలనిచ్చే తెలుగు పదాల వేర్పాటులేదు. It is a treatise on grammer; He published his thesis; I submitted a dissertation; He communicated an article to the magazine; My paper is accepted for publication in the Science journal; That is a wonderful essay; I corrected the pupils' composition; There appeared a sketch on current political affairs; Indian Express carried a story on Fair fax; వంటి ప్రయోగాల లోని రచనారీతు లెన్ని చెప్పవలసి వచ్చినా వ్యాసనామానికే ఏవేవో పదాలను

అనుసంధించి సిద్ధాంతవ్యాసమనీ, వివరణవ్యాసమనీ, శాస్త్రవ్యాసమనీ, స్కూలు పిల్లల వ్యాసమనీ ఇలాగే రకరకాలుగా వాడుకొంటున్నాము. ఆంగ్ల సాహిత్య విమర్శకులు Essay కి Composition కి రచనా నిర్మాణంలోగల తారతమ్యా లెట్టివో విశ్లేషించి చూపారు. మన మింకా అట్టి రూపభేదాలకు నామకరణం చేసుకోవలసిన స్థితిలోనే వున్నాము. కారణం ఆంగ్లవ్యాసం పుట్టి ౬00 ఏండ్లు పండిన ప్రౌఢిని సంతరించుకోగా అర్వాచీన తెలుగు వ్యాసానికి నూటయాభై ఏళ్ళ కౌమారమైనా వచ్చిందో లేదో మరి! వాస్తవానికి తెలుగువ్యాసం నామరూప స్వభావాలు ఇప్పుడిప్పుడే వ్యక్తదశలోకి వస్తున్నవనవచ్చు. అది ఒకటి రెండు శతాబ్దుల వెనుకనే ఆంగ్లసాహిత్యంలో ప్రౌఢ పరిణత దశ నందుకొన్నది. అందుకే అట్టి విశ్లేషణం నామకరణం వారి విమర్శవాఙ్మయంలో సాధ్యపడినవని భావించ వచ్చును.

ఎస్సే - కాంపోజిషన్

సౌలభ్యం కోసం ఇందులో Essay ? వ్యాసమనీ Compositionను వ్యాసకమనీ వ్యవహరిస్తున్నాను. వ్యాసానికీ వ్యాసకానికీ గల నాలుగైదు భేద సాదృశ్యాలను ప్రజాధీశ ప్రసాద్ ఇలా వివరించారు. 1. రెండూ ఆకృతిలో వామ నము లే. ౨. ఏదో ఒక విజ్ఞాన శాఖకు చెందిన ఒకానొక విషయంలోని ఏకాం శాన్ని రేఖా మాత్రంగా చిత్రించే స్వభావం చేత రెండూ అసంపూర్ణంగా వున్నట్లే తోస్తుంటాయి. ౩. అయినా వ్యాసం పెంపుకుదింపులకు లోబడని ఒక ప్రత్యేక సాహిత్య కళాఖండంగా భాసించి అసంపూర్ణ పరిధిలోనే సంపూర్ణ కళాకృతిని తోప చేస్తూ వుంటుంది. వ్యాసకం అలాకాక అసంపూర్ణ పరిధిని విస్తరింప జేస్తే పెరిగి ఒక పుస్తకమో సిద్ధాంత గ్రంథమో కాదగి వుంటుంది. ఇదే ఆరెంటి నడుమా గల ముఖ్యమైన భేదం. 4. వ్యాసం ఆత్మాశ్రమ ధర్మ ప్రతిపాదకం కాగా వ్యాస కం వస్తు ధర్మ ప్రతిపాదక మవుతుంది. ౬. వ్యాసంలో వ్యక్తిత్వపు స్పర్శ వుంటే వ్యాసకంలో అది లేకుండా వస్తు తత్త్వ ప్రతిపాదనం మాత్రమే వుంటుంది. కళా కృతిగా భాసించే వ్యాసాన్ని మనం విషయ దృష్టితో కాక ప్రతిపాద్య విషయం ఎట్టిదైనా, మనకు నచ్చినా నచ్చక పోయినా అది ఎంత ఉజ్జ్వలంగా అనాయాసంగా వ్యక్తీకరింపబడిందో చదివి మననం చేసుకొంటూ అభివ్యక్తి రంజన దృష్టితో

సూత్రమే గ్రహిస్తాము. వ్యాసకాన్ని అలాకాక విషయం కోసం మాత్రమే దాన్ని చదివి జీర్ణించుకొని అందులోని వైఖరిని విస్మరిస్తాము. అయితే విషయాన్ని బొత్తిగా విడిచిన వ్యాసమూ వుండదు; వ్యాసకానికి రచనా రామణీయకం నిషిద్ధమూకాదు. ఇందులో ఏది ప్రబలమైతే అది రెండో అంశాన్ని కప్పివేస్తూ వుంటుంది. వ్యాసాలూ వ్యాసకాలూ స్వతంత్ర ప్రతిపత్తితో నిలబడే తీరుగల ప్రముఖుల రచనలున్నట్లే లోకంలో వ్యాసకాలుగా జారిపోయిన వ్యాస ప్రయత్నాలూ, వ్యాసాలుగా నిలిచి రాణించే వ్యాసకాలూ బోలెడున్నాయనడం వాటిని తారతమ్య దృష్టితో చదివే పాఠకులకు పునరుక్తే.

## వ్యాస వైలక్షణ్యం దాని వైఖరిలో ఉంటుంది

ఇంతకూ వ్యాస వైలక్షణ్యం దాని వైఖరిలో వుంటుంది. రచయిత యొక్క వ్యక్తిత్వం, స్వభావం, భావ వికాసం, విషయపరణం, ప్రారంభం, నిర్వాహణ, పరిష్కారం, మొత్తంమీద వ్యక్తీకరణంలో బలవంతంగాకాక సహజాతి సహజంగా దొర్లుకుపోయే తర్కసహమైన అభివ్యక్తి. వాక్చిత్రాలను కూర్చే రమ్యమైన పలుకుబడి అన్నీ సుశ్లిష్ట సంధిబంధంగా వుండడమే వ్యాసంలోని జీవలక్షణం. ఈ లక్షణాలతో విరాజిల్లబట్టే బేకన్ వ్యాసాలు, డ్రైడెన్ తొలిపలుకులు, బర్క్ రిఫ్లెక్షన్లు, మెకాలే సువిధి పూర్వక రచనలు, ఫ్రాండేస్ షార్ట్‌స్టడీసు, వ్యాస ప్రపంచంలో చిరకీర్తి నార్జించుకొన్నాయి. వాటిల్లోని ప్రయోజనం, పాండిత్యం వాదపటిమ, శైలి, సున్నితమైన చమత్కారం, వ్యక్తిత్వం వాటిని వ్యాస రాజాలుగా తీర్చిదిద్దినాయనడంలో సందేహంలేదు.

ప్రపంచ వాఙ్మయంలో వ్యాసం దినదినాభివృద్ధి చెందుతున్నది. ఉత్తమోత్తమ కళాకృతిగా పరిణమిస్తూ బహుళప్రచారం పొందుతున్నది. సాహిత్య విమర్శకులు వ్యాసవిషయమై వ్రాస్తూ 'Modern tendency is towards greater elaboration and formality' అన్నారు. ఆధునిక వ్యాస వికాసానికి విస్తృతికి పత్రికలెంతో దోహదం చేస్తున్నవి.

**పత్రిక దాది వ్యాసం దాని చేతిబిడ్డ**

అందుకే "పత్రిక దాది-వ్యాసం దాని చేతి బిడ్డ" అన్నారు విమర్శకులొకరు. పత్రికలు రచయితకు రచనారంగాన్ని కూర్చి అందుకోసం పాఠికో పరకో వ్యయించవలసి వచ్చినా, వలసిన పాఠకలోకాన్ని సమకూర్చి, వ్యాస విస్తృతికి, వృద్ధికి, ప్రత్యక్షంగా దోహదం చేసినట్లే పరోక్షంగా కొంత వ్యాస ప్రక్రియాచ్యుతికి, వ్యాసం పల్చబడడానికి, కూడా కారణభూతా లవుతున్నాయన్న విమర్శలోనూ సత్యం లేకపోలేదు. దీనికి కారణం పత్రికల సంఖ్యా, వేగంతో కూడుకొన్న వాటి పునరావృత్తీను. అంతర ప్రేరణవల్ల కాకుండా పత్రికల ప్రోద్బలం వలన వ్రాయడం, వ్రాయగల రచయితలే తరచు వ్రాయవలసిరావడం సుదూరతీరాలలోని తీరు తీరుల పాఠకుల్ని భావించి మరీ వ్రాయవలసిరావడం, ఒరుగుతూ సహజంగానే రచనల్లో కొంత సహజత లోపిస్తున్నది; దీనికి తోడుగా మారుపేర్లతోనూ, ఒక్కొక్క పత్రిక కొకొక్క తీరుగానూ, వ్రాయవలసి రావడంతో మరి కొంత కృత్రిమత పెరగడం వంటి చెట్టలు ప్రోగై వ్యాసంలో సజీవంగా తొణికిసలాడవలసిన వ్యక్తిత్వం దెబ్బతింటున్నది కూడాను. పత్రికల్లోనూ, రాజకీయ పరిపాలనా రంగాల్లోనూ పరిపాటిఅయిపోయిన professional ghost writing కూడా ఈ విమర్శను తప్పించుకోలేక పోతున్నది. విసువి గొల్పకుండా అనునిత్యం విరివిగా వ్రాయనేర్చి ప్రపంచ ప్రఖ్యాతి వహించిన వు Art Buchwald వంటి కొద్దిమందికో తప్ప తక్కిన సన్న జీవాల విషయంలో ఈ దుస్థితి తప్పడంలేదు.

**ఇంతకూ వ్యాసమితి నెన్నడం కష్టం**

ఇంతా చెప్పిన తర్వాత వ్యాసాన్ని నిర్వచించడం ఎంత కష్టసాధ్యమో వ్యాసమితినెన్ని, వ్యాసం సరిహద్దుల్ని గుర్తించడం, వ్యాసం లోతుపాతుల్ని పర్గణించడం కూడా అంతే కష్టమని చెప్పుకోవలసి వున్నది. అందుకే Joseph T. Shipley తన Dictionary of World Literary Terms లో దొడ్డదైన ఈ వ్యాసరేఖలోని అవధుల్ని అంతస్థ బిందువుల్ని భావించి అడ్డంగా గీసిన ఒక రేఖాపటం సహాయంతో వ్యాసాన్ని విశదీకరించే యత్నం చేశారు. దానికే మరికొంత జోడించి దాని నిలువు అంతరువులను కూడా సంభావించి ఈ వివరణ మిస్తున్నాను.

**వ్యాసప్రక్రియ ఒక బిందువు కాదు**
**ఆదొక రేఖ-అదే వ్యాసరేఖ** (చూ.పు. 62, 63)

AB అనే వ్యాసరేఖను కేంద్రం C వద్ద రెండు సమభాగాలు చేస్తే AC, CB లు క్రమంగా సమంగా సువిధిపూర్వక (formal) రచనలను, అవిధి పూర్వక (informal) రచనలను సూచిస్తాయి. అలాగే AC విభాగం విషయగత (objective) భావనకు, బౌద్ధికమైన ఆసక్తి (intellectual interest) కి నెలవు కాగా; CB విభాగం విషయిగత (subjective) భావనకు, కాల్పనిక అనుభూతి (interest in imaginative experience) కి నెలవవుతుంది. వీటిలో C కేంద్రం సువిధికి, అవిధికి; విషయ విషయి భావనలకు; బౌద్ధిక కాల్పనిక భావనలకు; విస్పష్ట భేదక స్థానంకాక, స్థిత్యంతరసూచక బిందువు (Transitional Juncture) మాత్రమే కావడం మూలాన C కి కొంచెం అటూ ఇటూగా D E అనే మరి రెండు స్థానాలను భావించి D C E విభాగాన్ని వ్యాస రేఖలోని స్థిత్యంతరసీమగా, పరివర్తన మితిగా, గుర్తించవచ్చును. అందులో D E ల నడుమ ఎక్కడో ఒక చోట రచయిత అభినివేశాన్ని బట్టి నిలిచేదే అసలు సిసలైన వ్యాసం అవుతుంది. అదే, వ్యాసరేఖలోని నిర్దేశసూచి గనుక A కొస వైపునకు జరిగితే పరిశోధన సిద్ధాంత గ్రంథం అవతరిస్తుంది. Treatise monograph ల వంటి నిబంధాలన్నీ దానికి సన్నిహితాలైనవే. అలా కుడివైపు నకు సాగుతూ A D ల నడుమ నిలిచేవే జీవిత చరిత్రాత్మక (Biogrophical) చారిత్రాత్మక (Historical); శాస్త్రీయ (Scientific); వివరణాత్మక (Expository); విమర్శాత్మక (Critical) రచనలన్నీ. ఇక ఆ వలపలగతిలో D C E నడుమ నిలిచే రచనలు-సమాచార పత్రికా రచనలు (News stories) సంపాదకీయాలు (Editorials); గ్రంథ సమీక్షలు (Reviews); పత్రరచనలు (Articles); వ్యాసాలు (Essays); వ్యాసకాలు (Compositions) మొదలైన రచనా వ్యవహారముంటుంది. వీటిల్లో సుశ్లిష్ట సంధిబంధమైన వ్యాసరాజం కేంద్ర స్థానం ఆక్రమించడం వలన ఈ గద్య రచనా ప్రక్రియను సూచించే రేఖను వ్యాసరేఖ అనడం జరిగింది. ఈ వ్యాసరేఖ కుడి చివరన EB ల నడుమ నిలిచే రచనశీలలు చిత్రణలు (Character sketches); ఆత్మాశ్రయరచనలు (impressinistic sketches); వైయక్తిక వినోదాత్మక రచనలు (personal playful sketches); వాక్చిత్రాలు (pen portraits); మొదలైనవి. ఈ

వ్యాస వృత్తము

స్థిత్యంతర సూచక బిందువు

వ్యాసరేఖ

# EXTENDED ESSAY LINE

**CompositionsEssays Par Excellance**

Transitional Zone -- Authentic Essay

| A | D | స్థిత్యంత C ర సీమ | E | B |
|---|---|---|---|---|
| Formal సువిధి పూర్వకము | | | | అవిధి పూర్వకము Informal |
| Objective విషయ ప్రధానము | | | | విషయ ప్రధానము Subjective |
| Intellectual బౌద్ధికము | | | | సద్యఃస్ఫురణాత్మకము Intuitive |
| Expository వివరణాత్మకము | | | | వైయక్తికము Personal |
| Factual వాస్తవికము | | | | కాల్పనికము Imaginative |
| Thesis సిద్ధాంతగ్రంథము | | | Aphoristic విషయ ప్రధాన చమత్కార | |
| Treatise లఘు వివరణగ్రంథము | | | Critical విమర్శాత్మక | |
| Monograph ఏకాంశ ప్రతిపాదక పత్రము | Editorial - సంపాదకీయ - | | Character శీల చిత్రణ | |
| | | | Familiar ఆత్మీయ | |
| Composition వ్యాసకము | | | Didactic నీతిదాయక | |
| Scientific శాస్త్రీయ | Book Review - | | Satirical అధిక్షేపాత్మక | Impressionistic |
| Philosophic తాత్త్విక | గ్రంథ సమీక్షాత్మక | | Imaginative కాల్పనిక | Features |

Factual Historical - వాస్తవ చారిత్రాత్మక
Factualbiographical - వాస్తవ జీవిత చరిత్రాత్మక
Expository వివరణాత్మక
Formal Political - సువిధి పూర్వకరాజకీయ
Analysis విశ్లేషణాత్మక
Excoriations ఖండనాత్మక
Eulogistic మండనాత్మక
Prophecies భవిష్యత్సూచక
Programs ప్రణాళికా
Interpretative భావవిశ్లేషణాత్మక
Semi Technical పాక్షికసాంకేతిక

Artical పత్రము
Periodical పత్రికా
Social సామాజిక
Narrative - కథనాత్మక
Descriptive - వర్ణణాత్మక

Literary Historical సాహిత్యాత్మక చారిత్రక
Literary Biographical - సాహిత్యాత్మక జీవిత చరిత్రాత్మక
Persuassive ప్రబోధాత్మక
Reflective చింతన ప్రధాన
Emotonal ఉత్తేజాత్మక
Pen Portraits వాక్చిత్ర రూప

ఆత్మాశ్రయరచనలు
Personal Playful Sketches
వైయుక్తిక వినోదాత్మక రేఖా చిత్రాలు

వ్యాసరేఖలో ఇటూ అటూ కొసలలో నిలిచే రచనలను మినహాయిస్తే నడుమ నిలిచే రచనా వ్యాసంగాన్నే సాహిత్య విమర్శకులు వ్యాసనామంతో వ్యవహరిస్తున్నారు. [వ్యాసరేఖను సూచించే వ్యాసరేఖా చిత్రపటంమీది మీది విషయాన్ని వివరిస్తుంది]

**తెలుగు వ్యాస వికాస సమీక్ష**

వ్యాసాన్ని గూర్చిన ఈ పూర్వరంగంతో తెలుగు వ్యాసాన్ని, వ్యాస వికాసాన్ని మనమిప్పుడు సమీక్షించుకోవచ్చును. ప్రాతదైన వ్యాసవస్తువును, అనగా ఎస్సేను, పాశ్చాత్య విమర్శకులు ప్లేటో డైలాగుస్‌లోను, థియోఫ్రాస్టస్ కేరక్టర్సులోను, ప్లినీసెనెకాల ఎపిసెల్సులోను, ప్లూటార్క్ మోరల్సులోను, అరిస్టోటిల్ ట్రిటైసుల్లోను పరిణామగతిలో పరిగణించినట్లే భారతీయ వాఙ్మయం తోనూ ప్రాచీనమైన వ్యాసవస్తువును మనం పసిగట్టవచ్చును. ఉపనిషద్వీథిలో విన వచ్చే ఋషుల సంగోష్ఠుల్లోనూ; పురాణ ప్రాతల్లోనూ; కావ్యేతిహాసాల్లో కానవచ్చే సంవాదాల్లోనూ, నీతి బోధల్లోనూ; స్తోత్రశతకకవులచింతనంలోనూ; శాస్త్ర కవుల నిబంధాలలోనూ, వివరణ వ్యాఖ్యా గ్రంథాలలోనూ వ్యాస వస్తువు లేదన లేము. కానీ అవి అన్నీ ప్రాయికంగా ఛందోబద్ధములే; కవి కృతములైన కావ్య రూపములే.

**వ్యాసం గద్య వాఙ్మయశాఖకు చెందినది. వాక్యమయమైనది**

ఎస్సే-వ్యాసమన్నది ప్రధానముగా ఛందోబద్ధము కాని గద్య వాఙ్మయ శాఖకు చెందినది; వచన వైఖరి గలది వాక్యమయమైనది. అయినా వ్యాసం ఒక విధంగా లౌకిక వాక్యావళికి రసవత్కావ్యావళికి మధ్యస్థమైన దనవచ్చును. వాచ్య ప్రధానము, లౌకికము అయిన వాక్యంలోని ఆలోచన (thought), వాచక ప్రధానమై హృద్యతాధర్మం గల అలౌకికమైన కావ్యంలోని కల్పన (imagination); ఏకత్ర జతకూడి ఏ రచనలో బహిర్గతమవుతుందో -ఏ ప్రక్రియా సాఫల్యంలో సామాన్యుడైన మానవుడు కూడా మాన్యుడైన కవిగా వ్యక్తం కాగల్గుతాడో-అట్టిరచన వ్యాసం. ఇలా సామాన్య వాక్యం రసవత్కావ్యమయే దశ లోనే తెలుగులో వచనమూ గద్యమూ రచనారీతులుగా అవతరించాయి.

**గద్య వచన నిర్వచనాలు ప్రభేదాలు**

వచ పరిభాషణే. గద వ్యక్తాయాం వాచి. ఉచ్యత ఇతి వచనమ్. వక్తుం యోగ్యం వాక్యమ్ అని గురుబాల ప్రబోధిక. స్థూలంగా ఇవి అన్నీ ఉక్తి విశేషా

నికి పర్యాయాలుగానే భాసించినా ప్రయోగంలోనూ కవి సంప్రదాయంలోనూ వీటిలో అంతరాలేర్పడినవి. వాక్యమే సమాహితపదబంధురమై చూర్ణిగాను, ఆ చూర్ణియే హృద్యతాధర్మాన్ని కూర్చుకొన్న గద్యంగానూ అవుతాయన్నది జయకీర్తి భావించి చెప్పినమాట. గద్య వచనాలు రెండూ పలుకబడేవి అనే వ్యుత్పత్తి నిచ్చేవే అయినా సంస్కృతకవిసంప్రదాయంలో వచనంకన్నా గద్యం కొంత హృద్యతాధర్మం చేత విశిష్టమై ఒప్పినది. నిడుదవోలు వారన్నట్లు అవి భిన్నార్థకాలయినా కాకపోయినా పర్యాయపదాలుగా సంస్కృత కవి సంప్రదాయంలో వ్యవహృతం కాలేదనడం అసత్యం కాదు.

## గద్యం-చూర్ణి-వచనం

11వ శతాబ్దికి చెందిన సంస్కృతాలంకారికుడు జయకీర్తి పేర్కొన్న,

"గద్యం హృద్య మపాదోక్తి సమాసపద సంచితమ్
తతోఽన్యత్ చూర్ణిరిత్యుక్తా వచనమ్ వాక్యబంధురమ్"

అనే లక్షణోక్తిని పరిశీలిస్తూ "సమాసపదసంచితమైన అపాదోక్తి గద్యము, అది హృద్యము; గద్యముకంటె వేరయిన వచనముచూర్ణి. అది వాక్య బంధురము" అని వ్రాసి, "హృద్యత గద్యధర్మమనీ అది లేనిది వచనమాత్రము అని జయకీర్తి అభిప్రాయముగా తోచుచున్నది" అని పాటిబండ మాధవశర్మగారు తలపోస్తే వారి ననుసరించి ఆలక్షణోక్తినే ఉదాహరించి నిడుదవోలు వెంకటరావుగారు "పై గద్య వచన నిర్వచనము చాల సుగమముగా సరసముగా నున్నది. హృద్యతయున్నది గద్యము-అదిలేనిది వచనము" అని జయకీర్తి చెప్పినట్లు నిష్కర్ష చేస్తూ "సంస్కృతమున గద్యము వచనము భిన్నార్థకములు" అని నిర్ధారణ చేసి వ్రాశారు. సంస్కృతకవి సంప్రదాయంలో నిడదవోలు వారన్నట్లు అవి విభిన్నార్థకాలయినా కాకపోయినా తెలుగులో వలె పర్యాయపదాలుగా వ్యవహృతం కాలేదనడం మాత్రం అసత్యంకాదు. జయకీర్తి ఆలక్షణ నిర్వచనంలో గద్యాన్నీ చూర్ణిక అనబడే వచనాన్నీ చెప్పినాడంతే. అయినా మాధవశర్మగా రూహించినట్లు వచనము-చూర్ణి-గద్యము క్రమశః హృద్యతాధర్మం ఉత్తరోత్తరాధిక్యంతో ఒప్పే రచనారీతు లనడం సబబు. సంస్కృతరూపకాలలో సంభాషణల్లోని సన్నివేశోద్భవమైన వాగ్విశేషాన్నే వచనంగా పేర్కొన్నట్లు తెలుస్తుంది. "నాస్తివాచా ప్రతి

వచనమ్" "అమ్ తత్రోర్వ్యాఖ్యావచనం ప్రమాదస్ఖలితమాసీత్"; "కథమసౌ దృత్యమద్వచనం కాన్తాభిముఖం ప్రస్థితః"; "తాత ! గురోర్వచనమనుతిష్ఠ"; ఇలాంటి తావుల్లో 'వచ'నాన్ని "వాక్యమ్" అనే వ్యాఖ్యాతలు వివరించారు. ఇలాంటి లౌకిక వాక్యమే-వచనమే-సంస్కృత కావ్యాలలో హృద్యతనుకూర్చుకొని గద్యంగా పరిణమించింది. అదే తెలుగుకృతులలో గద్యానికి పర్యాయంగా నిలిచింది.

"కనుగొన పాదరహితమై
పనుపడి హరిగద్దెవోలె బహుముఖరచనం
బునమెఱయు గద్యమది దాఁ
దెనుఁగు కృతుల వచన మనఁగ దీపించుగడున్"

గురుబాల ప్రబోధిక వివరణాన్ని బట్టి కవి యొక్క కృతిలో కానవచ్చే ఛందోబద్ధమైన వాక్య రచన పద్యమనీ, ఛందోబద్ధం కాని హృద్య వాక్యరచన గద్యమనీ (గద్యపద్యైకవేఃకృతౌ) తెలుస్తున్నది. కాని తెలుగు రచనారీతిలో ఈ విషయమై మరికొంత వింత పరిణామం కానవస్తుంది. మన కవి సంప్రదాయంలో వ్యక్తవాగ్రూపమైన లౌకిక వాక్యంకన్నా భిన్నములైనవే గద్యవచనాది కావ్య రచనా రీతులన్నీను ఇవే గద్య, బిరుదుగద్య, చూర్ణిక, వచనం, విన్నపం అనే గద్య ప్రభేదాలుగా తెలుగు లాక్షణికులచేత పేర్కొనబడినట్టివి. మనవారి దృష్టిలో వచనము, గద్యము కావ్యరచనా రీతులను సూచించే పద్యేతర ప్రక్రియలే అయినా సంస్కృతంలోవలె కాక, పర్యాయ వాచకాలుగా కవి ప్రయోగాలలో రూఢికెక్కినవి. తిక్కనగారు "నిర్వచనం"గా ఉత్తర రామాయణం రాయడం, వీరేశలింగంగారికి "గద్యతిక్కన" బిరుదుండడం పరిశీలిస్తే అందులో మనకు గద్యవచనాల పర్యాయరూపతే భాసిస్తుంది. తెలుగులో గద్యమన్నా వచనమన్నా ఒక్కటేకాని అది కావ్యరూప మందినట్టిది. తెలుగువారి గద్య ప్రభేదాలన్నీ కూడా లౌకికవాక్య సంఘాతంలో లేని హృద్యతా ధర్మం అధికంగానూ ప్రస్ఫుటంగానూగల రచనలే.

### తెలుగు వచనగ్రంథాలు ప్రబంధాలే

తెలుగు వచనరచనలన్నీ అనగా గద్యప్రభేదాలన్నీ కావ్యత్వ సిద్ధిని కూర్చుకొని పద్యకృతులకు దీటుగా నిలిచిన హృద్యరచనలే. తెలుగు కవులు

కొందరు తమ పద్యకృతులను వచనకావ్యములనీ; వచనగ్రంథములను 'ప్రబంధము'లనీ పేర్కొన్నారు కూడాను. ఉత్తర నారసింహపురాణ కర్త తన ప్రబంధాన్ని 'ఆంధ్రభాషాభవ్యంబగు వచనకావ్యంబుగా రచయింప బూనడంలోనూ, అల్లాడి రామచంద్రశాస్త్రి కృతి సిద్ధాంత శిరోమణిని 'ఆంధ్ర వచన ప్రబంధ'మని పేర్కొనడంలోనూ గల రహస్యమిదే. 'బహుముఖరచనంబున మెఱయు గద్యమది దాఁ దెనుఁగుఁ గృతుల వచన మనఁగ దీపించు గడున్'అన్న ఛందోదర్పణకారుని లక్షణం ఈ భావాన్నే విశదం చేస్తున్నది.

**ఆలోచన, హృద్యత, గల గద్య భేదమైన తెలుగు వచనము వాక్యధర్మాన్నీ కావ్యధరాన్నీ కూర్చుకొన్నది**

పద్యకృతుల్నీ 'వచనప్రబంధా' లన్నట్లే మన కవులు తమ వచన ప్రయోగాలను వాక్యగ్రంథములన్న వారూ ఉన్నారు. ఎల్లకర నృసింహకవి తన భారత సావిత్రిని ప్రచురవాక్యములచే రచయించితిని కవిరాజు లౌననగ'అని చెప్పుకొన్నాడు. అలాగే సిద్ధరామకవి 'ప్రభుదేవర వాక్యమనే వాక్యగ్రంథాన్ని కూర్చినాడు. ఈ వాక్యగ్రంథం వచనప్రబంధమే. ద్విపదగ్రంథమే. ఇందుహృద్యతయే కాకుండా ఛందో ధర్మం కూడా ఉన్నది. కవిజనాశ్రయకారుడు 'గద్యం బపాద నికరద్యోతిత నవరసార్థ రచనల నెగడు, ననడంలోనూ తెలుగువారి గద్యప్రభేదాలు అపాద పదసంతాన మనదగిన వాక్యధర్మాన్నీ నవరసార్థరచనారీతిగల కావ్య ధర్మాన్నీ కూర్చుకొన్న రచనలనే భావమే స్ఫురిస్తుంది. నన్నయాదుల వచనములు, గద్యలు కృష్ణమాచార్యాదుల వచనాలు విన్నపాలు, ఎఱ్ఱనాదుల చూర్ణికలు, కవిపోషకుల బిరుదావళులు, సిద్ధాంత శిరోమణివంటి వచనప్రబంధాలు, భారత సావిత్రివంటి వాక్యగ్రంథాలు ఇవన్నీకూడా హృద్యతాధర్మాన్నీ, వాచకప్రాధాన్యంగల ఛందాన్ని అధికాధికంగా కూర్చుకొన్న కావ్య రచనా విశేషాలే. మౌలికమైన లౌకికవాక్య-వచన-సముదాయం గ్రంథస్థమై మనవారి దృష్టిలో వాక్యగ్రంథమవుతున్నది. అదే కొంత కావ్యత్వసిద్ధిని బడసి వచన ప్రబంధమో గద్యప్రబంధమో అనిపించుకొంటున్నది. అదే అక్షరగణ మాత్రా చ్ఛందస్సంఘటితమై కావ్య కళాకౌశలాన్ని మరింతగా కూర్చుకొన్న ప్రబంధమో చంపూకావ్యమో కూడా అవుతున్నది. కవికృతములైన ఈ చంపూప్రబంధాలను

వచన ప్రబంధాలను, వాక్య గ్రంథాలను Essays in the art of Poessy లాటి వనుకొంటే తదితర ప్రబంధాలను Essays par excellence అనుకో వచ్చును.

## బ్రౌన్ పేర్కొన్న "వ్యాసం"

ఈ దృష్టితోనే కావచ్చును. C.P. Brown 1840 లో "Originals of the extracts from Telugu Pocms translated in Essay on Telugu literature" అంటూ కొన్ని ద్విపదకావ్యకథా శకలాలను ముద్రించి నాడు. 1839లో తాను ప్రకటించిన "Essay on the Telugu Language and Literature of the Telugus" అన్న రచనకు పరిశిష్టంగా ఈ గ్రంథ శకలాలనూ ఆయన విడిగా ముద్రించినాడు. ఇక్కడ కొంత వక్తవ్య మున్నది. బ్రౌను దొర, తన, తెలుగు-ఆంగ్ల శబ్దకోశంలో వ్యాసమనే ఆరోపానికి Essay అనే అర్థాన్ని పేర్కొనలేదు. కాని Essay అనే పదానికి వ్యాసమనే అర్థాన్ని ఇవ్వకపోలేదు. అదీ ప్రధాన సంపుటంలో కాక సప్లిమెంటులోనే పేర్కొన్నాడు. అందులో ప్రధానంగా ఆయన భావించిన అర్థము, ఇచ్చిన వివరణము "చిన్న గ్రంథము" అనే దృష్టితోనే. అంటే 1852 కంటే పూర్వం బ్రౌను ప్రభులింగలీల, రంగనాథరామాయణ ద్విపద, హరిశ్చంద్ర ద్విపద మొదలగు గ్రంథాల్లోని కావ్యకథా శకలాలను "చిన్న గ్రంథాలు" గానే "Essays" గానే భావించి, అనంతరం Essay అనే మాటకు చిన్న గ్రంథము అనే అర్థమిచ్చి, సప్లిమెంటులో Essay n s (adj) is Commonly Called in Madras వ్యాసము అని పేర్కొని కూడా తిరిగి Essayist కి "In Madras Commonly Called వ్యాసము వ్రాసేవాడు, గ్రంథకర్త" అనే అర్థాన్నే ఇచ్చాడు. అంటే వ్యాసం అనే పదానికి ఆయన భావించిన అర్థమూ అప్పట్లో అంటే 1839-52ల మధ్య మద్రాసు ప్రాంతంలో ఉన్న అర్థమూ లఘు గ్రంథము, వాక్య గ్రంథము అనే గానీ అర్వాచీన వ్యాస రచనను గూర్చి కాదన్నమాట. దీనినిబట్టి వివివి, విస్తారము, విగ్రహము, విశేషముగా కప్పుకొనుట, విశేషముగా గ్రహించుట, అనేక ప్రకారములుగా నుంచుట మొదలైన వ్యుత్పత్తులు గల 'వ్యాస' పదం ఆయా అర్థ విశేషాలను వెల్లడించే ఎస్సే అనే పదార్థానికి పర్యాయంగా

బ్రౌను శబ్దకోశ నిర్మాణం జరిగిన 1852 నాటికింకా పుట్టి వుండలేదనుకోవచ్చు. అంతేకాదు ఆ పేరుతో ముడిపడిన, ఎస్సేగా ఆంగ్లంలో రూఢి కెక్కిన రచనా విశేషం కూడా తెలుగులో నాటికింకా పుట్టి వుండలేదు. కావ్యగుణంగాకాక ప్రక్రియా పరంగా వ్యాస శబ్దం ఆనాటికి అంటే 1852కి పుట్టి వుండినా అది ఇది వరకు మనమనుకొన్న వాక్య-వచన-గ్రంథాలను సూచించేదేగాని అర్వాచీన వ్యాసరచనా విశేషమైన ఎస్సేను మాత్రం కాదు. తెలుగులో అప్పటికింకా వాక్య గ్రంథమే కానీ వ్యాస రచనా విశేషమింకా రూపుదిద్దుకోనే లేదు కాబట్టి అట్టి నామ కరణం జరిగే అవకాశమే వుందివుండదు. "ఎస్సే అన్నపదానికి వ్యాసమని మద్రాసులో వుంటేవుండవచ్చుకానీ తెనుగు దేశంలో ప్రచారంలేదు. ఒకవేళ ప్రసిద్ధిలో వుంటే సర్వజన సామాన్యంగాలేదు. ఉంటే ప్రసిద్ధి వ్యాసకర్తలకు లభ్యమయి వుండేవి" (తెలుగు వ్యాసపరిణామము కొలకలూరి ఇనాక్ పు. 129 అనీ,

"1852 ప్రాంతముననే మన సారస్వతమున వ్యాసరచనా ప్రక్రియ మొదలిడినట్లు తెలియుచున్నది. కాని యానాటి వ్యాసరచనలు మనకులభించలేదు" [ఆంగ్ల వచన వాఙ్మయము-నిడుదవోలు వెంకటరావు-పు. 153] అనీ. మన పరిశోధకులు వ్రాశారు. అంటే 1852 కి పూర్వం ఎస్సేకి తుల్యమైన వ్యాస నామం లభ్యంకాలేదనీ, వ్యాసనామం పేర్కొనబడినా 'వ్యాస' రచనలు లభ్యం కాలేదనీ అనుకోవలసి వచ్చింది. ఈ తడవులాట ఎస్సే అనే పదాన్ని, బ్రౌను పేర్కొన్నట్లు తెలుగులోని ప్రాచీనమైన వ్యాస వస్తువుతో ముడిపడిన "వ్యాసం" అనే పదాన్ని అర్వాచీనమైన అర్థంలో రూఢి చేసుకోవడంవల్లనే కలిగి వుంటుంది.

ఇంతకూ బ్రౌన్ పేర్కొన్న "వ్యాసం" ఛందోబద్ధమై శబ్దార్థ సహితమైన "కావ్యమో", ప్రాచీనుల "వచన ప్రబంధ"మో, వాచ్యవాచక ప్రాధాన్యంగల "గద్యప్రబంధ"మో, "వాక్యగ్రంథ"మో కాదగునుగానీ అన్యము కాదని ఇప్పటి ఆధారాలనుబట్టి అనుకోవచ్చు. అట్టి రచనలు అంగ్లంలోనూ 18, 19 శతాబ్దులలో వచ్చిన **Essay on criticisms", "Essay on mind"**వంటి ప్రాచీన పద్యమయ రచనలను బోలినవే కావలెను. ఆ అర్థంలోనే అట్టి రచనలనే ఆయన ఎస్సే వ్యాసము-లఘు గ్రంథము అని వ్యవహరించినట్లున్నాడు.

**"The Word Essay is late but the thing is ancient"** అన్నట్లు వ్యాస వస్తువుమనకు ప్రాచీనమే అయినా అర్వాచీనార్థంలోగల వ్యాస రచనా విశేషం ఆధునికం. కాకపోతే బ్రౌను చెప్పిన 'వ్యాస'నామం ఆ రెంటి

నడుమనగల స్థిత్యంతర సీనును సూచిస్తున్నదంతే. కనుక వాచక ప్రాధాన్యంగల ఛందస్సు, వాచ్య ప్రాధాన్యంగల వాక్యము సంయోగం చెంది ఫలదీకృతమైన అణుదశ కవికృతమైన కావ్యముగా పేర్కొనవచ్చును. అది పద్యగద్యములనే పాదాలూ హస్తాలూ కూర్చుకొంటున్న పిండ దశలో పద్యకృతిగా వెలసిన వచన ప్రబంధం, ద్విపదవచనాలలో రూపుదిద్దుకొన్న వాక్య గ్రంథం, వాచకం, అనే రీతులు రూపుదిద్దుకొన్నవి. అదే మూడుమూళ్ళ తొమ్మిదిగా ఎదిగి, నవమాసాలు నిండిన, గర్భస్థ శిశుదశలో ప్రమేయం, సంగ్రహం, ఉపన్యసం అనే పేర్లతో విరివినందుకొన్నది. వాస్తవానికి ఆ తర్వాత జన్మ తీసుకొన్నదే "వ్యాసం" అనే అర్వాచీనరచనా ప్రక్రియ. అది నేటికీ ఇంకా శైశవదశలోనే వుండి బాల్య క్రీడలతో చదువరులకు చవులూరిస్తూ విందులు పెడుతున్నది.

**వాక్య(వచన) గ్రంథం నుండి ఎదిగినదే వ్యాసం**

వచన గ్రంథం (వేదాంత వ్యవహార సారసంగ్రహం, సభాపతి వచనం-16 శ॥); వాక్య గ్రంథం (భారత సావిత్రి, సిద్ధాంత శిరోమణి-16 శ॥); వాచకం (రాయవాచకం-17 శ॥); ప్రమేయం (సామినేనివారు-19 శ॥); సంగ్రహము (పరవస్తువారు-19 శ॥): ఉపన్యాసం (కందుకూరి వారు-19 శ॥)-వంటి నామాలన్నీ కూడా ప్రాచీనాలే అయినా నవ్యార్థంలో రసభావభాసురనవార్థ వచన రచనా విశేషాలుగా రూపొంది అర్వాచీన వ్యాస ప్రక్రియా వికాసంలో ప్రకృష్టమైన రీతి విశేషాలుగా రూపుకట్టించిన ఆయా రచయితలవల్లనే వాటికి వైశిష్ట్యం చేకూరింది.

**వామనాచార్యుని వామన వ్యాసం**

"వ్యాసం" అనే నామాన్ని పరామర్శించే సందర్భంలో పేర్కొనవలసిన మరోముఖ్యాంశ మున్నది. అది ముఖ్యమైనదే అయినా వ్యాస రచనలను గూర్చి ఇంతకు పూర్వం వ్రాసిన పరిశోధకు లీసందర్భంలో ఆ విషయాన్ని స్మరించి నట్లు కనపడదు. వ్యాస నామం వ్యాసుని పేరులో గోచరించినట్లే వ్యాస భారతం లోనూ ఒకానొక కావ్య గుణంగా పేర్కొనబడినట్లున్నది. అర్వాచీన వ్యాసస్వరూన్ని గూర్చి వ్రాసే సందర్భంలోకాకపోయినా వామనుడు కావ్యాలంకార సూత్ర వృత్తిలో కావ్యగుణాలను స్మరించే సందర్భంలో పేర్కొన్న ఈ వ్యాసోక్తిని విశదంగా పరిశీలించినవారు డా॥ వి. రాఘవన్ గారు

**వ్యాస సమాసాలు :**

"విస్తరైశ్చ సమాసైశ్చ ధార్కతేయద్ ద్విజాతిభి" "ఇష్టంహి విదుషాంలోకే సమాసవ్యాస భాషణమ్" (భా. ఆది. 1-35,36) అన్న వ్యాసవాక్యాలను అనుసరించే వామనాచార్యుడు తన కావ్యాలంకార సూత్రాలలో గుణవివేచనను గూర్చిన తృతీయాధికరణంలో వ్యాస సమాస విషయాలను విశదీకరించి వుండునని డా॥ రాఘవన్‌గారు భోజుని శృంగార ప్రకాశ వివరణ గ్రంథంలో పేర్కొన్నారు వామనుడు ఇలా అన్నాడు.

**ప్రౌఢి లక్షణం :**

అర్థస్య ప్రౌఢి రోజః- అర్థ స్యాభిధేయస్య ప్రౌఢిః ప్రౌఢత్వమోజః పదార్థే వాక్యరచనం వాక్యార్థే పదాభిదా - ప్రౌఢి ర్వ్యాసమాసౌచ సాభిప్రాయత్వ మేవచ...." దీనికి డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడుగారి బాలానందిని వివరణ మిలావున్నది.

"అర్థము యొక్క ప్రౌఢి ఓజస్సు - అర్థము యొక్క ప్రౌఢిఅనగా ప్రౌఢత్వము ఓజస్సు. ఈ ప్రౌఢిని ఐదు విధములని చెప్పుచున్నారు. 1. ఒక పదము యొక్క అర్థమును చెప్పుటకై (ఒక పదమును ప్రయోగించుటకుబదులు) వాక్యమును రచించుట (వాక్యమనగా ఇచట పదముల సముదాయమను అర్థమే వివక్షితము.) 2. వాక్యార్థము చెప్పవలసినచోట ఒక పదమును మాత్రమే ప్రయోగించుట. 3. వ్యాసము. 4. సమాసము. 5. సాభిప్రాయత్వము- అను వాటికి ప్రౌఢి అని పేరు.

ఈ అంశాలను పరిశీలించిన పిమ్మట మన మీ విషయం గుర్తించవచ్చును. ఇందులో వామనాచార్యుడు కావ్యశోభను కలిగించే గుణములుగా పేర్కొన్న వాటిలో పదార్థే వాక్యరచనమ్' అన్నది నేటి వచన రచనా విన్యాసములను గూర్చిన పరిభాషలో one word into one sentence Expansion అనే రచనా పరిశ్రమకు; 'వాక్యార్థే పదాభిదా' అన్నది one word Condensation. Contraction కి; 'వ్యాస' మన్నది అచ్చమయిన మన Essay కి. 'సమాస' మన్నది Brevity Epitomisation అనే క్లుప్తీకరణానికి అలనాటి పర్యాయము లనవచ్చు. సాభిప్రాయత్వమన్నది మొత్తం రచనా రీతిలో గోచరించే Clarity

and Lucidity కి సూచకము. వామనుడు 'వ్యాస'మును పేర్కొనడమే కాక 'వ్యాసోయథా ...' అని మానవుల సుఖదుఃఖాల రాకపోక లనిశ్చితములు అనే విషయం మీద ఒక చిన్న వ్యాసాన్ని ఛందో బద్ధంచేసి లక్ష్యంగా వినరించినాడు కూడా.

**తొలి వ్యాసమనదగిన వామనుని లక్ష్యం :**

"అయం నానాకారో భవతి సుఖదుఃఖ వ్యతి కరః సుఖం వా దుఃఖం వా నభవతి భవత్యేవ చ తతః పున స్తస్మా దూర్ధ్వం భవతి సుఖదుఃఖం కిమపితత్. పున స్తస్మా దూర్ధ్వం భవతి నచ దుఃఖం నచ సుఖమ్" దీనికి వుల్లెలవారి వివరణ మిది.

"ఈ వాక్యార్థమునకే వ్యాస సమాసములుండును. ఒక చిన్న విషయమును వివరించి చెప్పుట వ్యాసము. పెద్ద విషయమును చాల సంక్షిప్తముగ చెప్పుట సమాసము వ్యాసమెట్లనగా- " ఈ సుఖదుఃఖములతో సంబంధము అనేక విధ ములుగ నుండును కొంత కాలము సుఖము కాని దుఃఖముకాని కలుగనే కలు గదు. తరువాత కలుగును. మరల దాని తరువాత సుఖమో దుఃఖమో ఏదో ఒకటి కలుగును. దాని పిమ్మట సుఖమూ ఉండదు. దుఃఖమూ ఉండదు." ఇచ్చట 'సుఖదుఃఖముల రాకపోకలు అనిశ్చితము' లను వాక్యార్థమే ఇంత విస్తృతముగ చెప్పబడినదిగాన ఇది వ్యాసరూపమగు ప్రౌఢి

బహుశః భారతీయ వాఙ్మయంలో "వ్యాస" నామంతో వ్యవహరింపబడ్డదీ, ఛందోబద్ధమై అయినా తొలిదీ లఘు వ్యాసం అనదగినదీ క్రీ॥ శ॥ 8వ శతాబ్దిలో వామనాచార్యుడు ఉదాహరించిన సుఖదుఃఖాలను గూర్చిన ఈ వ్యాసమే ననుకొంటు న్నాను. ఇందులో ఆధునిక వ్యాస లక్షణాలన్నిటికీ బీజములున్నవి. వామనుడు పేర్కొన్న గద్య రచనా విశేషాలకు పారంపరికంగా ఉదాహరిస్తున్న మన గద్య వాఙ్మయ పరిశోధకులు వ్యాసమును గూర్చి వ్రాస్తున్న సందర్భంలో ఈ వ్యాస గుణ విశేషాన్ని వ్యాసలక్ష్యాన్నీ స్మరించకపోవడానికి హేతువు వారిదృష్టి దాని మీదపడకపోవడమే అనుకొంటున్నాను. ఈ విధంగా వామనుడు భారతీయ వాఙ్మయంలో లక్ష్యలక్షణాలతో కూడిన తొలివ్యాసానికి కర్త అయినచో Essay ని మొట్ట మొదట తెలుగులో వ్యాసమనే పర్యాయనామంతో సమానంగా పేర్కొన్న వారిలో బ్రౌన్‌దొరే ప్రథముడని నేటికి లభ్యమైన ఆధారాలను బట్టి చెప్పవచ్చు.

## వ్యాసవికాసదశలు

ఎస్సేకి తెలుగులో "వ్యాసం" అనే పదం స్థిరంకాక పూర్వం మన పరిశోధకులిదివరకు చాలామంది వ్రాసినట్లు ప్రమేయం-సంగ్రహం-ఉప న్యాసం అనే మూడు పదాలేకాక రెండు మూడు దశల్లో నాల్గైదు పదాలు దాకా ఆ అర్థంలో వాడుక చేయబడినట్లుగా భావింపవలసి వస్తున్నది. అవి ఇవి-

I పిండదశ :-

1. వచన గ్రంథం-వాక్యగ్రంథం-వాచకం :- సభాపతి వచనము; సిద్ధాంత శిరోమణి; రాయ వాచకము వంటివి వీటికి ప్రముఖములైన చక్కని ఉదాహరణలు. వేటూరి వారు చాటుపద్యమణిమంజరి (1922)లో ప్రకటించినదే, నిడుదవోలు వేంకటరావు గారు తను ఆంధ్రవచన వాఙ్మయంలో ఉదాహరించినదీ అయిన సభాపతి వచనం (16 శ॥) సింహగిరి వచనాలు. వేంకటేశ్వరవచనాలు వంటి గద్యరచనావిశేషం కాదు. సభాపతిగా చెలామణి అయ్యే వ్యక్తి యొక్క వ్యక్తిత్వం ఎలాంటిదికావాలో చక్కటి గ్రాంధి కాంధ్రంలో సుదీర్ఘంగా విజ్ఞాన సర్వస్వంగా చిత్రింపబడిన వ్యాస మీ సభాపతి వచనం.

ఆరంభం :- శ్రీరమ్యుడు సంతతశ్ర్యం
గారుఁడు రాజాన్వయ ప్రకారుఁడు నుతదా
నారూఢుఁడు సకల కళా
పారంగతుఁ డనగ నా సభాపతి యొప్పున్.... ....

వ॥ ఇట్లు కొలువున్న సభాపతి లక్షణం బెట్టి దనిన బ్రహ్మ దేవుని వామ దక్షిణ భుజంబుల బ్రభవించిన సోమసూర్యవంశంబులందుదితుండై, రాజస తామస సాత్త్వికంబు లనెడు గుణత్రయంబు తెలిసి.... షోడశ మహాదాన ధురంధరుండై ధ్యానావాహనాసనార్ఘ్య పాద్యాచమనీయ స్నాన వస్త్రయజ్ఞోపవీత గంధాక్షత పుష్పధూప దీప నైవేద్య తాంబూలంబు లను షోడశోపచార పూజా విధానుండై యార్య ధర్మంబు దప్పక వర్తించువాడు సభాపతి యనంబరగు."

రెండోది విశ్వనాథ నాయకుని స్థానాపతి చేత రచింపబడిన రాయ వాచకము (17 శ॥) ఇది రాయ చరిత్రమను సరస వ్యావహారిక వచనమున విస్తరించిన రచన. చారిత్రక వ్యాస మనదగినది.

మూడోది అల్లాడి రామచంద్ర శాస్త్రి కృతమైన సిద్ధాంత శిరోమణి (19వ శ॥) సరళగ్రాంధికంలో సాగిన సరసవచనరచన.

'అంధూధము వలె సంస్కృత
గ్రంథార్థము సంగ్రహింప కష్టము గంగా
సింధువు వలె యాంధ్ర వచన ప్ర
బంధము సులభంబు జగతి బాలున కైనన్'

అని తమరచనను 'వచన ప్రబంధం'గా పేర్కొన్న వీరి రచనలోని క్రింది తదాహృతి వాస్తవానికి essay on geology and environment అనదగినది

"భూకంపమునకు కారణము శేషుడుగాడు. ఇక నేమియన్నను భూమ ధ్యము నందు నానా పదార్థములున్నవి. అవి కలిసి యున్నవి ...వాయు జలములు నడిచేటందుకై మార్గములున్నవి. నీళ్ళ గుణ మీలాగున నున్నది కహ ఉష్ణత్వము చేత పలుచనై యుచ్చి యెక్కువౌ చున్నది. ఆయుష్ణత్వము వలన నుదకములు ఆవిరై బయటికి వెళ్ళ జూచు చున్నవి. వాటికి త్రోవ లేకపోయెనా అవి తమ శక్తి చేత పృధివిని పగులగొట్టి బైలు వెళ్ళగా భూకంపమౌ చున్నది.... నీళ్లు పగులగొట్టుటే కారణ మనెడిది సత్యము. నీళ్ళ యావిరి బలము చేతనే నావలు నడచు చున్నవి... "

నూరు పుటల్లో 1850లో ముద్రితమైన ఈ కృతియందలి విషయము నాటి అనంతపురం జిల్లా కలెక్టర్ విల్కిన్సన్ దొరకంకితము కావడము దీని ఆధునిక తకు. ఆంగ్ల వాఙ్మయమిచ్చిన ప్రేరణకు సూచకము.

వ్యాసం-ఎస్సే-అంటే "లఘుగ్రంథ"మని బ్రౌను దొర భావించి వ్రాసి నట్లు ఇలాంటి లఘుగ్రంథాలు ప్రాచీన వ్యాస వస్తువు అర్వాచీన వ్యాస రచనా ప్రక్రియగా రూపు దిద్దుకొంటున్న గర్భస్థ పిండ దశను సూచించే ప్రముఖ రచన అనుకో వచ్చును.

2. ప్రమేయములనబడిన వాక్య గ్రంథాలు. (19వశ॥ మధ్యభాగం)
వెనుకటి వాక్య గ్రంథమే ఈ కాలంలో ప్రమేయ మనే పేరు సంతరించు

కొన్నది. సామినేని ముద్దు నరసింహ నాయనివారు తమ వచన రచనలను "వాక్య గ్రంథ" నామంతోనే కాక "ప్రమేయ" మనే పేరుతో కూడా వ్యవహరించు కొన్నారు. 19వ శతాబ్ది మధ్య భాగంలో వీరు ఒందరు నుండి వెలువడుతున్న హితవాది పత్రికలో ఈ ప్రమేయాలను ప్రకటించారు. ఆవే తరువాత 'హిత సూచని' నామంతో విద్య ప్రమేయము, వైద్య ప్రమేయము, మనుష్యేతర జంతు సంజ్ఞా ప్రమేయములు గల గ్రంథంగా 1862లో ముద్రితమైనది. గత మాసం లోనే ఇది తెలుగు దేశాన పునర్ముద్రణ భాగ్యానికి నోచుకొన్నది. ఈ ప్రమేయా లలో ఆయన సమకాలిక విషయాలెన్నో సాధారణ వ్యావహారికంలో ప్రజలకు సుబోధమయేటట్లు ముద్రాక్షరాంకితం గావించారు. వారు ఎన్నుకొన్న విషయాలు, ఎంచుకొన్న భాష-వీటితో పాటు ఆ వాక్య గ్రంథంలోని ఎత్తుగడ, ప్రదర్శన విధి కూడా అర్వాచీన వ్యాస రచనలకు భిక్ష పెట్టినట్లుగా ఉన్నవి. విద్య ప్రమేయంలో ఆయన రచన పంక్తులివి గమనింప దగినవి.

ప్రమేయాలూ వాక్యగ్రంథాలే

"శాస్త్రముల యొక్క గ్రంథములున్ను, ఇతరాంశములను గురించిన గ్రంథ ములున్ను సులువుగా బోధ పడేలాగున దేశ భాషలలో వాక్య గ్రంథములుగా వ్రాయించి ప్రింటు చేయించి అవే బాలురకు చేప్పించే పక్షమందు బాల్యకాలము లోనే శాస్త్రముల యొక్క ఇతరములైన అంశముల యొక్క జ్ఞానము వారికి త్వరగా కలుగడమునకు సందేహమేమియు లేదు."

ప్రమేయములనే పేరుంచినా వీరు తమ యీ రచనాలను పూర్వులవలె "వాక్య గ్రంథము"లని పేర్కొనడం వ్యాస పరిణామగతిలో గుర్తింప దగిన అం శము. ఒక నాటి వాక్య గ్రంథమే అప్పటికి ప్రమేయమనిపించుకొన్నది. మాఙ్ మానే అనే ధాతువు నుండి పుట్టిన ప్రమేయ శబ్దానికి కొలువ దగింది, యథార్థ ముగా నెరుగ దగినవి, అనే అర్థాలున్నాయి. ప్రమాణ ప్రమేయ పదాలు తర్క వేదాంత పరిభాషలో పరిచితములే అయినా వాటిల్లోని ప్రమేయ పదాన్ని వాక్య గ్రంథానికి పర్యాయంగా వాడుక చేసిన వారిలో సామినేని వారే ప్రథములను కోనచ్చు. ఆచియాచి తూచితూచి యథార్థ విషయాన్ని ప్రతి పాధించే ప్రదర్శన విధి (Presentation Method) వల్లనే వీరా వాక్య గ్రంథాలను 'ప్రమేయము

లన్నట్లున్నారు. దీనివలన ప్రమేయ నామంలో వాక్య గ్రంథం వెనుక గల ప్రధాన స్పందన-వ్యాస రచనలోని మూల శక్తి (main impulse-unifying force of the essay) సూచిత మవుతున్నది. విమర్శనాత్మకంగా, హేతు బద్ధంగా శాస్త్రీయమైన సామాజిక పరిణామ దృష్టి ఉండడం వలన వీరి యీ వాక్య గ్రంథాలను సామాజిక వ్యాసాలు (Social essays)గా పేర్కొనవచ్చు. ముఖ్యంగా భాషావిషయమై వీరి దృష్టి అభ్యుదయ పథంలో ప్రసరించినది.

"గ్రామ్యోక్తి ఆంధ్రభాషతాలూకు అంశములలో నొకటిగా లక్షణ గ్రంథముల యందు చెప్పబడినది. ఈ పదములు ఛందోబద్ధములయిన గ్రంథములందు చేర్చుట అరుదై యున్నది. కాని వాక్యములందును భాషయందును వాటి వాడుక తఱచై యున్నది కనుక సాధారణమైన భాషయందు వాడుకలోనున్న రచన లో అంగీకరింప దగినవిగా నేను ఎంచుకొంటున్నాను" అని హితసూచని గ్రంథ పీఠికలో పేర్కొనడం వీరి అభ్యుదయ దృక్పథానికి తార్కాణ. భాషలోను భావంలోను వ్యాసం కొత్త తొడుగులు తొడుక్కోవడం మన కిందులో కనిపిస్తుంది.

3. సంగ్రహములు:— భారతవర్షంలో ప్రప్రథమ మహామహోపాధ్యాయులు శబ్దార్థసర్వస్వమనే విజ్ఞాన సర్వస్వాన్ని ఒక్క చేతిమీదుగా కూర్చినవారు, అయిన పరవస్తు వేంకట రంగాచార్యుల వారు పందొమ్మిదో శతాబ్ది చివరి పాదంలో ప్రచురించిన సంగ్రహములనే లఘు గ్రంథాలు కూడా వాక్య గ్రంథములన దగినవే. ప్రమాణ సంగ్రహము, అలంకార సంగ్రహము, ఆర్ష మత సంగ్రహము, వివాహ సంగ్రహము కళా సంగ్రహము, పునర్వివాహ సంగ్రహము, హిందూ శాస్త్ర సంగ్రహము, మొదలైన వాటిని 23 సంగ్రహాలను వీరు సమకాలపు పత్రికలలో ప్రకటించి విడివిడిగా చిన్న పుస్తకాలుగాను తీసుకు వచ్చారు. వీరి ప్రమాణాది సంగ్రహాలు సామినేని వారి ప్రమేయ నామాంకితాలైన వాక్య గ్రంథాలను పోలినవే అయినా నామ భేదంతో పాటు శైలీభేదాన్నీ సంతరించు కొన్నది. సామినేని 'వివాహ ప్రమేయం' సరసవ్యావహారికంలో వుంటే పరవస్తు వారి శైలి వీరేశలింగం పంతులుగారి "ఉపన్యాసా"ల శైలిక మాతృకగా వున్నది అని మన పండిత పరిశోధకులు భావించారు. ధర్మ సంగ్రహంలోకి పరవస్తు వారి రచన పంక్తులివి సుఖ దుఃఖాలను గూర్చిన వామనుని వ్యాస లక్ష్యాన్ని పోలివున్నవి.

"మేలు చెందుటకును కీడు దొలగించుటకును ప్రయత్నము చేయుట సర్వ సాధారణము. మేలనగా సుఖకరము. కీడనగా దుఃఖ కరము. తత్కాలమునందలి మేలు కీడులకంటె నుత్తరకాలము నందలి మేలు కీడుల నాలోచించి నడచుట తెలివికి ఫలము ఎంత దూరము వ్యాపించు మేలు కీడుల నాలోచించిన నంత ఎక్కుడు తెలివిగలవాడని తెలియవచ్చును."

సంస్కృత శాస్త్ర సంప్రదాయంలోని తర్క సంగ్రహ, స్మృతి సంగ్రహాదులు పరవస్తు వారికా "సంగ్రహ"మనే పేరును స్ఫురింప జేసి వుండవచ్చునను కొన్నట్లే, తిరుమల రామచంద్రగారు సూచించినట్లుగా ద్రావిడ వైష్ణవ సంప్రదాయంలోని "శరుక్కం"-విషయాలను క్రోడీకరించి చెప్పే తీరు-కూడా వారి ఆనామ్రగహణానికి తోడుపడి వుండునను కోవడం సబబే. పరవస్తు వారి కించుక పూర్వ కాలపు క్రైస్తవమత ప్రచారకుల "ఉపదేశ సంక్షేపము" "హిందూ ధర్మ శాస్త్ర సంగ్రహము" కూడా ఈ తీరురచనలే. "విస్తీర్యై తన్మహజ్ జ్ఞాన మృషి స్సంక్షిప్య చాబ్రవీత్। ఇష్టం విదుషాం లోకే సమాసవ్యాసధారణమ్' అన్న వ్యాసోక్తినిట స్మరించ వచ్చును. ఈ ప్రమేయాలలోను సంగ్రహాలలోనూ, ప్రతిపాదింపబడే విషయంలోని మూలశక్తి (unifying force) తోపాటు సంక్షిప్తత (Brevity) అనే సమాసకగుణం కూడా భాసిస్తుంది.

**4. ఉపన్యాసాలు :-** అర్వాచీన వ్యాస శీర్షోదయానికి పూర్వం గ్రంథ గర్భస్థపిండ దశలో వాక్య గ్రంథము, ప్రమేయము, సంగ్రహము ఎట్లో ఉపన్యాసమును అట్లే నవయుగ వైతాళికుడు సంఘ సంస్కరణోద్యమ సారధి అయిన కందుకూరి వీరేశలింగం పంతులు గారు పత్రికల్లో విరివిగా రాశారు; వేదికల నుండి ప్రసంగించారు. వారి పత్రికారచనలూ ప్రసంగాలూ అన్నీ కూడా లిఖితోపన్యాసాలే. పరవస్తువారి సంగ్రహాల్లోకి భాషాశైలి, జియ్యరు సూరి (49 శ॥ ఉత్తరార్థం) గారి మహిళాభ్యుదయ భావనం వీరేశలింగం పంతులు గారి ఉపన్యాసాలలో ప్రతిఫలించినవి. వివిధ విషయాలపై వీరు వ్రాసిన ఉపన్యాసాలు దాదాపు రెండు వందలనీ, అచ్చులో నాలుగు వేల పుట లాక్రమించినవనీ, పరిశోధకుల పరిగణనము. "మహా విషయమును సవిస్తరముగా వ్రాయ శక్తులము కాకపోవుటెరింగియు, మేమును శక్త్యనుసారముగా నించుకంత ప్రయత్నించి చూతము గాకయని మాకు తోచిన యభిప్రాయములను గొంచెము వ్రాయబూను కొన్నారము. గుణ గ్రహణ

పారీణులు మా వాక్యముల యందలి గుణమునే గ్రహింతురు గాక" అని రు పీతమ ఉపన్యాస మంజరిలో అన్నారు. వాక్యో ప్రక్రమానికుప్రక్రమించే ప్రయత్నాన్నే పంతులు గారీ ఉపన్యాసంలో పేర్కొన్నారు. ఉపన్యాసానికి విచారము, ఉంచు, ఉప్రక్రమించు, భావాలు తెలుపు అనే అర్థాలున్నాయి. ఎస్సే అనే పదానికి ప్రయత్నమనే అర్థమున్నది. అందుకే పంతులు గారి ఉపన్యాసాలు క్రమంగా సమకాలికుల ఎస్సేలకు (వ్యాసాలకు) కొత్తబాట వేసి, నూతన వ్యాసా విర్భావానికి, దాని వికాసానికి ఎంతో దోహదం చేసినవి అనవచ్చును.

ఉపన్యాస ప్రక్రియ వ్యాసానికి చైతన్యస్ఫూర్తినిచ్చినది

ఉపన్యాసాల కోసం వ్రాసినవీ, వ్రాసి ఉపన్యసించినవీ అయిన ఇలాంటి 'ఉపన్యాసా'ల వలన మన వ్యాస రచన వ్యాసంగానికి ఎంతో చైతన్య స్ఫూర్తి కలిగినది. వ్రాత వాక్కునకు ద్వితీయ రూపమే కాబట్టి వాక్కులో ఉపన్యాసకుడు సాధించిన దాన్ని వ్రాతలో సమర్థులైనవ్యాస కర్తలూ సాధింపసాగారు. ఆత్మీయతా ధర్మంతో సమర్థుడైన వ్యాసకర్త ఉపన్యాసకుని వలెనే పాఠకుని శ్రోతనుగా జేసి తనవెంట తీసుకు వెళ్ళజాలినవాడైనాడు. పానుగంటి వారి సాక్షి వ్యాసాలు ప్రధానంగా వ్రాతకు దెచ్చిన రూపాలే అయినా వా గ్రూపంలోని జీవాన్ని సృజన శక్తిని పుణికి పుచ్చుకొన్నట్టివి. పంతులు గారి ఉపన్యాస వైఖరి పానుగంటి వారి సాక్షి వ్యాసాలలో పరిపుష్టినందు కొన్న వన వచ్చును. అవి వ్యాసాలూ ఉపన్యాసలూ రెండూ కూడా ఒక రూపంలోనే ఇమిడినట్టివి.

పరిష్కరణం - రూపావిష్కారం

వీటిల్లో ఇంకొక విశేషమున్నది. వెనుకటి ప్రమేయాలలోను, సంగ్రహాలలోను, వ్యక్తం కాని మరొక విశిష్ట రచనా ధర్మం వీరేశలిగం పంతులుగారి ఉపన్యాస రీతిలో కానవస్తుంది. అదేమిటంటే - పరిష్కరణం (Editing), రూపావిష్కారం (Shaping) అనే ధర్మాలతో ముడిపడిన విమర్శాత్మక రచనా లక్షణమూ (Critical ability), ఉపన్యాస జీవమైన సృజన ధర్మమూ (Creative ability) రెండూ కూడా వీటిల్లో ప్రధానం కావడమే ఆవిశిష్ట ధర్మం. ఇది వ్యాస వికాసానికెంతో దోహదం చేసింది. Writing with power అనే గ్రంథంలో Peter Elbow పేర్కొన్నట్లు రచనలో శక్తి ఉన్నది స్ఫురిస్తూ

సృజిస్తూ పరిష్కరించుకొంటూ పోయే రీతిలోకన్నా ఉపన్యసించినట్లుగా విష యాన్ని ముందుగా రచనా బద్ధం చేసి ఆ మీద రూపావిష్కారాన్ని (Shaping) కోరి సాధించే పరిష్క్రియలో అధికంగా ప్రస్ఫుటమవుతుందన్నది సత్యమే.

పత్రికలు :

పత్రికల సంఖ్యా రచయితల సంఖ్యా పెరగడంతో వ్యాసాలతో పాటు పాఠకుల సంఖ్య కూడా పెరిగింది. వ్యాస ప్రక్రియ వివిధ వాఙ్మయ రంగా లకు విస్తరించి ఎంతో వైవిధ్యాన్ని కూర్చుకొన్నది. సత్యదూత (1835); వృత్తాంతిని (1840); వర్తమాన తరంగిణి (1842-57); దిన వర్తమాని (1861-68); హితవాది (1842-47); తత్త్వ బోధిని (1814); సుజన రంజని (1864); ఆంధ్రభాషా సంజీవని (1871); పురుషార్థ ప్రదాయిని (1872); వివేకవర్ధని (1872); శశి రేఖ (1892); శ్రీ వైజయంతి (1894); అముద్రిత గ్రంథ చింతామణి - మొదలైన పత్రికల్లో వ్యాసం పలుపోకడలు పోయింది.

ఎస్సేలు - బహువిధ వర్గీకరణము :

క్రమంగా వ్యాసం నిర్మాణంలోనూ, స్వభావంలోనూ, విషయ వైవిధ్యం లోనూ, అది సాధించిన ప్రయోజనంలోనూ ఎంతో పుష్టిని చేకూర్చుకోసాగింది. అందుకే విమర్శకులు వీటిని తీరు తీరులుగా విశ్లేషించి వింగడించి చూపించారు. ఎస్సేలను Familiar-, Character-, Descriptive-, Critical-, Scie-ntific-, Philosophic-, Narrative-essays అని కొందరు; Historical-, Biographical-. Familiar-, Personal-, Imaginative-, Narra-tive-, Didactic-, Critical-, Reflcetive-, Philosophical-, Religious - essays అని మరి కొందరు; విషయవివరణనుబట్టి Factual Factual Historical-, Semitechnical-, Faetual Biographical-essays అనీ, మూల్యాంకన విధినిబట్టి Interpretatirve-Critical-, Per-suasive-, Emotional essays అనీ; కల్పనా మహితమైన సాహిత్యకళా ధర్మాన్నిబట్టి Litarary Biographical - Literary Historical - Discriptive - Familiar - essys అనీ ఎన్నోతరహాలుగా ఇంకొం దరు వ్యాసాన్ని విశ్లేషించిన వారున్నారు. ఇంతకూ విస్తారో విగ్రహో వ్యాసః

అనబడిన వ్యాసం విరివిని గ్రాహ్య తర్మాన్ని కూర్చుకొంటూ ఇలా అర్వాచీన వాఙ్మయంతో 'బహుముఖ రచనంబున' దీపించడంచేతనూ, అనంతమైన వైవిధ్యం గల వ్యాసాన్ని సమర్థంగా విశ్లేషించడం సాధ్యంకాక పోవచ్చుననే భీతి చేతనూ చివరకు Jorph T. Shiply లాటి పరిశోధక విమర్శకులు అంతులేని అంతస్థ బిందువులతో కూర్చబడిన ఇట్టి వ్యాసరేఖ నొకదానిని సంభావించి దాని వైవిధ్యాన్ని వ్యాప్తిని గ్రహించే బాధ్యతను పాఠకులకే వదిలియవలసి వచ్చింది.

**వ్యాస నిర్మాణం, సమాచార నిపుణుల దృష్టి :**

వ్యాస నిర్మాణం : వ్యాసంలోనే కాక - ఏ రచనా నిబంధంలోనైనా సరే మనోభావాలు (Thorght patterns) అక్షరాకృతిని పొందే దశలో జరిగే ప్రక్రియను సమాచార విశేషజ్ఞులు (communication Experts) విశ్లేషించి చూపారు. సాధారణంగా మనం రాస్తూ రాస్తూ పరిష్కరించుకొంటూ రాస్తూ పోతాము. ఏ వ్రాయసగాని First Draft ని పరిశీలించినా తుడుపులు కొట్టివేత లతో నిండిన రచనా వ్యాసంగం దానికి సాక్ష్యం పలుకుతుంది. అందులోనే హంస పాదమన్న సామెత ఆ అనుభవంలోంచి పుట్టినదే. రాయడమన్నది సృజన (Creative) ధర్మం. తుడిపి కొట్టివేయడమన్న పరిష్కరణ చర్య తద్విరుద్ధ మైన విమర్శ (critial-) ధర్మం. ఇలా రెండూ కలిసి పనిచేయడంలో కాల హరణంతో పాటు రెండు సరిగా నిర్వాహించెందనిస్థితి ఏర్పడుతుందన్నది అను భవైక వేద్యమంటారు. Modern Communication Experts. ఇదొక చెడ్డ అలవాటనీ దీన్ని దిద్దుకోవాలనీ వాళ్ళంటారు. వాళ్ళ దృష్టిలో రచనా ప్రవృత్తిలో రాచలసిన కొత్త అలవాటు ముందుగా అడ్డమాకలు వేని సృజన ధర్మం అనర్గళంగా సాగే ఉపన్యాస రీతిలోనే సాగాలంటారు. అప్పుడే వేగంతో కూడిన ముఖ్య వస్తు ప్రతిపాదకమైన రచనారీతి అలవడుతుంది. ఆ పిదప స్వల్పకాలం పునరాలోకనం చేస్తూ పరిష్కరణ (Editing)కో అంతకన్నా రూపా విష్కారాని (Shoping)కో ప్రయత్నించే అలవాటు చేసుకోవాలి. పరిష్కరణ మన్నది అన్య దీయమైన విమర్శక ప్రవృత్తిలాంటిది స్వకీయమైన కృతిని అన్యులే కాని మనమే కాని పరిష్కరించడానికి సాధారణంగా మనం హర్షించం. కనుక Editing కన్నా Shoping అనేది మంచిది. అది అహ్లాదకరమైన సృజన ప్రవృత్తి. ఒక దిమ్మ లోనో మట్టి ముద్దలోనో సుశ్లిష్ట సంధి బంధమైన ఒక అకృతికి నిర్మించడం లాటి

చర్య అవి. ఇందులోనూ విచ్ఛేదనం వున్నా అది విరుపునకుకాక సృజనధర్మంతో కూడిన నిర్మితికి తోడు పడేది. అట్టి చర్యలో **The red pencil becomes an instrument of creation, not amputation** అంటారు వార్తా సమాచార నిపుణులు.

**వ్యాస వస్తువు-మూల శక్తి**

ఇట్టి రచనారీతికలవాటు చేసుకోవడం వలన వేగాన్నీ రచనా సౌందర్యాన్ని సాధించుకోవడమే కాక రచనలోని **unifying force**-మూల శక్తి-ప్రస్ఫుటమై **writing with power** అన్నది సాధ్యపడుతుందనీ శక్తిమంతమైన రచన వెలువడుతుందనీ వారి నిష్కర్ష. ప్రతి రచనకు వెనుక ఒక అంతర ప్రేరణ ముంటుంది. అదే అందులోని **unifying force**-మూల శక్తిగా వ్యక్తమవుతుంది అదే లేనప్పుడు వ్రాతకోతలు కట్టి పెట్టడం మంచిది. అదే వున్నప్పుడు దానికి రచన రూపాన్నిస్తుంది. ఇందాక చెప్పిన ఆ సృజనాత్మక నిర్మాణ విధి **Shaping** అనబడేదే కాక రచనకు తుది మెరుగులు దిద్దే చర్య మరొకటి వుంది. అది **Easthetic shaping process. shaping**ని స్థూల రూపావిష్కారమను కొంటే **easthetic shaping** ని రమ్యరూపావిష్కార మనవచ్చు.

**రమ్య రూపా విష్కారము-సూచనలు**

రచనా నిబంధాలలో రమ్య రూపా విష్కారానికి వార్తా సమాచార విశేషజ్ఞులు కొన్ని సూచన లిచ్చారు. అవేవంటే.

1. అరిగిపోయిన పదబంధాల్ని విడనాడటం. అస్పష్టమైన వాటినీ ప్రాత పడ్డ మాటల్నీ పరిహరించడం. (ఇంతకూ చెప్పొచ్చిందేమిటంటే; నిజం చెప్పాలంటే; మొత్తం మీద.... వంటివి).

2. అవశ్యకంకాని అంశాలను వర్జించడం. అంటే రచనా నిబంధంలోని **unifying force** మూల శక్తి-కి భంజకాలైన పనిలేని మాటల్నీ పసలేని అంశాల్నీ విడనాడట మన్నమాట.

3. పునరుక్తి దోషానికి గురి అయ్యే పదబంధాల కూర్పును త్యజించడం. (నల్లని కాటుక కళ్లు; తెల్లని పాలవెన్నెల **high peaks, final conclusion** .... వంటివి).

ఇలాగే పద దోషాలు లేకుండాను, వాక్య నిర్మాణంలో లింగవచన సంవాద లోపం రాకుండాను చూచుకోవడం; విసుగుగొల్పే మాటల కూర్పును, చేంతాడు వాక్యాలను, చేట భారత కథనాన్ని పరిహరించడం; రచనలో హేతుబద్ధమైన పూర్వాపర సంబంధాన్ని కాపాడడం; చెప్పదలచిన విషయాన్ని సమర్థంగా పొందికతో చెప్పడం వంటి జాగ్రత్తలు తీసుకోవడం వలన రచనా నిబంధానికందం వస్తుంది. ఆధునికులు చెప్పిన ఈ అంశాల్లో చాలా వాటిని మన ప్రాచీనాలంకారికులూ చాలా మంది పరిహరించవలసిన కావ్య దోషాలను, పరిగణించ వలసిన కావ్య గుణాలను చర్చించే సందర్భాలలో చెప్పే వున్నారు.

**కౌటిల్యుడు-లేఖ రచన**

వీరేకాక క్రీ॥పూ॥ 4వ శతాబ్దికి చెందిన మేధావి కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో శాసనాధికారాన్ని వివరించే ప్రకరణంలో లేఖ సంపత్తిని లేఖ దోషాలను విపులీకరించాడు. అవి ఒక్క లేఖా రచనకే కాక మరి ఏ ఇతర నిబంధానికైనా సమంగా వర్తించే రచనా నిర్మాణసూత్రాలే. కౌటిల్యుడు లేఖ సంపత్తినిపేర్కొంటూ ఆరు ధర్మాలను ప్రస్తావించడమే కాక వాటిని వివరించాడు కూడా. ఇలాంటి అపూర్వ విషయాలను Compositionని గురించీ Letter Writingని గురించీ రాసే ఆధునికులు అట్టే స్మరించక పోవడం శోచనీయం. డా॥ వి రాఘవన్ శృంగార ప్రకాశమును గూర్చిన తమ విమర్శ గ్రంథంలో గుణ వివేచన సందర్భంలో ఈ అంశాలపై వెలుగులు ప్రసరింప జేయడం ముదావహమైన విషయం.

"అర్థక్రమః, సంబంధః, పరిపూర్ణతా, మాధుర్యమ్, స్పష్టత్వమ్, ఇతి లేఖ సంపత్"

(కౌటిల్యుని అర్థ శాస్త్రం-శాసనాధికారము)

1. అర్థక్రమ :— ఇది ప్రదర్శన విధిలోని క్రమాన్ని సూచిస్తుంది. రచనా విషయం యొక్క సమ్యగవగాహనకు సమ్యక్ప్రదర్శనకు సంబంధించిన విషయమిదనీ, వామనుడు పేర్కొన్న శ్లేష అనే అర్థ గుణానికి సంబంధించిన క్రమమును సూచించే అంశ మిది కావచ్చుననీ డా॥ రాఘవన్ గారన్నారు.

2. సంబంధః - ఇది నేటి వార్తా సమాచార నిపుణులు ప్రస్తావించే రచనా నిబంధంలోని మూలశక్తి (unifying force)కి, రచనలోని పొందిక (Coh-

erence)కి, ఔచితీ సమంచితమైన విషయ సమస్య మాని (relevance)కి సంబంధించిన విషయమిది,

3. పరిపూర్ణతా – ఇది రచనలోని Completeness అనే విషయం, ఇది (క) అర్థ పదాక్షరాణామ్ అన్యూనాతిరిక్తతా, (చ) హేతూదాహరణ దృష్టాంతైః అర్థోపవర్ణనా, (ట) అశ్రాంత పదతా అని మువ్విధాలని విశదీకరించాడు కౌటిల్యుడు. ఇందులో అన్యూనాతిరిక్తతా అన్నది తర్వాత కాలంలో దండి చెప్పిన అర్థ వ్యక్తికి సంబంధించినది. రెండోది సోదాహరణంగా హేతుబద్ధంగా పొందికతో పెంపొందింప జేసే రచనా వస్తువుకి సంబంధించినది. మూడోది భోజుడు వివరించిన ప్రౌఢికి వివక్షితార్థ నిర్వాహానికి సంబంధించినది.

4. మాధుర్యమ్ - ఇది భరతుడు చెప్పిన మృదు శబ్దానికి సుఖార్థానికి సంబంధించినదన్నారు డా॥ రాఘవన్. అందమైన భావాన్ని అందమైన పదాల్లో పొదగడమే మాధుర్య ధర్మం. భావ ప్రకటనలోని సౌందర్య సౌకుమార్యాలకు సంబంధించిన విషయమిది.

5. ఔదార్యమ్ – అగ్రామ్య శబ్దా భిధానమే ఔదార్యం. దండి చెప్పిన లక్షణం కూడా ఇదే. లేకి మాటలు లేకుండా సన్నివేశాని కుచితమైన గంభీరమైన పలుకుబడి ఉండడమే ఔదార్య లక్షణము.

6. స్పష్టత్వమ్ - ఇది సారళ్యానికి సాభిప్రాయత్వానికి సంబంధించినది. దండి చెప్పిన ప్రసాద గుణానికి ప్రతీతశబ్ద ప్రయోగ లక్షణానికి అన్వయించే ధర్మమని డా॥ రాఘవన్‌గారన్నారు. ఇలాగే అకాంతి. వ్యాఘాతము, పునరుక్తము అపశబ్దము, సంప్లవము అనే ఆరు లేఖ దోషాలు లేకుండా చూచుకోవాలని కూడా కౌటిల్యుడు చెప్పినమాటే. ఇంతకన్నా ఈ విషయమై ఏ Communication Experts అయినా వేరే ఏమి చెప్పగలరు? నేటివారు చెప్పినవీ చెప్పక విడిచినవీ అన్నీకూడా కౌటిల్యుని ఈ లేఖ సంపద లేఖ దోషముల వివరణములో అంతర్గతములై పోతూనే వున్నవి. శాసన ప్రకరణంలో లేఖా విషయాన్ని ప్రస్తావిస్తూ కౌటిల్యుడే వివరణమిచ్చాడన్న మాటేగానీ ఇవి మరి ఏ రచనా నిబంధానికైనా వర్తించే విషయాలే.

విశిష్ట వ్యాస స్వరూపం

కనుక వ్యాస నిర్మాణం లోనూ మనమీ సూత్రాలను సంభావించుకోవచ్చు అంటే విశిష్టవ్యాసంగా పరిగణింపబడే రచన దేంట్లోనైన అర్థక్రమముండాలి,సంబంధముండాలి., పరిపూర్ణత భాసించాలి. మాధుర్యముండాలి., ఔదార్యముండాలిస్పష్టత్వముండాలి అన్నమాటే. ఆధునికులు వ్యాసరచనా విశేషాన్ని విశ్లేషించి ఈ నియమాలుంటా యన్నారు. నిడివిలో వ్యాసం అతిదీర్ఘంగా వుండక క్లుప్తంగా సంగ్రహంగా వుండాలి. పుటలు నియతంగా వుండాలి. రచనలో విషయం ఏదైనా వుండవచ్చు. వక్తవ్యాంశం విషయ విభాగం కలిగి వుండాలి. ప్రకరణాన్ని బట్టి ప్రత్యేక ఉపశీర్షిక లుండాలి. భాష నిర్దుష్టంగా సులభగ్రాహ్యంగా వుండాలి. నిర్మాణంలో ఉపక్రమం ఉపపాదనం-ఉపసంహారం క్రమంగా పాటింప బడాలి. వచనత్వం దీని ప్రధాన లక్షణం. స్పృజన ధర్మం ప్రస్ఫుటంగా వుండి రచయిత యొక్క వ్యక్తిత్వం ప్రదర్శితమయ్యే లాగా వుండాలి. అర్వాచీన వ్యాస లక్షణాలలో విమర్శకులు ఇవికాక ప్రముఖంగా పేర్కొన్న మరో అంశం పరిశీలింప దగినది. Essay should not attempt too much అన్నది. అందులో want of finish ఉండాలన్నది కూడా ఈ భావాన్ని విశదీకరించేదే. అంటే అర్వాచీన వ్యాసం ఆకృతిలో నాతి దీర్ఘంగా వుంటూనే ఏ వస్తు విషయాన్ని గురించి, లేదా, విషయ విభాగం గురించి వ్రాస్తున్నామో ఆ విషయాన్ని పరిమితుల్లో బంధిస్తూనే మరి కాస్త చెబితే బాగుండునేమో అనిపించే రీతి తోను, మళ్లీ మళ్లీ చదవాలని చవులూరించే శైలితోనూ ఒప్పే ధర్మాన్ని సూచించే నిర్వచనమే యిది. ఆకర్షణతో కూడిన ఆకృతి వామనత్వమనే ఈ ధర్మం లేకపోతే ఒక లఘువచనకళా ఖండంగా నిలువవలసిన వ్యాసం పలచబడి, తేలికై ఏ వ్యాసకంగానో లేదా బరువై నానా విషయ విధి సంయోజితమై ఏ సిద్ధాంత గ్రంథంగానో మారే ప్రమాదముంటుంది. want of finish అనే ధర్మం స్ఫురించికపోతే శైలీ పరిపాకంతో మళ్ళీ మళ్ళీ చదివించే గుణంలోపించి వ్యాసం ఏ పూట కాపూట చదివి పారేసే సమాచారాన్నందించే వార్తా పత్రికా రచనై పోతుంది. ఏమైనా వ్యాస రచనలన్నీ structured formsగా చదివించే గుణం ప్రస్ఫుటమైనవిగా వుండగా ఇటీవలి కాలంలో మరో తీరు రచన unstructured Research పేరుతోనూ unstructured Essay అనే పేరుతోనూ నవీన వ్యాసంగా రూపుదిద్దు కొంటున్నది.

**వ్యాసం-ఆలోచింపచేసే గుణం**

వీటిలో వ్యాస పరిమితుల నధిగమించని నిడివి చదివించే శైలీ వుండడంతో పాటు పాఠకుల్ని ఆలోచింపజేసే ధర్మం కూడా ప్రస్ఫుటంగా వుంటున్నది. దీనికి బహుశః johnson essay కిచ్చిన నిర్వచనం "A loose sally of the mind, an irregular undigested piece, not a regular and ordinary composition" అన్నది ప్రేరకమై వుండవచ్చు. Addison అన్నట్లు casual gossip-పిచ్చాపాటీ కబుర్లూ కాక, johnson చెప్పినట్లు irre gular undigested loose sally of the mind - ఉబుసుపోకకు కచ్చా పచ్చాగా కూర్చిన మానస విచారమూ కాక ఆరెంటినీ కూర్చుకొని ఆలోచింప జేసే రచనా ధర్మం ప్రధానంగా గలవే ఈ unstructured essay అన్నది. ఈ విధంగా తెలుగు వ్యాసరచన కూడా నిర్మాణ విషయంలో ఇటీవలి కాలాన నవ్య ప్రయోగాలకు గురై కూర్పులోనూ పరిప్రక్రియలోనూ కొత్త రూపును దిద్దు కొంటూనే వున్నది.

**వ్యాస విలాసం**

ఈ విధంగా తెలుగు తల్లి వ్యాస గర్భం తాల్చిన తర్వాత పందొమ్మిదో శతాబ్ది పూర్వార్ధం వేవిళ్ళను, ఉత్తరార్థం పురిటి నొప్పుల్ని పడగా ఇరవయ్యో శతాబ్ది ఆరంభానికి వ్యాసశిశ్వోదయమైనదనవచ్చు. స్వేచ్ఛా భావసంచారానికి 'వాక్య గ్రంథం' ఆలంబనమై నిలిచినట్లు, ఆలోచనా పరంపరకు 'ప్రమేయం' నిలయమైనట్లు, ధార్మిక నైతిక విషయ వివరణకు 'సంగ్రహం' భండారమైనట్లు, హృదయ సంవాదానికి 'ఉపన్యాసం' వేదిక అయినట్లు ఈ శతాబ్దిలో పత్రిక మంత్ర సాని, దాది, కాగా వ్యాసం దాని చేతిబిడ్డ అయి ఎదిగింది.

**వ్యాస సమీక్ష-మధునాపంతులవారు**

మధునాపంతులవారన్నట్లు 'నైక విధాంశములపై వ్యాసవిహారము జరిగిన కాల' మే ఇరవయ్యో శతాబ్దం. 'పదవివేకము, వాక్యవిధులు, కావ్యప్రకారములు ఆకళించుకొని వైపువాటములెటిగి తీరుదీయములు తెలిసి జాజి తీగలుగా మల్లె పందిళ్ళుగా సహృదయుల చేతోవీధులలో అల్లుకొన్న వ్యాసములకు ప్రసవకాలమది' అన్నారువారు. వాస్తవానికి వ్యాసాన్ని గూర్చిన వారి యీ వ్యాసమే ఒక వచన

కళాఖండ మనదగినది. ఈ శతాబ్దిలోని వ్యాసాభ్యుదయాన్ని వారు 'పంచదశి'గా పరికించి సహేతుకంగా సంభావించినారు. తొలిదశకంలో వివిధ వ్యాసాలు, అనువాదవ్యాసాలు, బహువిషయకములగు చమత్కార వ్యాసములు వచ్చినవన్నా రాయన. రెండోదశకంలో వక్రోక్తులతో వ్యంగ్యాలతో శైలీ శిల్పసంబంధమైన గడుసుదనాన్ని నేర్చుకొన్నది వ్యాసమన్నారు. ఆకృతిచే వామనమైనా ఆలోచనచే త్రివిక్రమమైనదీ దశలో వ్యాసం. చదివించే గుణముండి విచికిత్సగొలిపే శీర్షికలుండడం; వ్యాసాలకు ప్రతివ్యాసాలురావడం; వ్యాసాలలో వ్యావహారిక భాష చోటు చేసుకోవడం; స్త్రీ వ్యాసం సామాజిక వ్యాసంగా పరిణమించడం ఈ దశావిశేష మన్నారు మధునా పంతులవారు. ప్రాచీనాచారాలు కొన్నింటికి ప్రత్యూహకాలము. నవీన సంప్రదాయములు పెక్కింటికి ప్రత్యూషకాలము అయిన ఈ శతాబ్ది మూడో దశకంలో వ్యాసరంగంలోనూ వినూత్న భావవిన్యాసవిలాసాలు వచ్చినవంటూ వ్యాస ప్రపంచమున విజ్ఞాన చంద్రికలు వెల్లివిరిసిన శరత్సమయమది. యక్షగానాలమీద, ఎంకి పాటలమీద సంగీతాదిలలిత కళల మీద వచ్చిన వ్యాసాల వంటి పరిశోధన వ్యాసాలు; నవ్యసాహిత్య వికాసాన్ని సమీక్షించే వ్యాసాలు; ప్రతిక్షేప వ్యాసాలు; కవిత్వతత్వ విచారాలు. ఆంగ్లవంగాది భాషల నుండి వచ్చిన అనూదిత వ్యాసాలు; చారిత్రకవ్యాసాలు; అధిక్షేపహాస్యవ్యాసాలు; గ్రంథపీఠికా రూపాన వచ్చిన వ్యాసాలు; చారిత్రక వ్యాసాలు; ఈ దశకంలోని ప్రధాన వ్యాసాలన్నా రాయన. నాల్గవ దశకంలో పత్రికలు, రచనలు పలచబడి వ్యాసాభాసాలనదగినవి చాలానేవచ్చి వ్యాసవీధుల్లో.... గారి నడకలు తెరవాటులు గొట్టడాలు సాగినా వ్యాస రాజాలు సువిస్తృతోపన్యాసాలు, ప్రత్యేక సంచికా వ్యాసాలు, వ్యాస సంకలనాలు పుష్కలంగా వచ్చినవన్నమాట సత్యదూరంకాదు. వాక్యార్థ శిల్పంతోపాటు సంగీతపు సొంపు నింపుకొన్నవి, నిర్మాణాన్నిబట్టి ధ్వని కావ్యములనదగినవి, సారస్వత వేదికలై వెలుగొందినవి, వక్రోక్తి భాసురములైనవి, సమీక్షాత్మకములైనవి అనేకములు వచ్చినవన్నారువారు. ఐదోపది భావసమన్వయ యుగం. కథలుగాథలుగా సాగి ఈ యుగంలో వ్యాసం విశ్వజీవనము, విశ్వతోముఖము అయిన సమన్వయాన్ని సాధించింది. ఇలా వ్యాస ప్రక్రియా వైవిధ్యాన్ని పరిణామ దృష్టితో చూచినపుడు ఆయా రచనారీతుల్లో ప్రసిద్ధికెక్కినవారి పేర్లన్నీ చదువరులకు వారివారి అభిరుచులనుబట్టి స్ఫురించకపోవు. స్ఫురణాల సత్వాన్నీ వ్యాసవిస్తరభీరుత్వాన్ని ఎంత అడ్డుపెట్టుకొన్నా ఎట్టివారికైనా కొన్ని పేర్లు చెప్పే

సరికి మరికొన్ని సందర్భాల్లో చెప్పవలసిన పేర్లన్నీ చెప్పలేదన్న తప్పిదాన్ని తప్పించుకొనే అవకాశముండదు. అందుకే ఇందులో ప్రక్రియా వైవిధ్యాన్నే కొన్ని పేర్లను స్మరించడంలేదు. స్వాతంత్ర్య సిద్ధినాటికే వ్యాసం వైవిధ్యాన్ని సంతరించు కొన్నా పత్రికల వ్యాప్తివలన వ్యాసం పల్చబడినదనడం సత్యదూరం కాదు. పత్రికల వ్యాప్తివలన "Journalism gains as much as litcrature looses" అన్న సూక్తి నిక్కడ తిరిగీ స్మరించడమనవసరమైనా ఈ శతాబ్దిలో స్వాతంత్ర్యానంతరకాల ఖండం ప్రధానంగా గద్య వాఙ్మయాభివృద్ధికి అందులోనూ వ్యాసవాఙ్మయ వికాసానికీ అంకితమైన దనడంలో సందేహంలేదు. ఈ విషయంలో పత్రికలు ప్రధాన పాత్రవహిస్తున్నవి. కనుక ఈ యుగాన్ని పత్రికావ్యాస యుగం II గా భావించడం ఉచితం.

## పత్రికావ్యాసయుగం-వికాసం-వైవిధ్యం

పత్రికావ్యాసయుగం II-ఈ శతాబ్ది ద్వితీయార్ధంలో వ్యాసం మరింత వైవిధ్యాన్ని సంతరించుకొన్నది. దానికి పత్రికల పెరుగుదల, వాటి మూలంగా పెరిగిన రచయితల రచయిత్రుల సంఖ్య, వారి రచనలలోను పత్రకారుల (Journalists) నిత్యరచనా వ్యాసంగంలోనూ అనివార్యంగా గోచరించే ఆరోగ్య కరమైన స్పర్థ ఇవన్నీ హేతువులు. వీటితోపాటు సాంకేతిక విజ్ఞానం పెరగడంతో రేడియో, టి.వీ, ఆడియోవీడియో పరికరాలు, ఆధునిక ముద్రణ యంత్రాలు. కంప్యూటర్లు మొదలైనవి అందుబాటులోకి రావడం మూలంగా సాధ్యమౌతున్న ప్రపంచ పరిజ్ఞానంలోని భావరచనావిప్లవం కూడా వ్యాస రచనకు మరింత విస్తృతిని వైవిధ్యాన్ని పుష్టిని కూరుస్తున్నది. ప్రసంగాలు, వ్యాసరచనలు అధికమై వందలకొద్దీ వస్తున్న వ్యాససంకలనాలు; ప్రత్యేక విషయాలమీద సాగిన గోష్ఠులు, సదస్సులు, సమావేశాలు ముగిసిన వెనుక ముద్రింపబడే ప్రత్యేక పత్ర రచనలు గల సంపుటాలు; స్మారక సంచికలు; ప్రత్యేక సంచికలు; వాటి ఉపోద్ఘాతాలు; పీఠికలు; దిన, వార, మాస, పత్రికలు, సారస్వతానుబంధ పత్రికలు; వాటిల్లోని ఇష్టాగోష్ఠులు, కలగూర గంపలు, పిచ్చాపాటీ, మాటా మంతీ, అవీఇవీ. స్వగతాలు, ఊహాగానాలు, మొదలైన ప్రత్యేక శీర్షికలు; సమీక్షలు, సంపాదకీయాలు, వడగళ్ళు, వినాయకుని వీణలు, భావవీణలు, మాణిక్యవీణలు, వ్యంగ్యరచనలు, అంతరంగ మథనాలు, ఉబుసుపోకలు, ఊరిభావి ముచ్చట్లు వార్తావ్యాసాలు, ముఖాముఖీలు, మ్యూజింగ్స్, లేఖలు, ఆడియో వీడియో పాఠాలు,

ప్రత్యేక ప్రసారాలు, వ్యాఖ్యానాలు, వార్తాసమీక్షలు, అనువాదాలు, వివాదాలు, విమర్శలు, పునర్విమర్శలు.... మొదలైన వచన రచనా విశేషాలెన్నో వస్తున్నవి అలాగే రచనల్లో వస్తువైవిధ్యమూ పెరిగింది. భాష మొదలుకొని దిగంబర కవిత్వం దాకా; సువిధి పూర్వక విద్యా ప్రసంగాలు మొదలుకొని వయోజన విద్య కుపకరించే రాత్రిబళ్ళ దాకా, అద్వైతం మొదలుకొని అణువిచ్ఛేదం దాకా, పండగల మీద పశుపక్షిజాతుల మీదా, లలితకళలు మొదలుకొని శాస్త్ర సాంకేతిక విజ్ఞాన వీధులదాకా, జానపద విజ్ఞానం మొదలుకొని గిరిజన విజ్ఞానందాకా, రాజకీయాలు మొదలుకొని రచ్చబండ వివాదాలదాకా నేటి పత్రికారచనలో రాని విషయమంటూ ఉండటంలేదు. దీనిమూలంగా పాఠకుల అభిరుచీ విజ్ఞాన స్థాయీ పెరుగుతోంది. దానికనుగుణంగా రచనాస్థాయీ అనివార్యంగా కొంత పెరుగుతోంది. అనుకోకుండా కొంత దిగజారుతూనూ వుంది. ఇది ఒక్క వ్యాస విషయంలోనే కాదు పత్రికలు పోషిస్తున్న సర్వ సాహిత్య ప్రక్రియల్లోనూ స్థాయి ఇలా పల్చబడుతున్నదని విమర్శకులందరూ అనుకొంటున్న మాటే.

ఈ శతాబ్ది ఉత్తరార్థంలోని వ్యాస విస్తృతిని విశ్లేషిస్తూ డా॥ కొలకలూరి ఇనాక్ సృజన వ్యాసమనీ విమర్శ వ్యాసమనీ రెండు విభాగాలుగా పరిశోధించారు. సృజన వ్యాసాన్ని నవ్యయుగ వ్యాసమనీ, స్త్రీ వ్యాసమనీ, పత్రికా వ్యాసమనీ వివిధ వ్యాసమనీ వింగడించి నట్టే విమర్శ వ్యాసాన్ని కావ్య తత్త్వ, కావ్యాత్మ కావ్యగుణ, కవ్యాత్మ, కావ్యచరిత్ర, జీవిత చరిత్ర, భాషా, అన్యభాషా, అనువాద, పీఠికా, వేదాంత, వైజ్ఞానిక, రాజకీయ, ఆర్థిక పరిశోధన వ్యాసాలుగా పదిహేను విభాగాలలో వింగడించి చూపారు. వీరి యీ విమర్శ-సృజన వ్యాస విశ్లేషణ Shipley చూపిన వ్యాస రేఖలోని **Intelletual - Intutive types** తోనూ, **Formal - informal styles** తోనూ, **objective - subjective treatment** తోనూ తుల దూచ దగినదే. అయినా వీటిలో చాలా వాటికి పత్రికలే ప్రధాన రంగాలు కావడం వలన వ్యాస పరిణామంలో ఈ కాలఖండాన్ని నేను పత్రికా వ్యాస యుగం II అనే పేర్కొని వ్యాస వస్తువులోని ప్రక్రియా ధర్మాన్ని వ్యాస వస్తువును బట్టి రెండు విధాలుగా పరిశీలించాను. ఇది వ్యాసరేఖ నాశ్రయించుకొని సాగే నిలువు అంతరాలకు (**Verticality**)కి సంబంధించినది. రచనా ధర్మానికి వస్తు నిర్మాణానికి సంబంధించిన వింగడింపు వ్యాస రేఖలోని సమతల (**Ho-**

rizontal) సంచారానికి సంబంధించినది. వ్యాస రేఖ ఈనాడు సమతల ఊర్ధ్వ నిమ్న సంచారాగతులతో అనేక విధాల విస్తరిస్తున్నది. ఉత్తమ ఆదర్శ వ్యాసమన్నది సమతలంలో వ్యాస రేఖ నడుమ నెలకొని కదలిక లేనట్లు గోచరించినా ఊర్ధ్వ నిమ్న గతులలో అనంత వైవిధ్యాన్ని సంతరించు కొంటున్నది.

## నిర్వచనాలకందక ఎదిగి పోతున్న వ్యాసం

అలనాటి వాక్య గ్రంథములు మొదలు కొని ఈనాటి వ్యాస సంకలనాల దాకా వచ్చిన తెలుగు వ్యాసాలను సమీక్షిస్తూ రాయసం వెంకట శివుడు గారి నుండి తిరుమల రామ చంద్ర గారి వరకు వ్యాసాలను గూర్చి వ్యాసాలు వ్రాసినవారు చాలా మందేవున్నారు. వ్యాసం మీద వారి ఆ వ్యాసాల వరుసలోనే ఇదీ మరొకటి! ఎప్పుడూ ఎవరో ఒకరు ఏదో ఒక కొత్త విషయం వ్యాసాన్ని గురించి చెబుతూనే వున్న వ్యాసాన్ని గురించి నిజంగా మనకు తెలిసింది చాలా కొంచెమే సుమా అన్నంత వింతగా కొత్తగా వ్యాసం ఎప్పటికప్పుడు ఎదిగిపోతూనే వున్నది!!

### ఉపయుక్త గ్రంథాలు - రచనలు


1. An introduction to the study of Literature — W. H. Hudson
2. The English Essay - H. Walker
3. Dictionary of World Literary terms - Joseph T. Stripley
4. Current Literary terms - A. P. Scott
5. Writing with Power - Peter Elbow
6. The Anatomy of Prose - Miss M. Boulton
7. ఆంధ్ర వచన వాఙ్మయము - నిడుదవోలు వెంకటరావు
8. తెలుగు వ్యాసము - నూరు సంవత్సరాలు - ఆంధ్రప్రదేశ్ అకాడమీ
9. తెలుగు వ్యాస పరిణామము - కొలకలూరి ఇనాక్
10. తెలుగు వచన వికాసము - M. కులశేఖరరావు
11. ఇతర వ్యాసాలు.

# నాటిక

(ఏకాంకిక)

డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి

ప్రపంచంలో పలు ప్రాంతాలలో నాగరకతా గంధమేలేని కాలంలో సమాహార కళ అయిన రూపకాన్ని రూపొందించి, లక్షణశాస్త్రాన్ని నిర్మించి, సర్వసృష్టి కర్త అయిన భగవంతుణ్ణే జగన్నాటక సూత్రధారిగా భావించిన కళామనస్వులు భారతీయులకు అభివందనాలు.

అప్పుడెప్పుడో క్రీస్తుకు పూర్వం భరతముని నాట్యశాస్త్ర రచన చేసినాడు, అందులో ఆయనచేసిన సూత్రకల్పన నేటికీ నాటకకళాసంప్రదాయానికీ, అభినయానికీ సంబంధించినదే అయినా రానురాను అది సర్వతోముఖంగావికసించిన సాహిత్యశాస్త్రానికి ప్రాతిపదికకాగలిగింది. చతుర్విధాభినయాలు నాట్యస్వరూపానికి అనివార్యాంశాలు. భరతుని మతం ప్రకారం నాట్యం విస్తృతమైన అర్థాన్ని పొదుగుకున్న సంకేత పదం. భరతుడే వస్తు, నాయక, రస, అంక సంఖ్యల ఆధారంగా పదివిధాలుగా రూపకాలను వింగడించినాడు[1] రూపకం అంటే ఒక విధమైన నాట్యమే. రూపకం అంటే రామాదుల రూపాన్ని ధరించి సాభినయంగా ఇతివృత్తాన్ని ప్రదర్శించడం. అంత ప్రాచీన కాలంలో కూడా వింగడింపులో నిత్యనూతన వికాసానికి అవకాశం కల్పించడం భరతుని హృదయ వైశాల్యాన్ని, కళావైదగ్ధ్యాన్ని, సాంఘిక ప్రయోజనాన్ని, సుసంస్కృత హృదయాన్ని సువ్యక్తం చేస్తున్నది. అప్పటికే ప్రఖ్యాత పురాణేతిహాసాల ఇతివృత్తాలకేకాక కల్పిత ఇతివృత్తాలకూ, బహుళ ప్రచారంలో ఉన్న ఇతివృత్తాలలో కొన్నికల్పనలు చేసి మిశ్ర పద్ధతికి అతడు వీలు కల్పించినాడు అతడు వింగడించిన పది రకాలైన రూపకాలలో నాటకం కూడా ఒకటి వస్తునాయక, రసాది అంశాలలో

1. నాటకము, ప్రకరణము సమవాకారము, ఈహామృగము డిమము, వ్యాయోగము, అంకము, ప్రహసనము భాణము, వీథి.

వైశిష్ట్యం ఉన్న కారణాన అపది రూపకాలలో నాటకానికే ప్రాముఖ్యం హెచ్చుతూ వచ్చింది. రానురాను రూపకానికే నాటకం అన్న ప్రత్యామ్నాయం ఏర్పడింది. సమానార్థకమైంది, నాటక రచనలో సిద్ధవస్తులైన కథలు అప్రక్రియకు ఎనలేని ప్రాముఖ్యాన్ని సతరించి పెట్టినారు. రామాయణ భారతాలు రచించిన వాల్మీకి వ్యాసుల తరువాత నాటక కర్తలైన కవులకే సహృదయ సమాజంలో ఆదరం లభించింది. సాహిత్యంలో నిష్ణాతుల కావాలనుకున్న వారంతా దృశ్యకావ్యం అంటే నాటకాన్ని అవలోడించ వలసిందే. పరిశీలించ వలసిందే., అధ్యయనం చేయవల సిందే. అందుకే "నాటకాంతంహి సాహిత్యం" అన్న అభియుక్తోక్తికి సాహిత్య లోకంలో చెల్లుబాటు కలుగుతూ వచ్చింది.

అతి ప్రాచీనకాలం నుంచి భారతదేశంలో నాటకరచన జరుగుతూ ఉన్నా నాటకప్రయోగం జరుగుతున్నా, ఏ కారణం చేతనో మరి, రానురాను అంటే పన్నెండవ శతాబ్దం తరువాత దాని వికసనం ఆగిపోయింది సంస్కృత భాషా ప్రయోగం సమాజంలో కొన్ని వర్గాల వారికే పరిమితం అయ్యింది. జన సామా న్యంలో అనేక ప్రాకృత భాషలు అనాది నుంచే ప్రచారంలో ఉండేవి ఈ యాథా ర్థ్యాన్ని సంస్కృత నాటకకర్తలు గుర్తించి తమ నాటకాలలో స్త్రీలకూ, సామాన్యు లకూ ప్రాకృత భాషలనే ప్రయోగించుకున్నారు. ప్రాకృతులు అలటే ప్రజలు. కనుక ప్రాకృత భాషలని తాత్పర్యం. సంస్కృత నాటకాలలో కొన్ని పాత్రలకే పరిమితమైన ప్రాకృత భాషలు ప్రజా బాహళ్యానికి మాత్రం చాలా సన్నిహిత మైనవి. ప్రాకృత భాషలు అపభ్రంశాలు గానూ నేటి దేశభాషలుగానూ రూపుదిద్దు కున్నవి. అయితే ఈ దేశభాషల్లో సంస్కృతంలో వలె నాటకాలేవీ తెలుపడలేదు. అభిరుచి ఉన్నవాళ్లు విశేషించి సంస్కృత భాషా పరిజ్ఞానం కలవాళ్లు సంస్కృత నాటక ప్రయోగాలనే చూసి ఆనందించే వారు. ఆ ప్రయోగాలు కూడా చాలా సకృత్తుగానే జరుగుతూ ఉండేవి. విద్యత్సభలలో, రాజాస్థానాలలో, కలవారిలో గిళ్లలో జరుగుతూ ఉండేవి. జనసామాన్యంలో అభినయ, సంగీత ప్రధానమైన కళా రూపాలు కొన్ని ప్రాచుర్యాన్ని అందుకున్నవి.

నాటిక లేక ఏకాంకిను గూర్చి ఈవేళ నేను ప్రసంగించవలసి ఉన్నది. అయితే తెలుగునాట నాటకా విర్భావాన్ని ఈ పట్టున తెలుపడం అప్రస్తుతం కాదను కుంటాను.

ఆదికవి నన్నయ్య, ఆదిగాగల ప్రాచీనాంధ్ర మహాకవులందరూ సంస్కృత భాషా సాహిత్యాలను తలస్పర్శిగా మథించిన మనీషులు. సంస్కృతంలోని సాహిత్య ప్రక్రియలతో చక్కని పరిచయం ఉన్నవారు. ఇంచుమించు సంస్కృత సాహిత్యంలోని ప్రక్రియలన్నింటినీ తెలుగులోకి తెచ్చిన వారు. కాని నాటకం యథాతథంగా తెలుగులోకి రాలేదు. సంస్కృత నాటకాలు తెలుగులో ప్రబంధాలుగా రూపు దిద్దుకున్నవి, శృంగార శాకుంతలం ప్రబోధచంద్రోదయం వంటివి. ప్రాయికంగా సంస్కృత నాటకాలన్నింటిలోనూ ప్రాకృతభాషాప్రయోగం అనివార్యంగా ఉంటూ ఉన్నది. సంస్కృతానికి తెలుగు వేషం వేస్తే, మరి ప్రాకృతానికి ఏ వేషం వెయ్యాలి? అన్న విచికిత్స వారికి ఎదురై ఉంటుందనీ, అప్పట్లో ప్రాకృతానికి బదులుగా ఏ భాష వాడాలో నిర్ణయించలేక తెలుగు కవులు నాటకాలను శ్రవ్య కావ్యాలుగా తెలుగు చేసి ఉంటారని వాఙ్మయ దివాకరులు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు[1] తమ గ్రంధములలో అభిప్రాయ పడినారు. అయితే తెలుగులో అభినయ ప్రధానమైన యక్షగానం వంటి రూపక విశేషాలను సామాన్య ప్రజలు సృష్టించుకుని సంబర పడ్డారు. ఆ యక్షగానాలే జన బాహుళ్యంలో అశేష ప్రాచుర్యాన్ని అందుకున్న తరువాత పండితులు కూడా తమ పాండిత్యంతో యక్షగానాలను అలంకరించి ప్రామాణిక సాహిత్య ప్రక్రియగా రూపొందించినారు. పదహారవ శతాబ్దానికి చెందిన బొడ్డుచర్ల తిమ్మయకవి రాసిన నాట్య ప్రబంధము[2] అనే అపురూప కావ్యాన్ని రచించినాడు. ఇది శ్రవ్య కావ్యమే అయినా దృశ్య కావ్య ప్రయోగాల లక్షణాలు కనిపిస్తాయి. దృశ్య శ్రవ్య కావ్యాలకు ఈ కావ్యం వంతెన వంటిదనటంలో తప్పులేదు. తిమ్మయకవి ప్రవేశపెట్టి ఈ సరికొత్త పద్ధతికి ఏ కారణం చేతనో ప్రాచుర్యం కలుగలేదు. ఆ తరువాత ప్రజా బాహుళ్యం యక్షగానం పట్లనే ఎక్కువ మక్కువ చూపుతూ వచ్చింది. యక్షగానంలో చతుర్విధాభినయాలూ పురాణ గాథలూ, సంస్కృత నాటకాల్లో అరుదుగా కనిపించే హాస్యరసం కూ జన ప్రియత్వానికి కారణాలని చెప్పవచ్చు.

---

1. I ఆంధ్ర నాటక పితామహుడు. రచన - 1987 ముద్రణ - 1974
II ఆంధ్ర వాఙ్మయ చరిత్రము.

2. ప్రచురణ ఆంధ్ర రచయితల సంఘం సంపాదకుడు ఆచార్య బి. రామరాజు 1962.

ఇన్నివేల యేండ్ల చరిత్ర ఉన్నా ఇంత నాటక సాహిత్య సంపద ఉన్నా నాటక కళ మన భారతదేశంలో మరుగున పడిపోయింది. ఇంచు మించు యావద్భారతాన్ని కలవరపరచిన ఇస్లాం అధికార ప్రాబల్యం, భారతేతరమైన సంస్కృతిని ప్రచారం చెయ్యాలనే ముస్లిం పరిపాలకుల దురాగ్రహం వల్ల ఒక్క నాటకమే కాదు పురా భారతీయ సాహిత్యమంతా అస్తంగమితమైనది. గత శతాబ్దం ఉత్తరార్థంలో ఆంగ్లేయుల పరిపాలన భారతదేశంలో బాగా పాతుకొని పోయిన తరువాత భారతీయుల జీవితంలో క్రొంగొత్తతీరులు అనేకం పొటమరించినవి ఇంగ్లీషు భాషా బోధనం, అభ్యసనం భారతీయులకు నిఖిల ప్రపంచాన్ని చూసే గవాక్షాలైనవి. ఐరోపా ఖండంలోని సాహిత్య మర్యాదలతో పరిచయం కలిగిన తరువాత భారతీయులలో కొత్త కొత్త ఆలోచనలు పుట్టుకొచ్చినవి. అంతకు పూర్వంలో లేని సాహిత్య ప్రక్రియలకు అంకురార్పణ జరిగింది. ఆంగ్లేయ పండితులు కొందరు దేశ భాషలను నేర్చుకొని చెదలపాలవుతున్న గ్రంథాలను వెలికితీసి, అచ్చువేసి ఆకారాది నిఘంటువులను సృజించి, వచన వాఙ్మయానికి విస్తృతి కలిగించి, సాహిత్యేతరమైన అంశాలను వివరించడానికి యోగ్యమైన భాషలను రూపొందించి ఎనలేని కృషి చేసినారు. దాదాపు 250 సంవత్సరాల నుంచి ఇంగ్లీషు భాషా సంస్కృతులతో తెలుగువారికి సంబంధం ఏర్పడింది. రాజకీయ ప్రాబల్యం దీనికి ప్రధాన కారణమే అయినా సాంఘికంగా, భాషాపరంగా సాహిత్యాత్మకంగా ఇంగ్లీషు ప్రభావం వల్ల తెలుగు భాషా సాహిత్యాలు కొత్త మెరుగులు చిమ్మినవి. ఇంగ్లీషు ద్వారా విశ్వాన్నీ, విశ్వ సాహిత్యాన్నీ, విశేషించి పాశ్చాత్య భావ ప్రపంచాన్ని తెలుగు ప్రజ్ఞా చక్షువు సందర్శించ గలిగింది. పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్థంలో పాశ్చాత్య నాటక పద్ధతులను కొంత వరకు అనుకరించే నాటక సమాజాలు కర్ణాటక మహారాష్ట్ర ప్రాంతాల నుంచి వచ్చి అనేక ప్రదర్శనలతో వివిధ నగరాల్లో తెలుగు రసికులను అలరించి తెలుగు సాహిత్యకులలో కొత్త ఆలోచనలకు నారు పోసినవి. అప్పుడెప్పుడో భారతదేశంలో ప్రాచుర్యాన్ని అందుకున్న నాటక సాహిత్యం తెలుగులోకి మళ్లీ వచ్చింది. సంస్కృత నాటకాలకు అనువాదాలు వచ్చినవి. ఇంగ్లీషు నాటకాలకు అనువాదాలు వచ్చినవి. భారతీయ నాటక సాహిత్యంలో సకృత్తుగా ఉన్న విషాదాంత నాటకాలూ, కాల్పనికేతి వృత్త నాటకాలూ, పాత్రోచిత భాషా ప్రయోగాలు అనేకం వెలువడినవి.

ఇరవయ్యో శతాబ్దం తొలి మూడు దశకాలలో నాటక సాహిత్యం మంచి వికాసాన్ని పొందింది. గంధర్వాంశ సంభూతులైన నటీనటులెందరో ప్రజా హృదయాలను చూరగొన్నారు. వేల సంఖ్యలో నాటకాలు వచ్చినవి. పౌరాణిక, సాంఘిక, చారిత్రాత్మక ఇతి వృత్తాలు ఉన్న నాటకాలు, సమకాలీన సమస్యలను వాచ్యంగానో, సూచ్యంగానో స్పృశించి యుగోచితమర్యాదలను సంతరించుకొన్నవి. పద్యానికి పాటకూ ఈ నాటకాల్లో ఎంతో విలువ ఉండేది. సంగీతాత్మకంగా 'వెలువడిన నాటకాలలోని పద్యాలూ, గీతాలు ప్రజా హృదయాల్లోనే కాదు జిహ్వాగ్రాలపై నాట్యమాడినవి,

కడచిన నలుబది సంవత్సరాల నుంచి నాటక రచనలోనూ, ప్రయోగంలోనూ కొత్త మలుపులు వచ్చినవి. సుదీర్ఘమైన కావ్యాలకంటె. ఖండ కావ్యాలు ప్రజాదరణకు పాత్రమైనట్లే అయిదారు గంటల పాటు ప్రయోగించే నాటకం కంటే అరగంట లేక ముప్పావు గంటలో ప్రయోగించే దృశ్య కావ్యాల పట్ల ప్రజలు మొగ్గు చూపడం వల్ల రచయితలు కొద్ది సమయంలోనే ప్రయోగించడానికి వీలైన నాటికలను రచించటం ప్రారంభించినారు. చిన్నదిగా ఉండడం వల్ల తొలి రోజుల్లో నాటిక అన్న పేరు ఈ చిన్న నాటకాలకు ఉండేది. ఇప్పటికీ ఉంది. ఈ రోజులలో నాటిక అనే మాట అంతగా ఉపయోగించబడక పోవడానికి కారణం నాటిక కున్న చరిత్ర. సంస్కృత సాహిత్యంలో నాటిక అనే ఒక రూపక విశేషం ఉంది. ఇందులో నాలుగంకాలు ఉంటాయి. నాయకుడు ధీరలలితుడు అంటే నృత్యగానవినోదాల్లో కాలంగడిపే వాడు శృంగారం ప్రధాన రసంగా ఉంటుంది. స్త్రీ పాత్రలకు ప్రమేయం ఎక్కువ నాటకం కంటే విస్తృతిలో చిన్నది. కాని ఇప్పుడు మనకున్న నాటికలకు ఈ లక్షణం సరిపోదు. ఇప్పుడున్న నాటికాలకుకూడా ఆనాటి లక్షణాలు సరిపోవు. ఇప్పుడు రచనలోనూ, ప్రయోగంలోనూ పాశ్చాత్య ప్రభావం సమధికంగా కనబడుతున్నది. ప్రాచీన సంస్కృత నాటకాల్లో రూపకేతి వృత్తం అనేక అంకాల్లో ఉండేది. 5,7,12 అంకాలు నాటకంలో ఉండేవి. దశవిధ రూపకాలలో వ్యాయోగం, అంకము, ప్రహసనం, భాణం, వీధి అనేవి ఏకాంక పరిమితాలు. ఇవిగాక సంగీత నృత్య ప్రధానములైన డోంబి, దుర్మల్లిక, పుష్ప గండిక నాటిక తోటకం, గోష్ఠి, సట్టకం, నాట్యరాసకం, ప్రస్తానకం, ఉల్లాప్యం, కావ్యం, ప్రేంఖణం, రాసకం, సంతాపకము, శ్రీగదితం, శిల్పకం, విలాసిక, ప్రకరణిక, హల్లీసకం,

భాణి అనే ఉపరూపకాలు కూడా ఏకాంకికలే. అయితే అలనాడు ఒక అంకంలో ఒక రోజు జరిగిన కథను మాత్రమే ప్రయోగించాలనే నియమం ఉండేది. ఆ దృష్టితో మలచ బడ్డవే ఆనాటి ఏకాంకికలు. అయితే వాటిని ఆ రోజుల్లో ఏకాంకిలని ఏకారణం చేతనో అనలేదు. భరతముని వివరించిన నాటికకూ, ఈనాడు నాటికగా వ్యవహరింపబడుతున్న దానికి ఏమీ సంబంధం లేదు. నాటి నాటికా లక్షణాలు నేటి నాటికా లక్షణాలతో సమన్వయించవు. అందుకే ఈనాటి ఏకాంకికలు, నాటికలు పాశ్చాత్య సాహిత్య ప్రభావంతో వచ్చినవని నిష్కర్షగా చెప్పవచ్చు. అయితే ఇక్కడ ఒక విషయం స్పష్టంగా తెలుసుకోవాలె. ఏకాంకికలు లేక నాటికలు భారతీయులకు కొత్తవేమీ కావు కొన్ని చారిత్రక కారణాలవల్ల అవి మరుగున పడినవేకాని కేవలం పాశ్చాత్య ప్రభావం వల్ల ఈ ప్రక్రియ పుట్టుకొచ్చిందని మనం స్థూలంగా నమ్మడానికి వీలులేదు. ఇంగ్లీషుతో సంపర్కం కలిగిన తరువాత ఎప్పుడో మృగ్యమైపోయిన ఏకాంకిలు మళ్లీ అలనాటి నాటికాబీజం నుంచి పుట్టుకొచ్చి వినూత్న పాశ్చాత్య దోహద ప్రక్రియలతో కొత్తపూలు పూచే సరికొత్త తీగగా నవనవలాడుతూ మనలను ఇప్పుడు అలరిస్తున్నది. అయితే నేటి కాలంతో తెలుగులో వెలువడుతున్న ఏకాంకిల రచయితలు ప్రాచీన కాలంనాటి సంస్కారంతోనే వ్రాసినారని కూడా చెప్పలేము. ఇప్పటి ఏకాంకిలపైన పాశ్చాత్య ప్రభావం ఉన్న దన్నమాట వాస్తవమే. కాని ఈ ప్రక్రియ భారతదేశంలో ఎన్నడూ లేదని పాశ్చాత్యులే ఈ నాటికా బీజాలను ఇక్కడ నాటినారన్న మాట పూర్తిగా యథార్థంకాదని చెప్పవచ్చు.

నాటిక, ఏకాంకిక పర్యాయ వాచకాలుగానే ఇప్పుడు మనం ఉపయోగిస్తున్నాము. ONE ACT PLAY అన్న ఇంగ్లీషు పదానికి ఏకాంకిక అన్న తెలుగు మాట పూర్తిగా సరిపోవడం వల్ల ఏకాంకిక అన్న పేరుకే చెల్లుబాటు ఎక్కువైంది

నాటకాన్ని సంక్షిప్తం చేసినంత మాత్రాన నాటిక అనిపించుకోదు. నాటకం ఎంత ప్రత్యేకమైందో నాటిక అంతే ప్రత్యేకమైనది. నిజానికి ఏకాంకికారచన నాటికా రచన కంటే కష్టతరమని అనడానికి ఎక్కువగా సందేహించవలసిన అవసరం లేదు. మంచి నాటకం వ్రాయగలిగిన వాడు మంచి నాటికను కూడా వ్రాయగలుగుతాడను కోవడం పొరపాటు. కాకపోతే తొందరపాటు.

పురా భారతీయులు రూపకాలలోని అంకానికి సమకూర్చిన లక్షణాలు ఈ నాటి ఏకాంకికకు సరిపోవడం ఆశ్చర్యకరమైన విషయం కనుకనే ఏకాంకికలు మొన్న మన దేశంలో ఉన్నవి. నిన్న లేవు. నేడు మళ్ళీ వచ్చినవని అనుకోవలసి వస్తుంది. భారతీయులు రూపకంలోని భాగమైన అంకంలో ఒకనాటి కథే ఉండా లనీ, ఉప కథలుండ కూడదనీ, స్థలంలో మార్పు ఉండకూడదనీ, పెక్కు పాత్ర లుండ కూడదనీ, నాయకుడుండి తీరాలని లక్షణాలు ఏర్పరచినారు. తెలుగులో వీరేశలింగం పంతులుగారి కాలంలో వచ్చిన ప్రహసనాలన్నీ నాటికలనే చెప్పవచ్చు

కొన్ని సందర్భాలలో నాటిక లేక ఏకాంకికలో రెండు మూడు రంగాలు (scenes) ఉంటాయి. ఇలా ఉంటే ఏకాంకిక అవుతుందా? పాశ్చాత్యులు మన ప్రాచీన నాటక లక్షణ కర్తలవలె కాక అంకంలో రంగ వైవిధ్యాన్ని ఒప్పుకుంటారు కనుక వారి దృష్టిలో రంగాలు అనేకం ఉన్నా అది ఏకాంకికగానే గుర్తింప బడు తుంది. అయితే వాళ్ళ ఏకాంకికలన్నిటిలో రంగ వైవిధ్యం ఉంటుందని అనుకోవ డానికి వీలులేదు.

అద్యతన కాలంలో విశేష ప్రాచుర్యాన్ని అందుకున్న సాహిత్య ప్రక్రియల్లో ఏకాంకిక ఒక్కటి.

దశవిధ రూపకాలంలో వ్యాయోగం, భాణం అంకం వీధి అనే నాలుగు రూప కాలు ఏకాంక సిమితాలు. సాహిత్య దర్పణంలో—

"ఖ్యాతేతి వృత్తో వ్యాయోగః
ఖ్యాతోద్ధత నరాశ్రయః

అస్త్రీ నిమిత్త సంగ్రమో జామదగ్న్యే జయేయథా పకాహ చరితాకాంకః అంటే వ్యాయోగం అనే రూపక విశేషంలో ఒకే ఒక అంకం ఉంటుంది.

"భాణస్తు ధూర్త చరితం
స్వానుభూతి పరేణవా
యత్రోప వర్ణయదేకో సంబోధనోక్తి
ప్రత్యుక్తీ కుర్యాదా కాశ భాషితైః"

ధూర్త చరితం ఇతి వృత్తం కలిగిన ఏకాంక పరిమితం కల రూపకం భాణం.

"ఉత్కృష్టి కాంకే వృత్తం ప్రఖ్యాతం
వృత్తంబుద్ధ్వా ప్రపంచమేత్
............నేతారం ప్రాహ్యతానరాః"

అంకం అనే రూపక విశేషం కూడా ఏకాంక పరిమితమే. సామాన్యుడు ఇందులో నాయకుడుగా ఉంటాడు.

"ఏవం వీధీ విధాత వ్యాద్వ్యేక పాత్ర ప్రయోజితా"

ఒకటి రెండు పాత్రల చేత ప్రయోగించబడే రూపకం వీధి.

ఈ విధంగా రసం. పాత్రల సంఖ్య. పాత్రల స్థాయి, స్త్రీ పాత్రలు లేక పోవడం లాంటి వివరాలు ఈ ఏకాంక పరిమిత రూపకాలకు లక్షణాలు. అయితే ఈనాడు ప్రచారంలో ఉన్న ఏకాంకికలకు ఆ లక్షణాలేవి సరిపోవడం లేదు. స్వల్పావధిక ప్రక్రియలు పాశ్చాత్యుల్లో ఎక్కువ ప్రాచుర్యాన్ని పొందుతూ ఉండ టం చేత పెద్దనాటకాలకు బదులుగా చిన్న నాటకాలు అంటే మిక్కిలి తక్కువ కాలంలో ప్రయోగింపబడే నాటికలు నాటికాలు అనిపించుకున్నవి. ఏకాంకికలు అనిపించుకున్నది. ఏకాంకిక కళాత్మకమైన సాహిత్య ప్రక్రియ. ఏకాంకిక నాట కమే. అయితే చిన్న నాటకం అన్నంత మాత్రాన అది ఏకాంకిక అనిపించుకోదు. ఏకాంకిక ఒక విలక్షణమైన హహిత్య ప్రక్రియగా రూపుదిద్దుకున్నది. ఒక పెద్ద నాటకం కలిగించే ఆనందం, స్ఫూర్తి, ఏకాంకిక కలిగించ గలుగుతుంది. సామా జికులకు జీవితానికి సంబంధించిన ఒక ప్రధానాంశాన్ని, లేక ఒక చిన్న అంశాన్ని తెలియజేస్తుంది. ఆ అంశం ఆధారంగా ప్రేక్షకులు మానవ జీవితానికి సంబంధిం చిన ఒక మహా విషయాన్ని అవగతం చేసుకోగలుగుతారు. ఇప్పటి ఖండ కావ్యాలు మహాకావ్య స్ఫూర్తిని కలిగించినట్లే ఏకాంకికలు కూడా మంచి సంస్కారం ఉన్న ప్రేక్షకులకు ఆనందాన్ని, ఉత్తేజాన్ని విజ్ఞానాన్ని ప్రసాదిస్తాయి.

ఏకాంకికా లక్షణాలను స్థూలంగా ఇలా వింగడించి చెప్పవచ్చు.

వస్తు ప్రాధాన్యం అంతగా ఉండదు.

ఒకటో లేక రెండుసంఘటనల ప్రాయికంగా ఏకాంకికలో ఇమిడిపోతాయి

కథకంటే కథను తెలిపే తీరుకు ప్రాముఖ్యం ఎక్కువగా ఉంటుంది.

ఉపకథలకు ఏకాంకికలో అస్కారమే ఉండదు.

రసవైవిధ్యానికి, ఏకాంకికకూ చుక్కెదురు. ఏదో ఒక్క రసానికే ఏకాంకిక పరిమితమై ఉంటుంది.

కథలో చమత్కారానికి ప్రాముఖ్యం అంటే పాత్రల సంభాషణల్లో చమత్కారం ముఖ్యం.

రంగాలంకరణకు ప్రాముఖ్యం ఉండదు.

ఒకగంటకు తక్కువైన వ్యవధిలో అంటే నలుబదియైదు నిముషాలలో రచయిత తాను కోరుకున్న అంశాన్ని ప్రేక్షకులకు అందజేయగలగడం ఏకాంకికలోని ప్రత్యేకత. అందుకే ఏకాంకికారచన కష్టతరమని విమర్శకుల అభిప్రాయం. రచయిత ఒక్క క్షణం కానీ, ఒక వాక్యంగానీ వృధాచేయడానికి వీలులేదు. అయితే ఏదో ఒక చిన్న సంఘటననో, స్వల్పమైన సందేశమో ఎన్నుకుని సరిపెట్టుకోగూడదు. ఎంతో తీవ్రమైన సన్నివేశాన్ని ప్రదర్శించడం ఏకాంకిక ముఖ్యోద్దేశం కావచ్చు. కాని రచయిత ఆ తీవ్రమైన అంశాన్ని. మహనీయమైన విషయాన్ని అదుపులో పెట్టుకుంటాడు. ఒక చిన్నసంఘటనతో ఇమిడ్చివేస్తాడు. ఒక సమగ్ర జీవితాన్ని ఏకాంకికలో కుదించడం అసాధ్యమే. నిజానికి ఆ సన్నివేశం ఒక గంటకాలంలో జరిగితే దాదాపు అంతేకాలంలో దైనిందిన వాస్తవిక జీవితంలోనూ జరగాలె.

ఏకాంకికలో పాత్రలు ఎక్కువగా ఉండవు. ఎందుకంటే పాత్రల సంఖ్య ఎక్కువైతే కథా నిర్వహణంలో ఉత్కంఠను కలుగుజేయడంతో ఆటంకం ఏర్పడుతుంది.

స్త్రీ పాత్రలు లేకుండానే రక్తికట్టించవచ్చు.
ఏకాంకికలో ఒకే ఘటన, ఒకే అనుభవం,
ఒకే సందర్భం ఒకటో రెండు పాత్రలు దర్శనమిస్తాయి.

అన్నిటికంటే ముఖ్యమైన అంశం ఏకాంకికలో గతివేగం, కథాంశం వడివడిగా సాగిపోతూ ఉండాలె.

స్థూలంగా ఈ కొన్ని లక్షణాలను ఉతగా తీసుకుని ప్రయోక్తలు పాత్రప్రవేశంలో రంగాలంకరణంతో సంభాషణారీతుల్లో పలు పోకడలు పోయినారు.

ఏకాంకికలు పిల్లల కోసం కూడా ప్రత్యేకంగా వెలువడినవి. నృత్య గేయ ప్రధానంగా వెలువడి, నృత్య నాటికాలుగా, గేయ నాటికలుగా ప్రసిద్ధి పొందినవి

1985 నుంచి 'శ్రవ్య నాటిక' అనే ఒక కొత్త ప్రక్రియ పుట్టుకొచ్చింది. ఒక్క వాచికాభినయంలోనే మిగిలిన అభినయాల స్ఫూర్తిని పొదువుకొన్న ప్రక్రియ ఇది. సాధారణంగా రేడియోలో కాలపరిమితి తక్కువగా ఉంటుంది. కనుక పరిమిత కాలంలో ప్రయోగించటానికి ఏకాంకికకు మాత్రమే వీలుంటుంది. అయితే గంట కంటె ఎక్కువ కాలంలో ప్రయోగింపబడిన నాటకాలు కూడా రేడియోలో రాకపోలేదు. అయినా ఏకాంకికా రచనకు రేడియో అనువైన వాతావరణాన్ని కలిగించగలిగింది. ఏకాంకికల్లో దాదాపు తొంభై శాతం రేడియో కలిగించిన స్ఫూర్తి వల్లనే అవతరించినాయని చెప్పడంలో సాహసం ఏమీ లేదు.

కడచిన నాలుగు దశాబ్దాలో ఏకాంకికలు లేక నాటకాలు వ్రాయని రూపక రచయితలే అరుదు, విశ్వనాథ, శివశంకరస్వామి నోరి నరసింహ శాస్త్రి శ్రీశ్రీ, ఆరుద్ర, ఆత్రేయ, నారాయణరెడ్డి, దాశరధి, రజని. భమిడిపాటి కామేశ్వరావు, అనిశెట్టి, గొల్లపూడి మారుతీరావు, పినిశెట్టి, భమిడిపాటి రాధాకృష్ణ, సోమంచి యజ్ఞన్న శాస్త్రి మొక్కపాటి నరసింహశాస్త్రి, బుచ్చిబాబు, పద్మరాజు, వేటూరి ఆనందమూర్తి, బాపురెడ్డి, కొర్రపాటి గంగాధరరావు, ముదిగొండ లింగమూర్తి, రావికొండలరావు, వేలూరి శివరామశాస్త్రి, ఎస్. ఆర్ నంది, జి. వి. కృష్ణరావు, కృష్ణశాస్త్రి, గోరాశాస్త్రి, రాజమన్నారు. ప్రభృతులు అనేకగేయ, పద్య, వచనాలలో అనేక ఏకాంకికలను రచించి ప్రయోగింపజేసి ఈ ప్రక్రియకు ఒక విశేషస్థానాన్ని కల్పించగలిగినారు, సోమంచి యజ్ఞన్నశాస్త్రి లోకులు కాకులు, పెద్ధమనుషులు, ఆత్రేయ ఎవరుదొంగ, రాజమన్నారు మనోరమ, నార్లవారి అర్ధాంగి, దొంగ దొర గోపీగంద్ అభాగిని, ముదిగొండ లింగమూర్తి వెంకన్నకాపురం, పినిశెట్టి ఆడది రిక్షావాడు, బుచ్చిబాబు తెరపడని నాటకం, భమిడిపాటి రాధాకృష్ణ కీర్తిశేషులు. దంతవేదాంతం, మనస్తత్వం, గొల్లపూడి మారుతీరావు విలువలు, కళ్లు, రావి కొండలరావు కుక్కపిల్ల దొరికింది, రావూరి భరద్వాజ భానుమతి, వేణు దిష్టి బొమ్మలు, మొక్కపాటి, నరసింసాశాస్త్రి మొక్కుబడి. విశ్వనాధవారి పాముపాట కుందుర్తి ఆశ, నారాయణరెడ్డి ఊర్మిళ, సినీకవి కృష్ణశాస్త్రి ఊర్వశి, విద్యాపతి, రజిని చండీదాసు, బోయిభీకున్న కూలిరాజు, పారేరు కొర్రపాటి గంగాధరరావు

బంగారు సంకెళ్లు, వేటూరి శివరామశాస్త్రి సుల్తాని, ఎస్. ఆర్ నంది పుణ్యస్థలి, శ్రీశ్రీ 2001 ఆరుద్ర న్యాయాధికారి, కాటూరివారి మువ్వగోపాల, కరుణశ్రీ కరుణాకుయి, దాశరథిగారి వెన్నెలమడుగులు, రాధ ప్రేమ, గోరాశాస్త్రి నైట్ డ్యూటి చదువులరాణి ముద్దుకృష్ణ టీ కప్పులోని తుఫాను, చింతాదీక్షితుల వారి శబరి. మల్లవరపు విశ్వేశ్వరరావు వరూథిని, నోరి నరసింహశాస్త్రి గజ్జెలమొలత్రాడు, బి. వి. నరసరాజు ఆత్మహత్య, వాపస్, అంతరాత్మ కొండముది శ్రీరామచంద్ర మూర్తి తెర మరుగునీడలు, శ్రీమతి కల్యాణి పెండ్లికొడుకు వంటి ఉత్తమ వచన గేయ నాటికలను ఎన్నింటినైనా ఎత్తిచూప వచ్చును. ఏడిద కామేశ్వరరావు న్యాపతి రాఘవరావు, న్యాపతి కామేశ్వరి నార్ల చిరం జీవి, చెరుకుమిల్లి భాస్కర రావు ప్రభృతులు అసంఖ్యాకమైన బాలనాటికలను రచించి దాదాపు అన్నింటిని ప్రసారం చేయగలిగినారు. శివశంకరస్వామిగారు గేయ నాటికలకు శ్రీకారం చుట్టిన ప్రయోగశీలి శ్రీస్వామి వారు పెక్కు పద్యనాటికలను కూడా రచించి నాటికా ప్రక్రియను పాండిత్యంతో కళావిలసనంతో సమలంకరించ గలిగిలిన మనీషివతంసులు.

నాటికా ప్రక్రియా ప్రసరణానికి ఇతోధికమైన వాతావరణాన్ని కల్గించిన ఆంధ్రనాటక కళాపరిషత్తు కృషి అభినందనీయం.

ఏకాంకికా సంకలనాలు, శతాధికంగా ప్రచురింపబడనవి. నాటికా రచయిత లెందరికో పత్రికలూ, సాహిత్య సంఘాలు, సాహిత్య అకాడమీ సమాదరించినవి. ఏకాంకికల పోటీలు ఎందరో ఔత్సాహిక నటులను ఆకర్షించినవి. ఎందరో రచ యితలను పురికొల్పినవి. ఏకాంకిలపై విశ్వవిద్యాలయాల్లో పరిశోధనలు జరుగు తున్నవి.[1] హిందీ, ఉర్దూ, తమిళం, కన్నడం, బెంగాలీ, మరాఠి, మళయాళ

---

1. తెలుగులో గేయ నాటికలు : డా. తిరుమల శ్రీనివాసాచార్యులు పి. హెచ్.డి.
2. డా. జి. వి. కృష్ణారావు నాటికా సాహిత్య పరిశీలనం : సత్యరాణి మంగళగిరి ప్రమీలాదేవి ఎం. ఫిల్.
3. కందుకూరి వీరేశలింగం గారి ప్రహసనాలలో సాంఘిక దృక్పథం : పి. లోకాచారి ఎం.ఫిల్
4. తెలుగు ఏకాంకిక ఒక పరిశీలన : వనం మధుసూదన్ ఎం.ఫిల్
5. గోరాశాస్త్రి నాటికలు : ఎం. గిరిజాదేవి ఎం.ఫిల్

భాషల్లోని రసాత్మకములైన ఏకాంకికలెన్నో తెలుగు వేషం వేసుకున్నవి. జాతీయ సమైక్యానికి నాటికలు చెప్పుకోదగిన మేలు చేసినవి. ఏమీ చదువుకోనివాళ్లు కూడా ఇతర భాషల్లోని ఏకాంకికలను తెలుగులో చదివి, చూసి ఆయా భాషల రచయితల ప్రతిభా సామర్థ్యాలను తెలుసుకోగలిగినారు. ఈ సాహిత్య ప్రక్రియ కూడా సమైక్య శక్తులకు ఇంతగా తోడ్పడలేదు.

నేటి యాంత్రిక సమాజంలో ప్రజలకు విరామమే తక్కువ. అనుక్షణం ప్రతి వ్యక్తి పరిగెత్తుతున్నట్టు కనిపిస్తాడు. తెలియని గమ్యం వైపు మైమరచి పరుగులు తీస్తున్నాడు. ఒక రాత్రి అంతాకూర్చుని పెద్ద నాటకాన్ని చూసే స్థితిలో లేడు. కొన్ని గంటల తరబడి కూర్చుని ఒక మహా కావ్యాన్ని లేక ఒక పెద్ద పుస్తకాన్ని చదువలేడు. జీవితావసరాలను తీర్చుకోవడానికి నిరంతరం కష్టపడుతున్న మనిషికి ఆహ్లాదాన్ని అనుభవించడానికి రాను రాను అవకాశాలే తక్కువ అవుతున్నవి. కేవలం ఒక కళను నమ్ముకొని దాని ద్వారా బ్రతుకు బరువులీడ్చుకోవడం ప్రపంచంలోని బహు దేశాల్లో ఈనాడు సాధ్యమయ్యే పని కాదు. ప్రత్యేకించి భారత దేశంలో కవిత్వం, చిత్రలేఖనం, నృత్యం, అభినయం వంటి కళలు సుఖ జీవనానికి తోడ్పాటు కలిగించలేక పోతున్నవి. వృత్తి కళాకారుల కంటె ఔత్సాహిక కళాకారుల సంఖ్య నానాటికి పెరిగిపోతున్నది. పొట్టకోసం శ్రమించే వ్యక్తి కళకోసం పరిశ్రమించడానికి అవకాశాలు తక్కువగానే ఉన్నవి. ఔత్సాహిక కళాకారులు సుదీర్ఘమైన రూపక ప్రక్రియలను అవలంబించి నిశ్చింతగా జీవితం గడుపుకోలేదు. అనుక్షణం భయంతో బ్రతుకులీడుస్తున్న ప్రజలకు ఆనందాన్ని అనుభవించే అవకాశమే అరుదు. కనుకనే సూక్ష్మంలో మోక్షం అన్న పద్ధతిలో కళ అనుభవంలోకి రావాలని ఇప్పటి ప్రజల తహ తహ. అందుకే దీర్ఘకాల ప్రయోగం వల్ల సాధించే ప్రయోజనాలను అల్పకాల ప్రక్రియలు సాధించిపెట్టాలె. ఏకాంకికలకు నేటి సమాజంలో ఎక్కువ ప్రాచుర్యం కలగడానికి ఇదే కారణం. ఒకేసారి కూర్చుని నవలలను చదివేవాళ్ళ సంఖ్యకూడా నానాటికీ తగ్గిపోతున్నది. రోజూ కాస్సేపు, వారానికి కాస్సేపు, చదువుకోడానికి వీలుగా నవలలు ధారావాహికంగా పత్రికల్లో రావడానికి ఇది కారణం. కాలపరిమితి నియమం ఉన్న రేడియో, దూరదర్శన్ కూడా ధారావాహికమైన పద్ధతినే అవలంబిస్తున్నవి. ప్రచురితమవుతున్న, ప్రసారితమవుతున్న ఒక్కొక్క భాగంలో చాలా పనితనం, సమగ్ర

కథను అవగాహన చేసుకుంటున్నామన్న చిత్త సంస్కారాన్ని కలిగించగలుగుతున్నవి.

మొన్న మొన్నటిదాకా సాహిత్యాధ్యయనం తెలుగులో సంస్కృత నాటకానువాదాలతోనూ, స్వతంత్ర నాటకాలతోనూ ప్రారంభమయ్యేది. కాని అయిదు అంకాలున్న నాటకం, ఎన్ని కళా ప్రమాణాలకు ఆకరంగా ఉంటుందో, ఏకాంకిక కూడా అన్ని కళా ప్రమాణాలకు ఆకరమై ఉంటుంది. అయితే ఇది పరిమాణంలో చిన్నది కావచ్చు. నాటకానికి విలువ కట్టే యోగ్యత వస్తుంది ఏకాంకికను చూస్తే అన్ని మెలకువలను పాటించి ఒక్క ఏకాంకికను ప్రదర్శించడం మేలు పెద్ద నాటకాన్ని రచించడం ప్రయోగించడం చాలాకష్టసాధ్యమైనపని. రచన సాధ్యమేమోకాని ప్రయోగం మాత్రంకష్టం. పెద్దనాటకం సాధించే ప్రయోజనాలు ఏకాంకిక సాధిస్తున్నది.

ప్రజాస్వామ్య సమాజంలో కళా విలసనం ప్రజాధీనంగానే ఉంటుంది. నాటక రంగం సర్వ మానవుల్లోని కష్ట సుఖాలకు ప్రతిబింబం తరతమ భేదాలకు ఇది అతీతం. కవిత్వం వలెనే, సంగీతం వలెనే నాటక కళ ప్రత్యేకించి ఏమీ బోధించదు ఏ శాస్త్రీయమైన అంశాన్నీ నిరూపించదు. అయితే ఏది ఉత్తమమో ఏది సత్యమో తెలుసుకోగలిగే చిత్త సంస్కారాన్ని నాటక కళ మనిషిలో సృష్టించగలుగుతుంది.

నాటకం కష్టపడిన మనిషికి కొంత ఊరట కలిగించడానికీ, కొంచెం ఆనందాన్ని కలిగించడానికీ పుట్టిన కళ. అందుకే ఇది అందరికీ అంటే పండితులకూ, పామరులకూ, కలవారికీ, లేనివారికీ అర్థమయ్యే పద్ధతిలో ఉంటుంది. పాండితీ ప్రకర్షకూ, శాస్త్రీయ విశ్లేషణానికీ, ప్రత్యేకమైన ధర్మ ప్రచారానికీ, రాజకీయ పక్షాల ప్రచారానికీ నాటకం ఆలంబనం కాకూడదు. అంటే నాటకంలో ఇవన్నీ ఉండకూడదని కాదు. ఇవన్నీ నాటక రచయితకు ఉండాలె. ఆ సంస్కారంతో అతడు సమాజాన్ని చూడాలె. పాత్రలను కల్పించాలె. కథను అల్లాలె, కళాత్మకంగా మానవ జీవిత సమస్యలను చూడగలగాలె. ప్రేక్షకునికి తెలియకుండానే ఆలోచనలను హృదయంలో వెదజల్లాలె. ఆలోచించడాన్ని అలవరచాలే కాని రచయిత తన ఆలోచనలను కొట్టవచ్చినట్లు ప్రేక్షకులపై గుమ్మరించిగూడదు

ఒక్క నాటికకే కాదు సాహితీ సృష్టికంతటికీ ఇది వర్తిస్తుంది. కళాత్మక దృష్టికి ఇది అవసరం.

చిన్న కథ, లఘు కావ్యం వంటి సాహిత్య ప్రక్రియల్లోని అంతరార్థాన్నీ, రచయిత చిత్త సంస్కారాన్నీ అర్థం చేసుకోవడానికి కొంత పాండిత్యం అవసరం. వ్యంగ్య మర్యాదలతో పరిచయం అవసరం. కాని నాటకం పామరులను కూడా తన ప్రాంగణంలోకి ఆహ్వానించి ఆనందాల ఆమెతలను ఇస్తుంది.

'కన్యాశుల్కం' వంటి నాటకాలు, భమిడిపాటి కామేశ్వరరావు నాటికలు, చిలకమర్తి, వీరేశలింగం ప్రహసనాలు ఎంత పని చేసినాయో తెలుగు దేశంలో వివేకవంతులందరికీ తెలుసు. కనుక తక్కువ కాల వ్యవధిలో ఎక్కువ ప్రయోజనాలను సాధించిపెట్టే ఏకాంకిక ఈనాడు నాటకాన్నే మరిపించింది. ఇప్పుడు నాటకం అంటే నాటికే. ఏకాంకికే. ఒకప్పుడు నాటకం ఒక విధమైన రూపకం అనుకున్నవాళ్ళకు నాటకమే రూపకం. అదే విధంగా ఇప్పుడు రూపకం అంటే ఏకాంకిక, దీన్ని ప్రయోగించడానికి ఎక్కువ వ్యయప్రయాసలు అంతగా అక్కర లేదు. వస్తువు సాంఘికమైనదిగా ఉంటేనే ఎక్కువ ప్రయోజనాన్ని సాధించి పెట్టుతుంది కనుక, రంగాలంకరణం, ఆహార్యం వంటి సమస్యలవల్ల కలిగే బాధలు అంతగా ఉండవు. స్వల్పకాలికమైంది కాబట్టి రచయితకూ, ప్రయోక్తకూ, నటులకూ, ప్రేక్షకులకూ ఆయాసం ఉండదు.

పాశ్చాత్య సాహిత్య ప్రక్రియలు, ముఖ్యంగా ఏకాంకికా ప్రయోగ పద్ధతులు మన భారతీయ రచయితలను ఉత్తేజపరచినవి. ఫలితంగా ఎన్నడో మనలో ఉండి కనిపించకుండా పోయిన ఏకాంకిక మళ్ళీ హరివిల్లై కనిపిస్తున్నది. బహువర్ణరంజిత విద్యుత్కాంతులతో జిగేలుమంటున్నది.

నేనీ ప్రసంగంలో ఏకాంకికను విహంగ దృష్టితో మాత్రమే పరిశీలించినాను. ఈ ప్రక్రియ తెలుగులో ఏ విధంగా, క్రమవికాసాన్ని పొందిందో, ఈ ప్రక్రియకున్న సాంకేతిక లక్షణాలను ఏ విధంగా విశ్లేషించాలో నేనిక్కడ అంతగా తడుమరేదు. ప్రాజ్ఞులూ, భరతుని నాట్యశాస్త్రాన్ని, సుగమమైన పద్ధతిలో తెలుగు వారికి అందించిన మనీషులూ, ఉత్తమ పరిశోధకులు, డాక్టర్

పోణంగి శ్రీరామ అప్పారావుగారు వెలయించిన "తెలుగు నాటక వికాసం" అన్న సిద్ధాంత గ్రంథాన్నీ, ఆచార్య కె వి ఆర్. నరసింహంగారు వ్రాసిన "సాహిత్య దర్శనము" చదివితే సవివరంగా ఏకాంకిక స్వరూప స్వభావాలు, ఉద్గమ వికాసాల వివరాలు తెలిసివస్తాయి. ఈ అల్పకాల వ్యవధిలో నేనుచేసిన ఈ ప్రయత్నం ఏకాంకికలపట్ల ప్రణయ భావాన్ని పెంపొందించగలిగితే ధన్యుణ్ణే నాకీ అవకాశాన్ని కల్పించిన "యువభారతి"కి అభివందనం.

"నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనం"




"చుట్టూరా ఆవరించుకుని వున్న
చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం
కంటె, ప్రయత్నించి ఎంత చిన్న
దీపాన్నయినా వెలిగించడం మంచిది"





# యువభారతి కార్యాలయం

ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

Cover Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyderabad-20.